కలౌ వేంకటనాయక:



శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తుడు

# కుమ్మరి భీమన్న

అను

# కురువరతినంబి కథ

(నాటకం)

రచన :

అల్లీ రామకృష్ణ,
క్రాస్‌రోడ్స్, కలికిరి - 517 234
చిత్తూరు జిల్లా

This book is published with the financial assistance of Tirumala Tirupati Devasthanams under Aid to Authors Scheme for Religious Publications.

# కుమ్మరి భీమన్న
# అను కురువరతి నంబి కథ (నాటకం)

**రచన, ప్రచురణ :**

అల్దీ రామకృష్ణ

ప్రథమ ముద్రణ: నవంబరు, 1999

ప్రతులు : **1,000**



ముద్రణ :

విజయవాణి ప్రింటర్స్,
చౌడేపల్లి - 517 257,
చిత్తూరు జిల్లా.
☎ : 08581 - 56234, 56239

వెల : **20/-**

**ప్రతులకు :**

ఏ. లోకేశ్ మణికంఠ,
S/o అల్ది రామకృష్ణ, బి.ఎ., బి.ఇడి.,ate...
క్రాస్ రోడ్స్, కలికిరి - 517 23
చిత్తూరు జిల్లా.
☎ : 08586 - 57820

# అంకితమ్



"తలమేల కులమేల తపమే కారణము
ఎలమి హరిదాసులు ఏ జాతి అయిననేమి,

ఏమి వలసిన నిచ్చు నెప్పుడైనను
యేమర గొలిచిన నితడే దైవము

ఎల్లలోకములకు అప్పడగు
తిరువేంకటాద్రీశుడు,

కొండంత వరములు గుప్పెడు
కొండలలో నెలకొన్న కోనేటి రాయుడు . . .

✣✳✣ ✣✳✣ ✣✳✣

భక్తి ముఖ్యము కాని సంపదలు కావు
గుణము శ్రేష్టమైనదికాని కులము కాదు
మానవత్వ మెక్కువ కాని మతము కాదు
అంచు చూపెడు శ్రీపతి అంఘ్రులకును.....

ఈ చిన్ని పొత్తం అంకితం

అల్లీ రామకృష్ణ

# ప్రస్తావము

భవిష్యోత్తర పురాణంలో పేర్కొనబడిన కుమ్మరి భీమన్నను గురించే పదకవితా పితామహుడైన అన్నమాచార్యులు తన కీర్తనలో "కుమ్మరదాసుడైన కురువరతినంబి - ఇమ్మన్న వరములెల్ల నిచ్చినవాడు - కొండలలో నెలకొన్న కోనేటిరాయడు" అని ప్రస్తావించాడు. అందుకు ఈనాటకానికి 'కురువరతినంబి కథ' గా కూడా పేర్కొనడం జరిగింది. అయినా ఈ నాటకానికి మూలం భవిష్యోత్తర పురాణంలోని కథలే.

ఈ భీమన్న అపూర్వరీతిలో శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని ప్రస్తుతించాడు. తొండమాన్ చక్రవర్తి కూడా మరో పద్ధతిలో స్వామివారిని స్తుతించాడు. అవి సంస్కృతంలో ప్రస్తావింపబడ్డాయి. ఆ స్తోత్రాలను సందర్భానుసారంగా ఈ నాటకంలో వచన, పద్య దండక రూపాల్లో అనుసరించడం జరిగింది.

తిరుపతి నుండి తిరుమలకు పోవు నడక దారిలో శ్రీవారి పాదముద్రలు, తలయేరు గుండు తటస్థపడుతాయి. ఆ దారిలోనే శ్రీవారిని మట్టిపూలతో పూజించి సాయుజ్యం పొందిన కురువరతి నంబి బొమ్మలు చూడవచ్చు.

నూతన గృహ నిర్మాణాన్ని మన ఆలోచనల ప్రకారం అభిరుచులకు తగినట్లుగా నిర్మించుకోవచ్చు కానీ పురాతన జీర్ణభవనోద్ధరణ చేస్తూ తీర్చిదిద్దాలంటే శ్రమతో పాటు కొన్ని జాగ్రత్తలు తీసుకోవలసి ఉంటుంది. మొదట శిథిల భాగాలను గుర్తించాలి, తర్వాత అందుకు కావలసిన సామగ్రిని సేకరించుకోవాలి, పూర్వ రూపం చెడకుండా చూచుకోవడమేగాక కొంగ్రొత్త మెరుగులు దిద్దటానికి కొంత చొరవ చూపాలి. అటు పిమ్మట కావలసిన హంగులు సమకూర్చినప్పుడే - అదో నూతన భవనంలాగ అందరినీ ఆకట్టుకుంటుంది. ఇందు కోసం ఎందరి సహాయ సహకారాలనో పొందవలసి ఉంటుంది.

పురాణాంతర్గత కథలను సేకరించి వాటికో రూపం తేవడం కూడా జీర్ణ భవన పునర్నిర్మాణంలాంటిదే.

ఈ నాటక నిర్మాణ రూపం పాఠక ప్రేక్షకుల సుమనో దృష్టికి ఆనినప్పుడే నా యీ శ్రమకు సార్థక్యం సాధ్యమతుతుంది.

నేనితః పూర్వం సేకరించి - పొ.శ్రీ. తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ప్రచురించిన "వినాయకుడి కథలు" (గణపతి కథా కదంబం) కాణిపాకం శ్రీ వరసిద్ధి వినాయక స్వామివారి సన్నిధిలో, ఆ దేవస్థానంలోనే ప్రప్రథమంగా పుస్తకావిష్కరణ కావించిన పాలక మండలి, చిత్తూరు జిల్లా రచయితల సంఘం నాకిలాటి ఆధ్యాత్మిక రచనల పట్ల మరింత ఆసక్తినీ, ప్రోత్సాహోత్సాహాలను కలిగించారు. వారికి నా అభివందనములు.

కలికిరి,

13-11-1999.

- అల్లీ రామకృష్ణ

# పరిచయము

"కొండలలో నెలకొన్న కోనేటి రాయుడు వాడు...." అనే అన్నమాచార్యుల వారి సంకీర్తనని ఎరుగనివారుండరు. అందులో కురువరతి నంబి అనే కుమ్మరిదాసునీ తొండమాన్ చక్రవర్తినీ ప్రస్తావించారు పద సంకీర్తనాచార్యులవారు. ఎవరా కుమ్మరిదాసు? అంతటి తొండమాన్ చక్రవర్తి సరసన స్థానం పొందడానికి అతనికిగల అర్హత ఏమిటి? అసలు వీరికీ తిరుమలలోని వెంకన్న దేవళానికీ ఉన్న అనుబంధం ఏమిటి? బంగారు పూలు మట్టిపూలుగా ఎందుకు మారాయి? ఆ మన్నుకి మన్నన ఎలా దక్కింది? అనుకోవాలేగానీ అన్నీ ప్రశ్నలే. వాటన్నింటికీ విడమరచి వివరాలందించే నాటకమిది. దీని వెనుక ఎంతో శ్రమా పరిశీలనా పరిశోధనలతోబాటు భక్తి శ్రద్ధలున్నాయి. కనుకనే ఇది విశిష్టమైన రచనగా మిగిలింది.

సులువు తెలిసి రాసిన నాటకం గనక ప్రదర్శన కూడా సులువే.

అల్లీ రామకృష్ణగారికి రాయడమన్నా రాసేవారన్నా తగని అపేక్ష ఎవరేం రాసినా చదివి సంతోషిస్తారు, ప్రోత్సహిస్తారు. తను రాయవలసి వస్తే మాత్రం భక్తిని అతిక్రమించరు. హరిహరసుత శతకం, గణపతి కథాకదంబం, ఇప్పుడీ నాటకం....

ఎంతో కవిత్వమూ, కథలూ, నవలా ఇలా ప్రచురించాల్సినవి ఇంకా ఎన్నో ఉన్నాయి. అన్నీ ఒక్కొక్కటీ వెలుగులోకి రావాలని ఆశిస్తూ....., వస్తాయని ఎదురు చూస్తూ.....

"కళ్యాణాద్భుతగాత్రాయ కామితార్థ ప్రదాయినే....."

బుధజన విధేయుడు

11-11-99,
హైదరాబాదు.

జొన్నవిత్తుల శ్రీరామ చంద్రమూర్తి
స్క్రిప్ట్ రైటర్,
ఉషాకిరణ్ మూవీస్,
హైదరాబాదు.

# కుమ్మరి భీమన్న గురించి .....

([redacted])

అల్లీ రామకృష్ణ అప్రతిమాన ప్రతిభా విశేషము గల రచయిత అయన తన రచనలో సర్వసాధారణముగా అంతకు ముందెన్నడు ఎవ్వరు వినని అనేక వినూత్నాంశములు చేర్చి రసమయ మొనరింతురు. పరిశోధిత విషయమును ఔచిత్య స్ఫూర్తితో సర్వాంగ సుందరముగా సందర్భానుసారముగా సమన్వయించి కవితా సారమును అపార భక్తి ప్రపత్తులతో ప్రగాఢ ప్రత్యయముతో అందరికీ అందించుట అయన పరమాశయము. 'వినాయకుడి కథలు', 'అయ్యప్ప స్వామి గేయ మాలిక', 'హరిహరసుత శతకము' మొ॥నవి వీరి కృతులు.

ప్రకృతకృతి కురువరతినంబి కుమ్మరి భీమన్న కథ ఒక రూపకము. ఈ ప్రయత్నమింతవరకు సాహిత్య చరిత్రలో ఎవ్వరు చేయలేదు. ఇట్టి పనికి నాంది పలికిన కవి శ్రీ అల్లీ రామకృష్ణ "కురువరతినంబి దాసుడౌ కుమ్మరి యెడ - ప్రీతి నిమ్మన్న వరములు వేంకటేశుడిచ్చెనని అన్నమయ్య కీర్తించె గాని - భక్తుని గురించి వివరముల్ పలుక లేదు" 32 వేల కీర్తనలలో ప్రస్తుతము లభ్యమైన వానిలో ఎక్కడనో ఒక్కచోట సూచనగా తెల్పిన వాక్యమే ఈ కృతికి పరమ ప్రమాణము. ఇట్టి భక్తుని కథ రసవత్తరముగా కవి తాను కొందరు ప్రసిద్ధుల వలన విన్నవి కన్నవి ప్రచారములో అనగా వదంతిలో ఉన్నవి చేర్చి పోతనవలె భక్తి భావముతో తెలియవచ్చినంత తేటపరచినాడు. ఈపకముగా రూపొందించుటలో పోతనవలె కేవలము వినయము ప్రదర్శించిన చాలదు. విషయమును సేకరించుటలో వ్యయప్రయాసలు సాధక బాధకములున్నవి. అన్నింటిని ఎంతో ఓర్పుతో నేర్పుతో వింగడించుకొని సమరస భరితముగా సమన్వయ సంశుద్ధితో ఔచిత్య భంగము లేకుండ రచింపవలసియున్నది. ఎక్కడనో భవిష్యోత్తరములో ఈ కులాలుని కథ ఉన్నట్లు వినికిడి. ఈ భీమన్న కథకు సంబంధించి పూర్వాపరములు సమకూర్చుకొని, అవసరమైన చోట్ల కొన్ని కల్పనలను జోడించి రూపకమును నిర్మించిన తీరు ప్రశంసాహము. ఇది టి.టి.డి. ఆర్థిక సాహాయ్యముతో ముద్రితమగుట ఎంతో సంతోషప్రదము. తప్పక ఈ కృతి ఆంధ్రావళిమోదముంబొరయునట్లు బహుళ ప్రచారమును పొంది అల్లీ రామకృష్ణ ఆశయములను లోకమునకు వెల్లడించుగాక. ఇంతకు మునుపెవ్వరు చేపట్టని యిట్టి కృతులెన్నో ఈ రచయిత రచించి శాశ్వత కీర్తి ప్రతిష్ఠలు గడించుగాక!

డా॥ మల్లెల గురవయ్య, M.A., Ph.d.
రిటైర్డ్ ప్రొఫెసర్, బి.టి. కాలేజ్,
మదనపల్లి.

# ఆకాంక్ష

డా॥ శ్రీ మేడసాని మోహన్, M.A., Ph.D.,
సహస్రావధాని,
అన్నమాచార్య ప్రాజెక్టు స్పెషల్ ఆఫీసర్,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

"నతజ్ఞానం నతచ్ఛిల్పం నసావిద్యా నసాకలా ।
నాసౌ మోగోన తత్కర్మ నాట్యేస్మిన్ యన్నదృశ్యతే ॥"

ఋషికల్పుడు, కళాస్రష్టయైన భరతముని నాట్యశాస్త్రంలో నాటకం యొక్క వ్యాపకత్వాన్ని తెలియజేశారు.

దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినామ్ ।
విశ్రాంతి జననం కాలే నాట్యమే తద్ భవిష్యతి ॥
ధర్మ్యం యశస్యమాయుష్యం హితం బుద్ధి వివర్ధనమ్ ।
లోకోపదేశ జననం నాట్యమే తద్ భవిష్యతి ॥

పండిత, పామర భేదం - వృద్ధ, శిశు భేదం లేకుండా ఆర్తులందరకూ ఆనందాన్ని, ధర్మనిరతిని, హితాన్ని, కలిగించే వినోదం నాటకం. ఇందులో అన్ని రసాలను ప్రదర్శించి లోకహితాన్ని పెంపొందించే జ్ఞానోపదేశ ప్రక్రియ. అందుకే చిత్త నిత్యస్థిత శివ స్వరూపుడైన మహాకవి కాళిదాసు మాళవికాగ్ని మిత్రంలో.

దేవానా మిద మామనంతి మునయః శాంతం క్రతుం చాక్షుషం
రుద్రేణేదముమాకృత వ్యతికరే స్వాంగే విభక్తిం ద్విధా ।
త్రైగుణ్యోద్భవమత్ర లోక చరితం నానారసం దృశ్యతే
నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనమ్ ॥

నాట్యం సంగీత - సాహిత్య - నృత్యాలకు కూడలివంటిదన్న పై అభిప్రాయాన్ని, ఆధునిక ఆర్షహృదయవరేణ్యులు ముక్త కంఠంతో అంగీకరిస్తున్న విషయం సువిదితమే.

కాని నేటి గతి శీలక సాహిత్యంలో, సంగీత ప్రపంచంలో వచ్చిన అనూహ్య నాగరిక పరిణామాలను అనుసరించి, నృత్య రూపకాలకు ప్రాధాన్యం హెచ్చింది. వచన నాటకాలకు కొంత ప్రాధాన్యత తగ్గింది. ఈ కొరత తీర్చడానికా అన్నట్లు ఇటీవల కొంత మంది ధార్మిక దృష్టికల రచయితలు పౌరాణిక, ఇతిహాసిక నవలలను, ఖండకావ్యాలను, నాటకాలను విరచిస్తున్నారు. ఇది సాహిత్య ధార్మిక సంస్కృతులలో ఉన్నతిని పెంపొందించే హర్షణీయ పద్ధతి.

ఈ నేపథ్యంలో అల్లీ రామకృష్ణ కలియుగ ప్రత్యక్ష దైవం శ్రీ వేంకటేశ్వర స్వామి వారి భక్తుడు కుమ్మరి భీమన్న అనే 'కురవరతి నంబి కథ' నాటకంగా రచించారు. కేవలం 8 మంది పాత్రలతో ఈ నాటకాన్ని రూపొందించడం ఒక ప్రత్యేకత.

భవిష్యోత్తర పురాణంలో పేర్కొనబడ్డ కథ ఆధారంగా వీరు ఈ నాటకాన్ని రచించారు. ఈ కథను వరాహపురాణం కూడా పేర్కొని ఉన్నా సవిస్తరంగా భవిష్యోత్తరమే తెలియజేస్తున్నది. ఈ రెండు పురాణాల్లో ఈ కథ పట్ల సాదృశ్య - వైదృశ్యములున్నాయి.

భగవంతుడు భక్తుల అహంకారాన్ని పోగొట్టి, వారికి వినయాన్ని పెంపొందిస్తాడని - భగవానునికి భక్తుని హృదయమే ప్రధానం, అతడిచ్చే కానుకలు, పదార్థ విశేషాలు కావన్న సత్యాన్ని తెలియజేసే మహత్తరమైన ఇతివృత్తం ఇది. శ్రీనివాసుడు తొండమానునకు భీముని కథ వివరించునట్లు రెండు పురాణాల్లో సమానంగా ప్రతిపాదించబడింది.

**యదా ప్రకాశితా పూజా, యదా రాజా సమాగతః ।**
**తొండమాంస్తేన సంవాదస్తదా మోక్షం గమిష్యసి ॥**
**ఇతి పూర్వం పరందేవో దత్తవాన్ వేంకటేశ్వరః ।**
(వరాహ.పు. II 10-9)

నీ పూజ ఎప్పుడు సమస్తలోకానికి తెలుస్తుందో తొండమాన్ చక్రవర్తి వచ్చి సంభాషిస్తాడో అప్పుడు నీకు మోక్షము లభిస్తుందని సాక్షాత్తూ సారసనేత్రుడు తెలియజేయడం - భక్త ప్రజాంతరంగ వాంఛా ప్రదాయియైన స్వామి మనోరథం చక్కగా ప్రతిపాదింప బడింది.

ఇటువంటి దివ్యమైన, భవ్యమైన ఇతివృత్తాన్ని నాటకంగా రూపొందించాలన్న తలంపు కలగడం శ్రీ రామకృష్ణగారి భక్తితత్పరతకు నిదర్శనం. ఈ నాటకంలోని 15 రంగాల్లో ఉన్న సంభాషణలన్నీ అకృతకంగా, అత్యంత సహజంగా ఉన్నాయి. ముఖ్యంగా 10వ రంగంలో ఉన్మాద దశలో ఉన్న తొండమాన్ నృపాలుని మానసిక స్థితి ప్రతిబింబించేట్టుగా రచంబత సంభాషణలను రూపొందించడం ప్రశంసనీయం. ఇట్టి స్థితి ప్రతి భక్తునికి ఒక్కో విధంగా అనుభవంలోకి వస్తుంది.

భీమన్న సంభాషణల్లో రచయిత వహించిన జాగరూకత - ఆ పాత్రను, పాత్రపట్ల ఉన్న గౌరవాన్ని చిరకాలం భావుకులు గుర్తుంచుకొనేట్లుగా తీర్చిదిద్దడం జరిగింది. మాటల పొందికలోనేకాక, సందర్భోచితంగా శ్రీ రామకృష్ణ రమణీయమైన గీతాలను కూడా నాటకంలో చేర్చిన తీరు అపూర్వమని భావిస్తున్నాను. శ్రీ రామకృష్ణగారు మరిన్ని భక్తిరస ప్రధాన నాటకాలను రచించి భక్తకోటికి ఆనందాన్ని కలుగజేస్తారని ఆశిస్తున్నాను.

11-11-99,
తిరుపతి.

(డా॥ శ్రీ మేడసాని మోహన్)

# మట్టిపూలు

శ్రీ అల్లీ రామకృష్ణ ఇంతకు ముందు నాకు తెలీదు. మా రామోజీ ఫిల్మ్ సిటీ కథా విభాగంలో పని చేస్తున్న మిత్రుడు జొన్నవిత్తుల శ్రీరామచంద్రమూర్తి ద్వారా ఈ రచయిత గురించి విన్నాను. ఉపాధ్యాయ వృత్తిలో ఉండి, రచనా వ్యాసంగానికి రామకృష్ణ ఎంత అతుక్కుపోయి ఉన్నారో తెలిసి సంతోషించేను. ఇప్పుడు వారి నాటకం "కుమ్మరి భీమన్న" చదివే అవకాశం లభించినందుకు ఆనందిస్తున్నాను.

నాటకం రాయడం అన్నా, రాసేవాళ్ళన్నా నాకు చాలా ఇష్టం. కథ, నవల, నాటకం తాలూకు మూడు పుస్తకాలు నా ముందుంటే - నేను మునుముందుగా నాటకమే చదువుతాను. కొన్ని నాటకాలు చదవడానికి బావుంటాయి. ప్రదర్శన రక్తి కట్టకపోవచ్చు. పాత్రధారుల ఎంపికలో అవకతవకలు, ప్రదర్శనకు అవసరమైనహంగు ఆర్భాటాలలో లోటుపాట్లు, అందుక్కారణం కావచ్చు. అందుచేత మంచి నాటకం రాయగానే సరిపోదు. ప్రదర్శన రక్తికట్టే అదృష్టం కూడా కలిసి రావాలి. నవలా, కథ సాదా సీదా కిళ్ళీలయితే నాటకం మాత్రం జర్దా కిళ్ళీ! రాయడంలోనూ, రాసిందాన్ని చేయడంలోనూ 'పనితనం' చాలా అవసరం. ఎక్కడ దెబ్బకొట్టినా అనుభవం లేనివాడి నోట్లో జర్దా కిళ్ళీ అవుతుంది!

ఇక "కుమ్మరి భీమన్న" విషయానికొస్తే - ఇది భక్తిరస ప్రధానమైన నాటకం. అందునా శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తుని కథ. ఇల్లాంటి నాటకం రాయాలంటే రాసే రచయితకు - నాటకం రాసే ఆర్టుకంటె భక్తి పట్ల అనురక్తి ఎక్కువగా ఉంటుందని ఈ నాటకం చదివి తెలుసుకున్నాను. అవకాశం లభిస్తే ప్రదర్శన కూడా చూచి ఆనందించాలను కుంటున్నాను.

భక్తితోపాటు రచయిత రామకృష్ణ ఈ నాటకంలో కొన్ని హితవులు చెప్పేరు. అవన్నీ నూటికి నూరుపాళ్ళు ఆచరించ తగ్గవి. మచ్చుకి ఒకటి - "వృత్తులు అవసరాన్ని బట్టి ఏర్పడ్డాయి. అంతేకానీ వృత్తులను బట్టి గౌరవాగౌరవాలను నిర్ణయించడం సంకుచిత మనస్తత్వానికి గుర్తు".

చివరిగా -

"భీమన్నా! నీ వృత్తి ధర్మాన్ని విడువలేదు నీవు. ఎవరైనా వేనితో పూజించారు అనేది కాదు ముఖ్యం. ఎలా కొలిచారు అనేదే ముఖ్యమైనది. నీవు మట్టిపూలతో నన్ను పూజించినందుకు తగిన వరాన్ని ప్రసాదిస్తున్నాను భీమన్నా! జాగ్రత్తగా విను. తిరుమలలో పూజారులు నా కర్పించే నైవేద్యాలకు, అన్న ప్రసాదాలకు మట్టి కుండలే ఉపయోగించాలనే నియమం విధిస్తున్నాను. ఈ మట్టి పాత్రలు కూడా నీ వారసులు మాత్రమే తయారు చేసినవై ఉండాలి. దేవాలయ అర్చకులు అలా నీ వారసులు చేసిన మట్టి పాత్రలను ఉపయోగించి నమర్పించి ఇచ్చిన నైవేద్యమే నాకు సంతృప్తినిస్తుంది" అని స్వామివారు భీమన్నకు అనుగ్రహించిన వరాన్ని విన్న తర్వాత ఈ నాటకానికి "మట్టిపూలు" అనే పేరు పెట్టుకుంటే బావుండేదనిపించింది. ఇది నా అభిప్రాయం మాత్రమే. మంచి నాటకం రాసినందుకు శ్రీ అల్లీ రామకృష్ణను మనసార అభినందిస్తున్నాను.

హైదరాబాదు, (ఆదివిష్ణు)

17-10-1999.

ఓం శ్రీ రామాయ ఓం శుభమస్తు

# కురువరతి నంబి కథ

## (నాటకం)

ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే ।
విన్దేమ దేవతాం వాణీ మమృతా మాత్మనః కళామ్ ॥ (భవభూతి)

పరిశోధనాత్మకాలైన శ్రీ అల్లీ రామకృష్ణగారి రచనలను గురించి వ్రాయాలంటే ఎవరికైనా అదో పరీక్ష. నామటుకెంతవరకు సాఫల్యం దక్కుతుందో సహృదయ పరీక్షకులే తేల్చవలసి ఉంటుంది. నా మటుక్కి నా ప్రయత్నం నేను చెయ్యటానికి సిద్ధమౌతున్నాను-

"నాటకాంతంహి సాహిత్యమ్" అంటే సాహిత్య పాఠక్రమంలో చివరిగా నాటక విషయం గ్రహించాలని తాత్పర్యం. శ్రవ్యకావ్యం వరకూ అయితే పాత్రల రూపురేఖలతోపాటు వారి చర్యలను కూడా వర్ణనలలో మాత్రమే ప్రకటంచొతాయి. కవి ఎంత చమత్కారమూ అలంకార ప్రాభవమూ చూపినా అసలువి మరుగున పడిపోయే అవకాశం ఉంటుంది. కీ.శే. వడ్డాది పాపయ్యగారనే ప్రసిద్ధ చిత్రకారుడు ఒకసారి ప్రబంధనాయిక అనిపేరు పెట్టి ఆ నాయిక ముఖం ఉండే చోట చంద్రుడినీ - అందులో మళ్ళీ కళ్ళుండే చోట చేపలనీ, ముక్కుండే చోట సంపెంగనీ, పెదవుల చోట దొండపండునీ, చెవులుండే చోట శ్రీ కారవర్ణాలనీ ఇలా ఉపమానాలన్నింటినీ అమర్చి దిద్ది స్త్రీ అనుకోవలసిన చిత్రాన్ని రచించి ('యువ' అనుకొంటాను) పత్రికలో ప్రకటించారు. ఆ ఉపమానాల మధ్యలో స్త్రీ రూపలావణ్యాలు మనకు అంతుపట్టవు. అదీ శ్రవ్యకావ్యపాత్రల స్థితి. కాగా ఆ పాత్రల కొప్పిన పాత్రధారుల యందు తత్తదాహార్యవాచికాల మరించి ప్రదర్శన కవకాశమున్న దృవ్యకావ్యమనబడే నాటకంలో ఆ పాత్రలు మన కనులముందాడి గుండెల్లో ముద్రపడిపోయి గుర్తువచ్చినప్పుడల్లా ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. ప్రేక్షక శ్రేష్ఠులంగా విజ్ఞాన వంతులంగావచ్చు మనం. అలా రూపాలు కట్టి చూపించటాన్ని బట్టి నాటకానికి రూపకం అని కూడా పేరుంది.

"అవస్థానుకృతి ర్నాట్యం రూపం దృశ్యతయోచ్యతే
రూపకం తత్సమారోపాత్ ।" (దశరూపకమ్ 1 - 7)

ప్రసిద్ధ దశ రూపకాల్లో నాటకం ప్రథమమూ ప్రధానమూ అయింది.

'కురువరతి నంబి కథ' అనే నాటకంలో కథ భవిష్యోత్తర పురాణాలంబనమైనది కావటం చేతను ప్రథమ సంకీర్తనాచార్యుడు తాళ్ళపాక అన్నమాచార్యుడు తన "కొండలలో నెలకొన్న కోనేటి రాయడు వాడు" అన్న కీర్తనలో స్పష్టంగా "కుమ్మరదాసుడైన కురువరతి నంబి ఇమ్మన్న వరములన్నీ ఇచ్చినవాడు" అంటూ స్పష్టంగా పేర్కొని ఉండటంచేతనూ ఈ నాటకేతివృత్తము నిశ్చయంగా ప్రఖ్యాత మన్నదే.

రెండో విషయం ఇతివృత్త నాయకుడికి సంబంధించినది. నాటక నామాన్నిబట్టీ భక్తి ఫలానుభవ సిద్ధిని బట్టీ కురువరతినంబిగా ప్రఖ్యాతిగన్న భీమన్నయే నాయకుడనిపిస్తాడు. కానీ భక్తమనోవిహారియై తొండమాను చక్రవర్తి యొక్క భక్తిలో పొడసూపిన అహంకార శల్యాన్ని తొలగించటానికీ భీమన్న నిష్కల్మష భక్త జనసేవా ప్రశాంత భక్తికి శ్రీపతి రూపంలో దాస ప్రవర్తనచే అనుగ్రహించటానికీ మూలమైన శ్రీ వేంకటేశ్వరస్వామియే అసలు నాయకుడు. ఎక్కువగా కలలలోనూ స్వస్వరూపంతో చిట్టచివరలోనూ మాత్రమే నాటకంలో కనిపించినా మానవ శ్రీపతి రూపంలో ఆయన విభూతి ఎక్కువగానే దర్శన మియ్యటం ఉంది. దుష్ట నివారణా శిష్ట ఆదరణా సమతూకంగా ప్రదర్శించిన ధీరోదాత్త నాయకుడా తిరుమల శ్రీవేంకటేశ్వర స్వామి. ఆయనే ఈ నాటక నాయకుడు.

మూడోది రస విషయం, వీరశృంగారాల్లో ఏదో ఒకటి ప్రధాన రసం కావాలనేది నియమం. తక్కిన రసాలన్నీ సందర్భానుసారంగా ఉండవచ్చు. పాత్ర తత్వానుగుణంగా ఉండాలి.

నహ్యేకరసం కావ్యం కించిదస్తిప్ర యోగతః ।
భావోవాపి రసోవాపి ప్రవృత్తి ర్వృత్తిరేవవా ॥
బహూనాం సమవేతానాం రూపం యస్యభవేద్బహు ।
సమన్తవ్యోరసః స్థాయీ శేషాస్సంచారిణో మతః ॥

అంటే అదే "కురువరతి నంబి కథ" నాటకంలో కూడా కరుణాద్భుతాది యితర రసాలు ఉన్నా ధర్మవీరమే ప్రధానంగా ఉండి వీర రసమే అంగిరసం ఔతుంది. తిరుమల వేంకటేశ్వరస్వామి

తన చినమామ అయిన తొండమాను చక్రవర్తి మీద అలిగాడు. అది క్రోధం కాదు. ఆయన అపరాధం స్వయంగా తెలుసుకొని పశ్చాత్తాపం కలిగించి ఆ తప్త హృదయంలో జ్ఞానజ్యోతి వెలుగొందేటట్లు చేసే ప్రయత్నమూలకమైన అలక అది. ఆ దేవుని యందు తత్ప్రయత్న పరమైన ఉత్సాహం అది. ఉత్సాహం వీర రసానికి స్థాయి భావం. భూపాలుని గర్వ నివారణం కులాలుని సమాదరణంలో శ్రీవేంకటేశ్వరుని ఉత్సాహం శ్రీపతి పేరున మానవావతారంలో ప్రస్ఫుటమౌతుంది.

"స్నేహం దయాం తథాసౌఖ్యం యదివాజానకీ మపి" (ఉత్తర రామచరిత్ర) అన్న శ్రీరామ భావాన్ని "యదివా ధ్యానినామపి" గా గమనించిన అదే శ్రీవేంకటేశ్వర స్వామి భావంగా ఉన్నట్లు ఈ నాటక సారాంశం కావటం వల్ల గ్రహించవచ్చు. ఆ విధంగా శ్రీవేంకటేశ్వర స్వామి ధీరోదాత్త నాయకుడే. ఆయన ప్రదర్శించింది ఉత్సాహమనే స్థాయి భావమే. అది ప్రస్ఫుటంచేసింది వీర రసాన్నే, ఆ వీరం కూడా ఉత్కృష్టమైన ధర్మవీరం. ఆయన సాక్షాత్తు కలియుగ దైవం కదా! అట్లా 'కురవరతి నంబి కథ' నాటకం యొక్క ఇతివృత్తం వీర రసప్రధానమైందే.

ధ్యాన పూజానిష్టల తపన ప్రదర్శించిన తొండమాన్ చక్రవర్తినీ అలాగే నిరంతరం వేంకటేశ్వర - ఆ దైవభక్త సేవా పరాయణమైన మనోవ్యాపారం ప్రదర్శించిన కురువరతి నంబినీ మనసులో పెట్టుకొని వారి భక్తి ఇతివృత్తం మూల విషయంగా తలంచిన వారికి ప్రధాన రసం భక్తి రసంగా భ్రాంతి కలిగించవచ్చు. భక్తి ఒక రసంగా పై అలంకారిక శ్లోకంలో పేర్కొనబడలేదు. ఒకవేళ భక్తి కూడా ఒక రసమే అనుకొన్నా ఆ రసనాయకుడెవరు అంటే ఇద్దరు కనపడుతున్నారు గదా! అందులో ఇతి వృత్తఫల తారతమ్య పరీక్ష చేసి ఆధిక్యతను పరిగణించి కురువరతినంబి కా పట్టం కడదామంటే శ్రీవేంకటేశ్వరునికి ఆనంద నిలయాలయమూ ప్రాకారాదికాలు నిర్మించీ, బాంధవ్యం వహించీ ఎప్పుడైనా శ్రీవారితో సంభాషించే చనువు గడించీ ఉన్నదానికంటె బొందితో వైకుంఠయానం చేసినదేపాటి అధికమైంది! వైకుంఠంలో కురువరతినంబి అక్కడి నారాయణునితో పై పనులు చేయగల యోగ్యతగల స్థానం పొందగలడనుకోగలమా, తొండమానుడిహలోకంలోనే ఈ శరీరంతోనే కలియుగ వైకుంఠం స్వయంగా నిర్మింపజేసిన కీర్తిమంతుడుగదా! కాదంటే విధికృతమైన ఏదో చిన్న తప్పిదంవల్ల భగవానుని తాత్కాలిక నిరాదరణకు గురియై ఆ చక్రవర్తి పునరాదరణార్థ్రతకై యెంత దురిపిల్లాడో! స్వర్ణ తులసీదళ సహస్రార్చన కవాంతరం వచ్చినపుడెంత తపించాడో! మరి భీమన్న అలాంటి ఏ రకమైన ఆర్తి, జిజ్ఞాస, అర్థ, జ్ఞానములనబడే చతుర్విధభజనల్లో భాగమున్న భక్తుడో తేల్చి చెప్పగలమా! పూర్వజన్మకృతమూ (అదీ ఎట్టిదో

తెలియనే తెలియదు) శ్రీ వేంకటేశ్వరుని కరుణాకటాక్ష ప్రసారమూ (నాటకంలో ఇది ప్రత్యక్షంగానే తెలిసివస్తుంది) తప్ప భీమన్న భగవంతుడి కోసం పడిన తపోధ్యానాది పాట్లేమీ లేవు. మూఢంగా నమ్మటమూ మానవత్వంతో యాత్రికులకుతోడుపడటమే భీమన్నలో భగవంతుడు కనుగొన్న సద్గుణాలు. ఆ సత్వగుణుని ఆధారంగా రజోగుణుని డాంబికం మాపటమంతా శ్రీవేంకటేశ్వర స్వామి లీల. కనుక ఆయనే కథా నాయకుడూ ఆయన ప్రదర్శించిన ధర్మవీరమే కథా ప్రధాన రసం.

ఇంక అన్యరసాలు అంగాలుగా ఉండవచ్చునన్న నాలుగో విషయంలో భయానక కరుణలు స్పష్టంగా ఉన్నాయి. రసంగా అంగీకరిస్తే భక్తి కూడా పుష్కలగా ఉంది. పిడుగుపాటుకు భీమన్నా తమాలినులు బెదరటం భయానక రసమే. తొండమాను చక్రవర్తి వేంకటేశ్వర దర్శనం కాక పోయి అంగీరసమహర్షికడ వాపోవటం దగ్గర్నుండి నాటకాంతంవరకు అనుభవించిందంతా కరుణారస పూర్ణమే.

శ్రీ అల్లీ రామకృష్ణగారు పూర్తిగా స్వేచ్ఛోల్లాసి. ఆయన భక్తి ప్రచారకుడైన కవి. అయ్యప్ప శతకం వ్రాసినా వినాయకుడి కథలు వ్రాసినా ఇప్పుడీ నాటకం వ్రాసినా భక్తి ప్రచారమే అంతర్లీనమైన ధార ఆ అంతర్ధార కోసం ఎన్ని భక్తి సాహిత్య గ్రంథ పర్వతాలను భేదించి సాధించి ఆధారల సుస్నాతుడు పవిత్రుడూ అయ్యారో!

'కావ్యేషు నాటకం రమ్యమ్' అని రమణీయార్థ సౌందర్య విభాసిని చేసి ఆదరించారు. సంతోషం. ఈ సంతోషం తెలుగు వారందరికీ శ్రవశ్చక్షుఃప్రీతిగా దక్కి "రసోవైసఃగా ఉన్న ఆ తిరుమల వేంకటేశ్వరస్వామి దయాప్రకాశ ప్రాప్తిగని అందరూ తేజోవంతులై మానుషాద్దైవ్యముపైమి"గా దైవత్వ విభూతులందుకోవాలని ఆశిస్తూ,

మీ

జొన్నవిత్తుల రామకృష్ణశర్మ
5-6-7, నరసయ్య అగ్రహారం,
భీమవరం - 534 203,
పశ్చిమ గోదావరి జిల్లా.

# కృతజ్ఞతా ప్రణతులు

మొట్టమొదట నా యీ నిర్మాణాన్ని గ్రహించి పుస్తక ముద్రణ కోసం ఆర్థిక సహాయాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానంవారికి కృతజ్ఞతాంజలులు.

అలాగే - అన్నమాచార్య ప్రాజెక్ట్ డైరెక్టరు, సహస్రావధానులు డా. మేడసాని మోహన్, M.A., Ph.D. గారికి, నాటక రచయిత శ్రీ ఆదివిష్ణుగారికీ, ఈ నాటకానికి "ఆధునిక రూపంలో వ్రాసినదాన్ని శాస్త్రీయ రూపంగా సవరించడానికి అంక విభాగ నాంది ప్రస్తావనా విష్కంబాలు ఉండాలని" సూచించిన సంస్కృతాంధ్ర పండితులు బ్రహ్మశ్రీ జొన్నవిత్తుల రామకృష్ణశర్మగారికి నా నమస్సుమాంజలులు.

నా రచనా కార్యక్రమాలన్నిటా ఓ అనగానే నేనున్నాను అంటూ చేదోడు వాదోడుగా నిలిచే రచయిత - అమెరికా తెలుగు అసోషియేషన్ (అటా) నవలలపోటీలో ప్రథమ బహుమతి, అప్పాజోశ్యుల విష్ణుభొట్ల ఫౌండేషన్ (U.S.A.) వారి ఉత్తమ కథా రచయిత పురస్కార గ్రహీత జె. శ్రీరామ చంద్రమూర్తికి కృతజ్ఞతా స్పర్శనాలు.

మరో ఆత్మీయులు - సర్వవేళలా స్నేహ సహాయ హస్తాలందించే తిరుపతి ఆకాశవాణి ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్ శ్రీ ఎ. మల్లేశ్వరరావుగారికి కృతజ్ఞతాభి వందనాలు.

నా రచనలను సౌమనస్యముతో సమీక్ష చేస్తూ ప్రోత్సహిస్తుండే మదనపల్లి బి.టి. కాలేజ్ రిటైర్డ్ ప్రొఫెసర్, బహుగ్రంథకర్త అయిన శ్రీ మల్లెల గురువయ్యగారికి రిటైర్డ్ డి.ఇ.ఓ. శ్రీ కె. నరసింహులుగారికి నమోవాకములు.

ఈ నాటకానికి ప్రేరణ కల్పించిన మిత్రుడు శ్రీబంధం వేంకటరామయ్యకూ. నా సూచన ప్రకారం అట్ట మీది బొమ్మగీసి ఇచ్చిన కె.ఎం.డి. హెన్రీగారికీ, ఆత్మీయుడు కథా రచయిత టి.ఎస్.ఎ.ఎస్.ఎ. కృష్ణమూర్తిగారికి, 'పెద్దమనుష'లు సి. శ్రీకాంత్ కుమార్‌కు, కవీ కార్టూనిస్టూ నెల్లూరు వాసీ శ్రీ పెరుగు రామకృష్ణకూ; నా సాహిత్య కృషికి ప్రోత్సాహకారులు - చిత్తూరు జిల్లా రచయితల సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. రామకృష్ణగారికీ, అధ్యక్షులు శ్రీ కె. బాలకృష్ణారెడ్డిగారికీ, కె.ఎం. బాలరాజ్, మునిశ్రీగారలకు, గుట్టపాలెం సూదా రెడ్డెప్పకూ కృతజ్ఞతలు. కీ.శే. కె. మునెయ్యగారి సేకరణ 'రాయలసీమ రాగాలు' నుండి ఒక జానపద గేయం స్వీకరించడం జరిగింది. వారి ఆత్మకు నివాళులర్పిస్తున్నాను.

వ్యాపార ధోరణిలో కాక వాస్తవికంగా సాహిత్యమందు అభిమానాన్నీ, రచయితలపట్ల ఆదరణాన్నీ చూపుతూ ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన విజయవాణి ప్రింటర్స్ మరియు పబ్లిషర్స్‌కు చెందిన శ్రీనాయుని సుధాకరమూర్తిగారికి కృతజ్ఞతాంజలులు.

కలికిరి,
13-11-1999.

- అల్లీ రామకృష్ణ

# కుమ్మరదాసుడైన కురువరతినంబి

పల్లవి : కొండలలో నెలకొన్న కోనేటిరాయుడు వాడు
కొండలంత వరములు గుప్పెడు వాడు ॥కొండల॥

1. చరణం : కుమ్మర దాసుడైన కురువరతి నంబి
ఇమ్మన్న వరములెల్ల నిచ్చినవాడు
దొమ్ములు చేసినట్టి తొండమాం జక్కురవర్తి
రమ్మన్న చోటికి వచ్చి నమ్మిన వాడు ॥కొండల॥

2. చరణం :
ముచ్చిలి పెట్టికి మన్ను మోచినవాడు
మచ్చిక దొరక తిరుమల నంబితోడుత
ఇచ్చ నిచ్చ మాటలాడి నొచ్చినాడు ॥కొండల॥

3. చరణం : కంచిలోన నుండ తిరుకచ్చినంబి మీద
కరుణించి తనయెడకు రప్పించిన వాడు
ఎంచి ఎక్కుడైన వేంకటేశుడు మనలకు
మంచివాడై కరుణ చూపించినాడు ॥కొండల॥

- అన్నమాచార్య

# ఇందులోని పాత్రలు

1. కుమ్మరి భీమన్న : శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తుడు

2. తమాలిని : భీమన్న భార్య

3. తొండమానుడు : తుండీర మండలాధీశుడు

4. శ్రీనివాసుడు : తొండమానుని కుమారుడు

5. శ్రీపతి : భీమన్న వద్ద సేవకుడుగా చేరిన శ్రీవేంకటేశ్వరస్వామి

6. మంత్రి : తొండమానురాజు యొక్క మంత్రి

7. సేనాపతి : తొండమానురాజు యొక్క సేనాపతి

8. యువతి : పుష్పలావిక. దరువు వేసేటందుకు నలుగురు.

# సంక్షిప్త కథ

కులాల దంపతులైన భీమన్న, తమాలిని - వేంకటాద్రికి ఉత్తర దిశలోని "కుర్వ" గ్రామవాసులు. శ్రీ వేంకటేశ్వరస్వామి వారి పరమ భక్తులు. (కుర్వపల్లె అలిపిరి దాపుల ఉండేదని కూడా చెపుతారు).

ఒక ఉదయం భీమన్న - స్వామివారు తనకారాత్రి కలలో కనిపించారని, తొండమాన్ చక్రవర్తి దీనాతిదీనంగా తనముందుకువచ్చి కాళ్ళపై పడినప్పుడు తమకు బొందితో వైకుంఠప్రాప్తి కలుగుతుందని చెప్పినట్లుగా భార్యతో చెపుతాడు.

కలలో స్వామి చెప్పినమాటలు కేవలం కలగానే సందేహిస్తారా దంపతులు. అయితే వారి సందేహనివృత్తికోసం స్వామివారు కొన్ని సంఘటనలు కల్పించినట్లు గ్రహిస్తారువారు. ఉరుములు మెరుపులతో వారి గుడిసెపై పిడుగు పడినట్లనిపిస్తుంది. కాని గుడిసెమాత్రం చెక్కు చెదరదు. గుడిసెగోడలో దీపపుగూడులాంటి పగులు మాత్రం కనబడుతుంది. ఆ పగులులో వారికి స్వామివారి చందనపుకొయ్య ప్రతిమ లభిస్తుంది. ఈ నిదర్శనాలతో స్వామివారి పలుకులపై నమ్మకం కలుగుతుందివారికి.

తర్వాత భీమన్నకు వృత్తి పనుల్లో సహాయపడుతానని స్వామివారు శ్రీపతి పేరుతో (పేరు కల్పితం) వారింట చేరుతాడు.

తొండమాను చక్రవర్తి తనకు కలిగిన దోష పరిహారార్థం అంగిరస మహర్షి ఆశ్రమానికి వస్తాడు. వేంకటేశ్వరస్వామి వారి పునః దర్శనం కావాలంటే రోజుకు వేయి బంగారు తులసీదళాలతో గానీ, పద్మాలతో గానీ స్వామి సహస్రనామార్చన చేయుమని అంగిరస మహర్షి తొండమానునికి బోధిస్తాడు.

మహర్షి చెప్పినట్టే చేస్తాడు తొండమానుడు. ఫలితం ఉండకపోగా అర్చన చేయబడిన బంగారు పూల స్థానంలో మట్టి పూలు చేరుతుంటాయి. తన కుమారుడైన శ్రీనివాస యువరాజుకా విషయం తెలియజేస్తాడు రాజు. దీనిని దాయాదుల కుట్రగా భావిస్తాడు యువరాజు.

అలా మట్టిపూలను ఎవరికీ తెలీకుండా ఎవరు చేరుస్తున్నారో కనుక్కో మంటాడు యువరాజు మంత్రితో.

మంత్రి తన పరిశోధనా ఫలితాలను చెపుతూ మట్టిపూలను అక్కడికి రహస్యంగా చేరవేస్తున్న వారెవరో తెలుసుకోవడం వీలుకాలేదని, అయితే వాటిని తమరాజ్యంలోని కుర్వగ్రామంలోని వారెవరో చేస్తున్నారని వివరిస్తాడు.

మారు వేషాలతో వేయిమంది సైనికులతో సేనాపతీ, శ్రీనివాసుడు కుర్వగ్రామానికి పోతారు. ఆ గ్రామం వద్ద ఉన్న చెరువు దగ్గర సేనాపతీ శ్రీనివాసులకు శ్రీపతి కనిపిస్తాడు. శ్రీపతి వారిద్దరూ అడిగిన ప్రశ్నలకు సరిగా సమాధానాలివ్వడు.

అందుకు కోపగించి మారువేషం వదలి ఆదేశపు యువరాజుగా భీమన్న కుటుంబానికి ఒక విచిత్రమయిన శిక్ష విధిస్తాడు యువరాజు. దానిని అంగీకరిస్తూ శ్రీపతి ఆ శిక్షప్రకారం మరురోజు-

వేయిమందికి భోజనాదికాలు ఏర్పాటు చేస్తానుని భీమన్న తరుఫున మాట ఇస్తాడు.

శ్రీపతి మరురోజు వేయిమందికి విందుభోజనాలు పెట్టించిన తరువాత అదెలా సంభవమని సేనాపతీ శ్రీనివాసులు అతడిని నిలదీస్తారు. భీమన్న, శ్రీపతి బంగారు పూలను నేర్పుతో దొంగిలించే చోరులని వారిని బంధించమని సైనికులను ఆజ్ఞాపిస్తాడు యువరాజు. కానీ, శ్రీపతి మట్టితో చేసిన చతుర్విధబలగాలు జీవం వచ్చి నిలబడి రాజ సైనికులను యువరాజు సేనాపతులను పారద్రోలతాయి.

శ్రీనివాసుడు తండ్రి దగ్గరకు చేరుతాడు. బంగారు పూలు చేయడానికి కావలసిన బంగారం ఏ విధంగా చూచినా లభించడం లేదని తండ్రికి చెప్తాడు. అప్పుడు సేనాపతి కుర్వ గ్రామంలో జరిగిన సంఘటనలు వివరిస్తాడు.

తొండమానుని మనస్సప్పుడు అతలా కుతలమవుతుంది. పిచ్చి పట్టినట్లు రాజాంతఃపురం వదలి పారిపోతాడు.

అలా పారిపోయిన తొండమానునికి ఒక ఊరిలోని యువతి పాడిన జానపద గీతంతో కనువిప్పు కలుగుతుంది. (కల్పితం)

దానితో అతడు కుర్వ గ్రామం చేరి భీమన్నకాళ్ళపై పడతాడు. పిమ్మట కులాల దంపతుల ఆతిథ్యం స్వీకరించిన వెంటనే మగతక్రమ్మి తొండమానుడు భీమన్న గుడిసెలో నిద్ర పోతాడు. ఆ సమయాన వచ్చిన శ్రీపతి, భీమన్న తమాలినులకు తన నిజరూపంతో దర్శన మిస్తాడు. శ్రీ వేంకటేశ్వరస్వామి అప్పుడు ఆ దంపతులకు 'బొందితో వైకుంఠ ప్రాప్తి' కలిగిస్తాడు. ఈ విషయం గ్రహించిన తొండమానుడు అహంకార రహితుడై స్వామివారిని అర్చిస్తూ శేష జీవితం గడపడానికి స్వామివారి నివాసస్థానం - ఏడుకొండలమీదికి చేరడానికి ఉద్యుక్తుడవుతాడు.



# నాంది

శ్రీ భూకాంతలయం దొకే విధముగా బ్రీతింబ్రదర్శింపనే
గా భూపాల కులాల పూజలను బం-గారంబుతో మట్టితో
శోభింపందులసీదళంబు విడఁగా - శోధించి యోగార్థముల్
లాభంబిచ్చెడు వేంకటేశ్వరుడు, హే-లం దా మిముంబ్రోచుతన్

*(నాంది కాగా సూత్రధారుడు ప్రవేశించును)*

సూత్ర : (ప్రేక్షక సందోహమును చూసి) అహా ఏమి మా భాగ్యము ! వెండితెర బుల్లితెరలవల్ల మూలపడబోతుందనుకొన్న నాటకం చూడ్డానికి ఉత్సాహ తరంగిత హృదయాలతో ప్రేక్షక మహాసముద్రం ఇలా ఉప్పొంగి రావటం చూస్తే ఇంకా నాటక బృందావనం జన ప్రోత్సాహ వర్షంతో నవనవోన్మేషమై సజీవ సాక్షాత్కార పరిమళాల విలసిల్లి సమాజాభ్యుదయారోగ్య పూర్ణఫల దమయ్యే సూచనలు కనిపిస్తున్నాయి. సభ్యమహోదయుల కివే మా నాటక సమాజం తరపున హర్షామోద శుభాకాంక్షా శత సహస్రాభివందనములు.

*(తెరలోపలికి చూచి)*

ఏమీ యీ నటి యింకా రావటంలేదు ! ప్రేక్షకుల్లో విసుగు కలిగేలోపునే నాటకం మొదలవ్వాలని ఎన్నిసార్లు చెప్పినా వినిపించుకోదు. తానేమో తన పాత్రల అలంకారాలేమో. (బిగ్గరగా) ఓసీ నటీ ఏమిటింకా ఆలస్యం !

నటి : (విసవిసా నడచి వచ్చి) ఏమిటయ్యోయ్ ఓసీగీసి అని నోరు పారేసుకుంటున్నావ్ ! కాస్త నంబాళించుకొని మాట్లాడు. లేకపోతే మర్యాదగా ఉండదు.

సూత్ర : (జనాంతికముగా) ఓహో ఈ నటి స్త్రీవాద మహోద్యమ కార్యకర్త అయినట్లుందే. కార్యవాదినైన నేను ఈమెతో వాదించటానికి సమయం కాదు. (ప్రకాశంగా) లేదులే నటీ ! దూరంలో ఉన్నావని ఊతకోసం అన్నమాటకి కోపం తెచ్చుకోకు. చూడు ప్రేక్షక సమూహం ఎంతగా ఎదురు చూస్తూ ఉందో ! వారికి నీ ప్రదర్శన వివరాలు తెలియ జేస్తే సంతోషిస్తారు గదా !

నటి : అలాగన్నావు బాగుంది. నీకే వివరాలు కావాలో అడుగు.

సూత్ర : ప్రదర్శించే నాటకం పేరు - ఇతి వృత్తం - కవి పేరు ఆయన వివరాలు.

నటి : ఆగాగు. అడగవయ్యా అంటే గూడ్సుబండి అంతపొడుగు ప్రశ్నలేస్తున్నావే. సరే చెప్తాను తాపీగా విను - నాటకంపేరు కురువరతినంబి కథ. ఆ నంబి అసలు పేరు భీమన్న. కాగా ఇతివృత్తం ప్రఖ్యాతమే. భవిష్యోత్తర పురాణంలోది.

సూత్ర : సరే సరే ఒక్క మాటాగు. తెలుగులో ప్రథమ సంకీర్తనాచార్యుడైన శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల వారు వ్రాసిన "కొండలలో నెలకొన్న కోనేటి రాయడువాడు, కొండలంత వరములు గుప్పెడు వాడూ" అనే కీర్తనలో చెప్పిన కురువరతినంబి కథేనా !

నటి : ఔను అన్నమాచార్యుడా కీర్తనలో పరిచయం చేసిన కురువరతినంబి కథే అనుమానం లేదు. శ్రీ అల్లీ రామకృష్ణకవిగారలా పరిచయమైన పేరు పట్టుకొని పురాణాలన్నింటినీ గాలించి చివరికి భవిష్యోత్తర పురాణంలో భీమన్న అనే కులాలుడే తిరుమల యాత్రికులకు తన ఊర కాస్త సేదదీర్చుకొనే వీలు కల్పిస్తూండటంతో తమిళులా భీమన్ననే కురువరతినంబి అని పిలుచుకొన్నట్లు కనుగొని యీ నాటకం రచించారు.

సూత్ర : ఆ కవిగారంత పరిశోధనోల్లాసియా ! అయితే ఇంకా ఏవో వ్రాసి ఉండాలే.

నటి : వ్రాసారయ్యా వ్రాసారు. శబరిమలలో వేంచేసియున్న అయ్యప్పస్వామి చరిత్ర నెన్నో గ్రంథాల పరిశోధించి సమన్వయించి ముందుగా గేయాలుగానూ తర్వాత శతకంగానూ వ్రాసారు. మరో ప్రయత్నంగా వివిధ గ్రంథాల నుండి గ్రహించి బాలలకోసం చక్కని వచనంతో వినాయకుడి కథలనే పుస్తకం వ్రాసారు. ఇప్పుడీ నాటకం వ్రాసారు.

సూత్ర : వారిదే ఊరు? తలిదండ్రులెవరు? ఏం చేస్తుంటారాయన?

నటి : అదిగో మళ్ళీ ఒక్కసారిగా అన్ని ప్రశ్నలా ! సరే విను ఆంధ్రప్రదేశంలోని చిత్తూరు జిల్లా కలికిరి వారి ఊరు. వారి తలిదండ్రులు అల్లీ హుళక్కి, రెడ్డెమ్మ అన్న పవిత్ర దంపతులు. కాగా వారి వృత్తి ఉన్నత పాఠశాలోపాధ్యాయ వృత్తి. ప్రవృత్తి వివిధ పురాణ చారిత్రక గ్రంథాలు చదవటం అందు సమాజాభ్యుదయ పరమైన వృత్తాంతాలను గైకొని తగిన మాధ్యమంలో రచనలు చేయటం.

సూత్ర : బాగుంది. ఒక్కసారిగా అన్ని అన్ని ప్రశ్నలెందుకడిగానంటే సభ్యులుత్సాహపడే నాటక ప్రదర్శనం ఆలస్యంకారాదనే. మరి నాటక పాత్రధారులు సిద్ధమైనట్లేనా?

నటి : సిద్ధమేమిటి నారదపాత్ర పాట పాడుకుంటూ వచ్చేస్తుంటే.

సూత్ర : (వినటం నటించి) ఔనౌను ఇంక మనమెందుకిక్కడ పోదాం పద.

ఇది ప్రస్తావన

# కురువరతి నంబి కథ

(నాటకం)

## విష్కంభము

*(నారదుడు "కొండలలో నెలకొన్న" అన్న అన్నమాచార్య కీర్తన పాడుకుంటూ అంగీరసాశ్రమమునకేని వచ్చుచుండును. పాట చివరికా ఆశ్రమమును చేరగా అంగీరసముని ఎదురు వచ్చును.)*

అంగీ : ఆహా ఏమి నాభాగ్యము ! నారద మహర్షి ఇంతకాలానికి మా ఆశ్రమము పావనము జేయ వస్తున్నారు. దేవర్షీ ! మీకివే నా హృదయపూర్వక స్వాగతాభివందనములు.

నార : శుభమస్తు ! శ్రీవేంకటేశ్వర దైవకార్య నిర్వహణ యోగ్యతా సిద్ధిరస్తు.

అంగీ : నేను స్వామి కార్యము నిర్వహించుటేమి దేవర్షీ ! అందుకు మీరున్నారుగా ! నేనాయేడు కొండలెక్కలేను. ఏదో నన్నిలా మా ఆశ్రమ నిర్వహణ చేసుకోనీయండి చాలు.

నార : (బేలగా) నేను నిర్వహించ పూనుకొంటే పొట్టనింపుకోటానికి తంపులు తెచ్చిపెట్టే వాడనే లోకనింద ఉందిగదా మునీ! నిజానికి ఆ తంపుల వ్యవహారాలను నాయకమ్మన్యులంతా గుత్తకు పుచ్చుకొన్నారు గదా! కులమత రాజకీయ స్పర్థలు రేపి ఎన్నో కలహాలు సృష్టిస్తున్న వారిముందు నేనెంత! నువ్వే చెప్పు.

అంగీ : ఆ మాట నిజమే. కలహభోజనుడు నారదుడనటం ఈ కలియుగంలో వ్యర్థమై పోయింది.

నార : కాబట్టి స్వామికార్యం ఇక నువ్వే నెరవేర్చాలి.

అంగీ : నేనా! ఆ కొండలెక్కలేనని ముందే విన్నవించుకొన్నాను గదా!

నార : నువు కొండలెక్కనూ అక్కర్లేదు. కలహాలు కల్పించనూ అక్కర్లేదు.

అంగీ : మరి స్వామికార్యం ఎలా నెరవేర్చటం!

నార : నీ దగ్గరకే తొండమాన్ చక్రవర్తి తన గోడు చెప్పుకోటానికి వస్తాడు. అతడు చెప్పేదంతా విని చివరకు శ్రీవేంకటేశ్వరస్వామిని కనకంపు తులసీదళాలతో గానీ, బంగారు పద్మాలతోగానీ అనుదిన సహస్ర నామార్చన కొనసాగించటం పరిష్కారంగా సూచించు. అంతే నువు చేయవలసింది.

అంగీ : ఓహో మీరు పాడిన కీర్తనలోని పరమార్థం అదా!

నార : ఔను శ్రీవారి నందక ఖడ్గం భూమిపై తాళ్లపాకవారి వంశంలో అన్నమాచార్యుడనే పేర అవతరించి ప్రథమ సంకీర్తనాచార్యుడై తెలుగులో 32000 కీర్తనలు రచించి పాడి ఆ కలియుగ దైవ-దైవభక్త యశశ్చంద్రికలను ముల్లోకాల ప్రసరింపజేయగలడు. అందులో ఒకటే నే పాడిన కీర్తన. ఆ కీర్తనలో ప్రసక్తమైందే ఇప్పుడు జరుగుబోయే చరిత్ర. ఆ చరిత్రలో నీకూ పాత్ర ఉండాలనే నా కోరిక. ఏమంటావు?

అంగీ : తప్పకుండా దేవర్షీ! నా ప్రయత్నంలో లోపం రానీయను. అయితే ఆయత్నావసర సూచనగా ఉన్న చరణం మరోసారి పాడి వినిపించండి నారదర్షీ.

నార : అలాగే.

కొండలలో నెలకొన్న కోనేటి రాయడువాడు
కొండలంత వరములు గుప్పెడు వాడు
కుమ్మరదాసుడైన కురువరతినంబి
ఇమ్మన్న వరములెల్ల, ఇచ్చినవాడు
దొమ్ములు చేసినయట్టి తొండమాన్ చక్కరవర్తి
రమ్మన్నాచోటికి వచ్చి నమ్మినవాడు.

అంగీ : బాగుంది. ఆ తొండమాన్ ఇక్కడికి వస్తాడన్నమాట. సరే ఆ కుమ్మరదాసుడైన కురువరతినంబి మాటేమిటి?

నార : అతడి అసలు పేరు భీమన్న, కులాలుడు. అయినా తనపేదరికంలోనే తిరుపతి యాత్రికులకు సేద దీరటానికి తగిన ఏర్పాట్లు చేస్తూ నిరంతరం భగవన్నామ స్మరణం చేస్తుంటాడు. ఆ సాయం మరవని తమిళయాత్రికులు మర్యాదగా కురువరతినంబి అని చెప్పుకుంటుంటారు. అదిగో ఆ భీమన్నా అతని భార్య తమాలినీ తమ పనుల్లో కూడా ఎలా భగవంతుని తలచుకొంటున్నారో చూడు. మరి నేనింక ఇక్కడ నిలువరాదు. పోయివస్తాను. నీ కర్తవ్యం మరువకు సుమా సెలవు.

అంగీ : ఎంతమాట! స్వామి కార్యం మరవటమా! తొండమానుడు వచ్చినప్పుడు తప్పకుండా చెప్పగలను. సెలవు. నేను కూడా నా అనుష్ఠానానికి పోవలసి యున్నది.

(ఇద్దరూ చెరో ప్రక్కకు నిష్క్రమింతురు)

ఇది శుద్ధ విష్కంభము

# కుమ్మరి భీమన్న

## (కుమ్మర దాసుడైన కురువరతినంబి)

### ప్రథమాంకము

#### మొదటి రంగము

**భీమన్న : కులాలుడు**

**తమాలిని : భీమన్న భార్య**

*(భీమన్న తన గుడిసె వసారాలో నిలబడి ఉంటాడు. బయట వాన తుంపరగా పడుతూ ఉంటుంది.)*

**భీమన్న** : తమాలినీ!.... తమాలినీ! ఒకసారి ఇటురా!

**తమాలిని** : (లోపలినుండి) ఇదో వస్తున్నా. కాస్సేపాగండి. ఇక్కడోపని మీదున్నా.

**భీమన్న** : (పచార్లు చేస్తూ వసారా చూరుకిందనుండి తల బయటికి పెట్టి ఆకాశం వైపు చూస్తాడు)

మెల్లగా మొదలైన ఈవాన ఎక్కువయ్యేటట్లు కనబడుతోంది. పోనీలే. వానలు పడి చాలా దినాలయింది. నేల చల్లగా ఉంటే మనుషులూ చల్లగా ఉంటారు. ఏడుకొండలవాని దయవల్ల ఈ నేల చల్లబడి ఎప్పుడూ పచ్చగా ఉండాలి.

**తమాలిని** : *(పాకలోనుండి వస్తూ...)* ఏమిటండీ! ఎందుకు పిల్చారు?

**భీమన్న** : తమాలినీ! కుండలు చేయడానికి జల్లెడ పట్టి సిద్ధంచేసిన మన్ను, వాన చినుకులు పడి బురద బురదగా అవుతుందేమో!

**తమాలిని** : ఏడు కొండల వాని దయవల్ల మన దేశంలో నెలకు మూడు వానలు పడుతున్నాయి. మీరు ముద్దలుగా చేసిన మన్ను మీద వాన చినుకులు పడకుండా వరిగడ్డితో కప్పివస్తున్నా. ఈ రోజు కొత్త కాదుగా ఆకాశంలో మబ్బులు కనబడగానే వామిలో ఉన్నగడ్డి కట్టలు రెండు తెచ్చి పెట్టి ఉంటిని. వాటిని మట్టిపైకప్పుతూ ఉండడం వల్ల మీరు పిల్చిన వెంటనే రాలేకపోయాను.

భీమన్న : ముందు జాగ్రత్త కలదానివే నీవు ఇలాంటివి నీకు చెప్పాలా! అదికాదు . . .

తమాలిని : చెప్పండి.

భీమన్న : తెల్లవారుజామున నాకో మంచి కల వచ్చింది.

తమాలిని : తెల్లవారుజామున వచ్చే కలలు తప్పకుండా జరుగుతాయంటారు పెద్దలు. ఏమిటో ఆ కల చెప్పండి.

భీమన్న : తమాలినీ! శ్రీవేంకటేశ్వర స్వామి వారిని కొలుస్తూ ఉన్నప్పట్నుండీ నాకు ఎప్పుడూ చెడ్డవో, మంచివో ఎలాంటి కలలూ రాలేదు.

తమాలిని : నాకూ రాలేదండీ! అదంతా స్వామివారి దయ.

భీమన్న : ఈ రాత్రి తెల్లవారు జామున నాకో కల వచ్చింది. ఆ కలలో వేంకటేశ్వరస్వామి వారు కనబడ్డాడు.

తమాలిని : *(ఆశ్చర్యంగా)* నిజమా? ఇది నిజమా స్వామీ!

భీమన్న : నిజమే తమాలినీ! సాక్షాత్తు స్వామివారే నాకు కలలో కనబడ్డారు. ఆయన ఇప్పుడు కూడా నా కన్నుల్లో కదలాడుతున్నట్లే ఉంది.

తమాలిని : ఆయన రూపం ఎలా ఉందండీ!

భీమన్న : నాకు కనబడ్డ స్వామీ రూపాన్ని ఎలా వర్ణించాలో నాకు మాటలు దొరకడంలేదు. అయినా చెబుతాను. వేయి సూర్యుల వెలుగుతో, లక్షచంద్రుల చల్లదనంతో వెలిగిపోతూ కనబడ్డాడు స్వామి. ఇక స్వామి వారి చూపుల్లో ఎంత ప్రశాంతత నెలకొని ఉందనుకున్నావు! ఆ ప్రసన్న దృక్కులను చూచి నన్ను నేను మరచిపోయాను. నాకు తెలీకుండానే ఆయన కాళ్ళమీద పడిపోయాను.

తమాలిని : మీరెంత అదృష్టవంతులండీ! కలలోగానీ ప్రత్యక్షంగాకానీ స్వామి రూపం ఎలా ఉంటుందీ నాకెరుకకు రాలేదెప్పుడూ.

భీమన్న : ఆయన రూపాన్ని బ్రహ్మాదులు సైతం సంపూర్ణంగా వర్ణించలేక పోయారట తమాలినీ! ఒక సాధారణ మానవుడి నైననేను ఆయన రూపాన్ని ఎలా వివరించను? కానీ నాకు కనబడ్డ రూపం గురించి చెపుతా విను.

స్వామీవారి నాలుగు భుజాలు సర్వలోకాలనూ భరించగలిగినంత బలంగా కనబడ్డాయి.

ఒక చేత శంఖమూ, మరోచేత చక్రమూ ఉంది. అవి సమరానికైనా, శాంతి సంరక్షణకైనా సిద్ధం అన్నట్లున్నాయి.

మూడో హస్తం కటిస్థలాన్ని అలంకరించి తన స్థితికారకత్వాన్ని తెలుపుతున్నట్లుగా ఉంది. నాలుగో చేయి నిష్కల్మషమైన భక్తుల ఈప్సితాలను తీరుస్తాను అన్నట్లు ద్యోతకమవుతూ ఉంది.

ఆయన చేసే మందహాసం గురించి ఎలా చెప్పను? ఆ నవ్వులో కోటి చంద్రుల కాంతి కిరణాలు లోకాలన్నింటిపై పరచుకున్నట్లు అనిపించింది నాకు.

**తమాలిని** : ఆ స్వామీని నేనెప్పుడు చూస్తాను! నాకంతటి భాగ్యం ఎన్నడు లభిస్తుంది. "స్వామీ! వేంకటేశా! నీకరుణా దృష్టులు నామీదెప్పుడు ప్రసరిస్తాయి?"

**భీమన్న** : స్వామి అపారదయామయుడు తమాలినీ! "ఏడుకొండలవాడా! వేంకట రమణా" అని ఆర్తితో పిలిచిన వారికి "ఓ" అని పలికే దేవుడాయన. నాతోపాటు నీవు కూడా స్వామివారిని సర్వవేళలా తలచుకుంటూనే ఉన్నావు. స్వామివారికి నేనొకటీ నీవొకటీ కాదు తమాలినీ! స్వామివారి రూపం తెలియ రాలేదని చింతపడకు.

**తమాలిని** : కో అంటే కోటి వరాలిచ్చే కోనేటిరాయడు వేంకట రమణుడు నాపై కూడా కృపచూపుతాడంటారా?

**భీమన్న** : తప్పకుండా చూపుతాడు తమాలినీ! ఇక నా కల గురించి విను. నేను స్వామివారి పాదపద్మాలపై తెలివి తప్పిపడిపోయానా? తర్వాత ఎప్పుడో ఆయన చూపులే నన్ను తట్టి లేపినట్లయింది. చటుక్కున లేచి కూచున్నాను.

**తమాలిని** : మీరు స్వామివారిని సర్వకాల సర్వావస్థల్లోనూ తలచుకుంటూ ఉంటారు. అయినా స్వామివారు మీ ఎట్టఎదుట కనబడగానే పరవశంతో తెలివి తప్పారంతే! మీకు స్వామివారు కలలోనైనా కనిపించడం సాధారణ విషయంకాదు. అందరికీ ఆ భాగ్యం కలుగుతుందా?

**భీమన్న** : తమాలినీ! నీవు నా అర్ధాంగివి. స్వామి వారిపై నాకు ఏకాగ్రత నిలువడానికి నాకు నీవు చేసిన పరిచర్యలు ఎన్నో! స్వామివారి అర్చనకు కావలసిన పూజా సామగ్రిని ఎప్పటికప్పుడు సిద్ధంచేసి ఉంచేదానివి. నేను వనాల నుండి సేకరించుకువచ్చిన తులసీ దళాలను శుభ్రపరచేదానివి. వానిని

మాలగా కూర్చి నాకందించే దానివి నీవు. అంతేకాదు తమాలినీ! స్వామి వారి పూజలోను నాకంటే ముందుగా నీవే పాలు పంచుకునే దానివి. ఇక కుటుంబ వ్యవహారాలన్నింటినీ నీవే చక్కబెడుతుంటావు. నిజంగా నీవే నాకంటే అధికురాలివి తమాలినీ!

**తమాలిని** : మీరు మాత్రం తక్కువ వారా! స్వామివారిని అధికాధికంగా కొలుస్తూనూ ఉంటారు. ఎల్లప్పుడూ తలచుకొంటూకూడా మీ వృత్తినీ ధర్మాన్నీ నిర్లక్ష్యం చేయలేదు. మన పనికి ఉపయోగించే పరికరాలలో కూడా స్వామివారు కనబడుతుంటారని మీరెన్నోసార్లు నాతో అన్నారు.

**భీమన్న** : బాగా గుర్తు పెట్టుకున్నావు తమాలినీ!

**తమాలిని** : ఔను కుండలు చేయడానికి సారెముందు నిల్చొని కట్టెతో తిప్పుతూ అది స్వామివారి సుదర్శన చక్రంలా ఉందన్నారు. మట్టిని పిసుకుతూ దాన్ని భూమితో పోల్చారు. మట్టిబొమ్మలను భూమిపై ఉండే జీవులు అని చెప్పారు.

**భీమన్న** : భూమిని సారెలా తిప్పే చక్రధారి శ్రీనివాసుడు తమాలినీ!

**తమాలిని** : శ్రీనివాసుడు జగత్పరి పాలకుడు. ఇలా స్వామి వారినీ, సొంత వృత్తినీ కొలుస్తూ మనం జీవిస్తున్నాం.

**భీమన్న** : జీవించడానికి వృత్తీ, ముక్తి పొందడానికి మురారీ మనకు ఆధారభూతులు.

**తమాలని** : మీరు మట్టిలోనూ, మట్టి వస్తువుల్లోనూ, పరికరాలైన సారెలోనూ, కుమ్మరాములోనూ, వాటిని ఉపయోగించే మనుషుల్లోనూ, ఒకటేమిటి అన్నింటిలోనూ, ఇంకా లోకమంతటా స్వామివారే మీకు కనబడుతుంటారు. స్వామివారు మనకెప్పుడు బొందితో వైకుంఠప్రాప్తి కలిగిస్తారో?

**భీమన్న** : తమాలినీ! నా కల గురించి ఇంకా చెప్పవలసింది ఉంది విను. తన చూపులతో పైకి లేపిన స్వామివారు నన్ను అలవోకగా స్పర్శించినట్టయింది. ఆ సమయాన స్వామివారి పెదవులు పూలరేకుల్లా మృదువుగా కదిలాయి.

"భీమన్నా! నీ నిష్కల్మష అమాయక భక్తికి నేనెంతో సంతోషిస్తున్నాను. నీలాగే నీ భార్యకూడా మనస్సంతా నన్నేనింపుకొని అమిత భక్తితో కొలుస్తోంది. మీకిద్దరికీ ఒక వరం ఇవ్వాలనుకుంటున్నాను." అన్నాడు.

**తమాలిని** : మనం కోరకుండానే స్వామి వారిచ్చిన వరమేమిటి?

భీమన్న : చెపుతున్నా. "పుణ్యదంపతులైన మీ ఇద్దరికీ బొందితో వైకుంఠ ప్రాప్తి కలుగుతుంది" అన్నారు స్వామివారు.

తమాలిని : నిజమాస్వామీ! ఇది నిజంగా నిజమేనా? కుండలు చేసుకు బ్రతికే మనకు అంతటి వరం ప్రాప్తమవుతుందా! నిజంగా స్వామివారు మీతో అలా అన్నారా?

భీమన్న : తమాలినీ! నేనూ నీలాగే సందేహపడ్డాను. సురాసురులకు సైతం లభ్యం కాని మోక్షం బొందితో వైకుంఠప్రాప్తి మాకు ప్రసాదిస్తున్నావా స్వామీ! అంటూ నాసందేహాన్ని తెలిపాను.

తమాలిని : స్వామీ వారేమన్నారు? ఏమన్నారో త్వరగా చెప్పండి!

భీమన్న : చెపుతాను. నేనూ నీలాగే ఆతృత పట్టలేకపోయాను. అప్పుడు స్వామివారు చిరునవ్వుతో అన్నారు. "భీమన్నా! నిజంగా మీకా యోగం ఉంది. అయితే ఒక మాట. తుండీర మండల పాలకుడు ఎప్పుడైతే మీగుడిసె ముందుకు వచ్చి నిలబడి, దీనాతి దీనంగా నీ పాదాలకు మ్రొక్కుతాడో అప్పుడు మీకు బొందితో వైకుంఠప్రాప్తి కలుగుతుంది" అని పలికారు.

తమాలిని : *(నిరాశతో)* ఇది జరిగే పనేనా స్వామీ! మనదేశపు చక్రవర్తి దీనుడవడమేమిటి! మన పూరిగుడిసెను వెతుక్కుంటూ వచ్చి మీ కాళ్లమీద పడడమేమిటి? కొండనడచుకుంటూ వచ్చి ఎలుక కాళ్ళపైన పడినట్లుందియిదంతా. ఇది జరిగేమాటేనా వట్టి కల కాకపోతే!

భీమన్న : నాకూ అలాగే అనిపిస్తోంది తమాలినీ! బ్రహ్మాదులకు సైతం స్వామి దర్శనమే దుర్లభమైనది. అలాంటిది నాకు దర్శన మివ్వడమేమిటి? దర్శన మివ్వడమే కాక బొందితో వైకుంఠప్రాప్తి కలిగిస్తాననడమేమిటి? తొండమాన్ చక్రవర్తి అంతటివాడు నాకాళ్ళమీద పడడమా? ఊహు. ఇదంతా నా భ్రమ. భ్రమలాంటి కల.

తమాలిని : మనలను భ్రమలో పెట్టడం స్వామివారి లీలాగాధలలో ఒకటేమో! మనం చేసే మట్టి వస్తువులు అమ్ముడు పోతేగానీ పొయ్యి మీదికి కుండ ఎక్కదు.

భీమన్న : ఇదంతా భ్రమ అని ఒక ప్రక్క అనిపిస్తున్నా. స్వామివారికి మనతో ఆటలాడుకోవలసిన పనియేమిటి తమాలినీ! కలలోని స్వామి వారి రూపం, మాటలు నాకనులలో మెదలుతూ, చెవుల్లో గింగురు మంటున్నాయి. నేనది మరువలేకున్నాను తమాలినీ!

**తమాలిని** : నిజమే. వేంకటేశ్వరస్వామివారు తన భక్తుల కెన్నడూ భ్రమలు కల్పించడు. మనం సందేహపడుతున్నాము కానీ స్వామివారికి అదంతా తృణప్రాయంగా ఉంటుంది.

**భీమన్న** : ఔను. మనం కలలో ఊహించని వాటిని స్వామివారు వాస్తవం చేసి చూపించారనడానికి ఎన్నో దృష్టాంతాలున్నాయి. తమాలినీ! మన ఎదుట ఉండే ఈ సప్తగిరులే చూడు ఎంత ఆహ్లాదకరంగా ఉన్నాయో! ప్రపంచమంతటి నుండి స్వామి వారి దర్శనం కోసం ఎన్నో వ్యయప్రయాసల కోర్చుకొని నిత్యమూ ఎందరో యాత్రికులు రావడం చూస్తూనే ఉన్నాము కదా! పట్టి భ్రమలు కలిగివారు వస్తున్నారా?

**తమాలిని** : ఎందరో ఎన్నెన్నో గాథలూ, అనుభవాలు, మహాత్మ్యాలు స్వామివారిని గురించి చెప్పడం మనం వింటూనే ఉన్నాము. ప్రత్యక్షంగా ఆపదలను తొలగించడమూ చూచాము. ఆపద మ్రొక్కులవాడా! అనాథరక్షకా! పాహిమాం పాహిమాం అని వేడుకున్న భక్తులను స్వామి వారెప్పుడూ నిరాశపరచలేదు.

**భీమన్న** : నిజమే తమాలినీ! మన మిలా నమ్మీనమ్మని స్థితిలో ఉన్నా కూడా స్వామివారు మనకు నమ్మకం కలిగించడానికి ఏదో ఒక నిదర్శనం చూపక పోడు. చూస్తూ ఉండు.

*(ఇంతలో ఆకాశమంతటా ఉరుములు, మెరుపులు వెంటనే ఫెటీల్ మని పిడుగు పడిన శబ్దం. దంపతులిద్దరూ పిడుగు తమ మీద పడ్డట్టు అదరి పడ్డారు.)*

**ఇద్దరూ** : ఆపద మొక్కుల వాడా! వడ్డికాసులవాడా! వేంకటేశ్వరా!

**తమాలిని** : *(తేరుకొని)* తమాలినీ! పిడుగు మనమీదే పడినట్టయింది. కానీ మనకేం కాలేదు.

**భీమన్న** : ఔను మన గుడిసెలో నుండి పెటిల్లుమని శబ్దం కూడా వచ్చింది.

**తమాలిని** : నిజమే స్వామీ! పిడుగు మనమీద పడినట్టనిపించినా గుడిసె మీద పడిఉండవచ్చు. లోపలికి పోయి చూద్దాం పదండి.

*(ఇద్దరూ లోనికి పోదురు)*



## 2వ రంగము

*(భీమన్న గుడిసెలోపల పడమటి గోడలో పగులు లాంటి దీపపుగూడు)*

**తమాలిని** : పిడుగు పడ్డా మన గుడిసె పడమటి వైపు కూడా కాలిపోలేదు. గోడలు కూడా దెబ్బతినలేదు. చాలా వింతగా ఉంది స్వామీ!

**భీమన్న** : అటు చూడు తమాలినీ. ఆగోడ మధ్యలో కొత్తగా పగులు ఏర్పడినట్టుంది. ఇంతకు ముందు ఎక్కడుందీ అది?

**తమాలిని** : *(తేరపారచూచి)* నిజమేనండి ఇంతకు ముందక్కడ ఏ పగులూ లేదు; ఓం! అటు ఆ పగుల్లో...

**భీమన్న** : పద చూద్దాం. ఇది పగులు కాదు దీపపుగూడులా ఉంది. పగులైతే గోడ పొడువునా ఉండాలికదా! అలా లేదే!

**తమాలిని** : పిడుగు పడింది ఈ గోడ మీదేనా?

**భీమన్న** : మనింటిమీదే పడింది పిడుగు తమాలినీ! అయినా మనిల్లు కూలిపోలేదు కనీసం గోడకూడా పడిపోలేదు.

**తమాలిని** : అంతేకాదు గోడలోపల ప్రమిదలు పెట్టుకోవడానికి వీలుగా అందరూ కట్టుకొనే పెద్ద దీపపుగూడు లాంటిది ఏర్పడింది. దాన్నే మనం పగులు అనుకున్నాం.

**భీమన్న** : ఆ గూటిలో ఏదో తళ తళా మెరుస్తోంది చూడు తమాలినీ! *(గూటిలో చేయి పెడతాడు. చెక్కలాంటి దానిని బయటికితీస్తాడు)* తమాలినీ! ఇదేదో ఎర్రచందనపు చెక్క పై చెక్కిన ప్రతిమలా ఉందే *(తేరపారచూచి)* ఓహ్ం తమాలినీ! తమాలినీ! శ్రీవేంకటేశ్వరస్వామివారి ప్రతిమయిది! నాకు కలలో కనిపించిన స్వామివారి రూపమే ఈ ప్రతిమలో ఉంది తమాలినీ!

**తమాలిని** : ఆశ్చర్యం! స్వామీ! ఆశ్చర్యంగా ఉంది. ఆ ప్రతిమను నా చేతికోసారి ఇవ్వండి. . . స్వామివారి రూపమిలా ఉంటుందా!

**భీమన్న** : ఔను! తమాలినీ! స్వామివారి రూపం అచ్చంగా ఇలాగే ఉంటుంది ఎర్రచందనపు చెక్కమీద దీని నెవరు చెక్కారో కానీ చాలా అద్భుతంగా చెక్కారు. ఈప్రతిమలో కళ ఉట్టిపడుతోంది.

తమాలిని : ఎవరో చెక్కడమేమిటి స్వామీ! శ్రీవేంకటేశ్వర స్వాములువారే తన ఉనికిని మనకిలా తెలియజేస్తున్నారు. స్వామివారు మీకు కలలో కనిపించిన మాటలను మనం సందేహించాము. పరిపరి విధాలుగా ఆయనను గురించి అనుకున్నాము. మన సందేహాలను పోగొట్టడానికే స్వామివారు పరోక్షంగా తన రూపాన్ని ఈ ఎఱ్ఱచందనపు చెక్కలో ప్రక్షిప్తంచేసి మనకు ప్రసాదించాడు.

భీమన్న : పరోక్షంగా తెలపడమేమిటి ప్రత్యక్షంగానే చూపాడు. మొదట మనమది గ్రహించలేకపోయాము.

తమాలిని : ఎలా?

భీమన్న : మనం స్వామి వారిని సందేహిస్తున్నప్పుడు ఏమి జరిగిందో గుర్తు చేసుకో తమాలినీ!

తమాలిని : ఔను గుర్తొస్తోంది స్వామీ! అప్పుడే అక్షణాననే ఆకాశంలో మెరుపులు మెరిశాయి. ఉరుములు ఉరిమాయి. పిడుగూ పడింది.

భీమన్న : అవన్నీ సహజమే అనుకున్నాం మనమప్పుడు!

తమాలిని : 'ఓ' అంటే పలికే దేవుడు వేంకటేశుడు అనడానికింత కంటె నిదర్శనమేమి కావాలి?

భీమన్న : స్వామివారు నివాసముండే సప్తగిరులు మన గుడిసెకు పడమటిదిశలోనే కదా ఉండేది! అటువైపు ఉన్న గోడమీదే పగులు ఏర్పడి, స్వామివారి ప్రతిమ మనకు లభించింది.

తమాలిని : మనకు దొరకడం కాదండీ! స్వామివారే ప్రసాదించారు.

భీమన్న : ఉరుములు పిడుగులు వచ్చి పడినట్టని పించిందే కానీ అవన్నీ ఏవి! బయటి పక్కకోసారి చూడు నీరెండ బంగారంలా మెరుస్తోంది.

తమాలిని : మనబుద్ధిని మందగింప జేసిన కారుమేఘాలు విడిపోయాయి. ఆకాశం స్వచ్ఛంగా కనబడుతోంది.

భీమన్న : మనకు జ్ఞానోదయం కలిగించడానికి వచ్చిన వెలుగు రేకల్లా ఉందా నీరెండ!

తమాలిని : ఇక నుండయినా స్వామివారిని గురించి ఎలాంటి సందేహాలూ పెట్టుకో కూడదండి!

భీమన్న : స్వామి వారు కలలో గానీ, మరో స్థితిలో గానీ మన కనుల బడ్డప్పుడు భ్రమ అనుకోవడమే పెద్ద భ్రమ తమాలినీ!

తమాలిని : మన భవిష్యత్తును స్వామివారు మునుపే నిర్ణయించారు.

భీమన్న : తమాలినీ! నేనెప్పుడూ నీతో ఒక మాట అంటూ ఉండేవాడిని. మనసారా, కనులారా స్వామివారి రూపాన్నయినా చూచుకుంటూ పూజించుకోవడానికో విగ్రహం కానీ, పటంకానీ మనవద్ద ఉంటే ఎంతబాగుండేదీ అని. అలా లేనందకు నాకెంతో కొదవగా ఉంది అని కూడా చెబుతుండేవాడిని. గుర్తుందా తమాలినీ!

తమాలిని : గుర్తు లేకేమి స్వామీ! అవి లేక పోవడంవల్ల సాలగ్రామాన్ని పెట్టుకొని పూజిస్తుండేవాళ్ళం.

భీమన్న : ఆ కొరత తీరిందిప్పుడు. స్వామివారే ఆ కొరత తీర్చారు. తానే ప్రతిమా రూపంలో వెలిసి మనముందుకు వచ్చినిలిచాడు.

తమాలిని : ఇంత చిన్న ప్రతిమ అయినా రత్న ప్రతిమలా మెరిసి పోతోంది చూడండి. ఇది బంగారు పీఠం మీద అలంకరింపదగినది.

భీమన్న : ఈ ప్రతిమ మనకు విచిత్రరీతిలో, మట్టి గోడలోపల దొరికిందంటే ఇందులో ఏదో అంత రార్థమున్నట్టు అనిపిస్తోందినాకు.

తమాలిని : రత్న ఖచిత స్వర్ణ సింహాసనం పై నెలకొని వుండవలసిన స్వామి, ఇలా ఈ మట్టి గోడలో మనకు లభించడానికి ఏదో విశేషార్థమే ఉన్నట్టు నాకూ అనిపిస్తోంది.

భీమన్న : మన కులవృత్తి మట్టివస్తువులు చేసుకొని బ్రతకడం. స్వామివారి చందన దారుప్రతిమ మన యింటి మట్టి గోడల్లో అద్భుతరీతిలో లభించిందంటే స్వామివారికి మట్టి అంటే ఇష్టంగా కనబడుతోంది.

తమాలిని : ఔను. మనుషులు, చెట్లు చేమలు, పశుపక్ష్యాదులు అన్ని మట్టి మీద పుట్టినవే. మట్టితో బ్రతికేటివే.

భీమన్న : మట్టి అంటే భూదేవి కదా! శ్రీనివాసుడు శ్రీదేవీ భూదేవీసమేతుడు. మట్టి గోడల్లో స్వామివారి ప్రతిమ మనకు దొరికింది. దీనివల్ల స్వామివారి స్వభావం అర్థం చేసుకోవాలి. తమాలినీ! ఇప్పటివరకూ నిజమైన పద్మాలతోనూ, తులసీ దళాలతోనూ స్వామివారిని పూజిస్తూ ఉండేవాళ్ళం. ఇప్పుడు నాకు కనువిప్పు కలుగుతోంది. ఇక నుండి స్వామివారిని మట్టితో స్వహస్తాలతో చేసిన తులసీ దళాలను, పద్మాలను స్వామివారికి అర్పిస్తూ, అర్చన చేస్తాను. ఏమంటావు తమాలినీ!

తమాలిని : స్వామివారు ఇన్నిన్ని నిదర్శనాలు చూపినా మనమా విషయం తెలుసుకోలేక పోతే మూర్ఖులమవుతాం. మనకులభించిన స్వామివారి ఈ ప్రతిమను మట్టి తులసీ దళాలతో, పూలతో పూజ చేయడం ఉత్తమమైనదని నాకూ అనిపిస్తోందండీ.

భీమన్న : నాకొకటనిపిస్తోంది తమాలినీ. పద్మమూ, చందన తరువూ శ్రీదేవికి, మన్ను భూదేవికి ప్రతీకలు. స్వామివారి ఈ చందన ప్రతిమ మట్టిగోడల మధ్య మనకు దొరికింది కదా! శ్రీదేవి, భూదేవులకు సంకేతమైన పద్మ కుసుమాలతోనే కాక, మట్టి, తులసీ దళాలతో స్వామివారిని అర్చించడం మనకు తగినదిగదా!

తమాలిని : ఔను స్వామీ!

భీమన్న : నేనిప్పుడే తరతరాల నా కుల వృత్తితో నాకులభించిన నేర్పరి తనాన్నంతా రంగరించి మట్టితో అందంగా తులసీ దళాలను, పద్మపుష్పాలను తయారు చేస్తాను. ప్రతిరోజూ వానితోనే పూజ చేద్దాము తమాలినీ!

తమాలిని : మట్టితో చేసిన పూలతో, తులసి దళాలతో పూజ చేయడం అపూర్వ విషయంగా నాకు కనబడుతోంది. మును పెప్పుడో వేటగాడయిన కన్నప్ప తన వృత్తిని బట్టే శ్రీకాళహస్తీశ్వరుడిని పూజించాడు. ఆ పరమేశ్వరుని దయకు పాత్రుడయ్యాడు.

*(ఇంతలో బయటి నుండి పిలుపు)*

భీమన్నా! భీమన్నా!! ఓసారి బయటికి రా!



## 3వ రంగము

(భీమన్నా, తమాలినీ గుడిసెలోపలి నుండి బయటికి వస్తూ...)

**భీమన్న** : ఎవరూ? ఎవరు నన్ను పిలిచేది? ఈ గొంతు ఎక్కడో ఎక్కడో విన్నట్లని పిస్తోందో నాకు.

(ఇంటిముందు పంచె కట్టు, భుజంమీద తుండుగుడ్డతో ఉన్నతడు కనిపిస్తాడు.) ఎవరు నీవు? నిన్నెప్పుడూ చూచినట్లు లేదే?

**అతడు** : నన్నిలా ఎప్పుడూ చూచి ఉండవులే భీమన్నా! నేనో కార్యం నిమిత్తం నీవద్దకు వచ్చాను.

**భీమన్న** : కుండలకోసం వచ్చావా? ప్రస్తుతానికి రెండోమూడో సిద్ధంగా ఉన్నాయి. ఇంకా ఎక్కువ కావాలంటే వారం రోజులు ఆగవలసి ఉంటుంది.

**అతడు** : కుండలకోసం కాదు నేను వచ్చింది.

**భీమన్న** : ఈ కుమ్మరి వాని ఇంటికి కుండలకోసం కాక మరెందుకొస్తారబ్బా!

**అతడు** : కుండలు చేసేపని నేర్చుకోవడానికి వచ్చాను.

**భీమన్న** : మీరూపం చూస్తే అలా అగుపించడం లేదే!

**అతడు** : ఇంకెలా కనిపిస్తున్నాను?

**భీమన్న** : నీమాటా, తీరూ అలా అనిపించకుంటే...

**అతడు** : లేదు భీమన్నా! నేను నీదగ్గర పనికి కుదరడానికీ, కుండలూ, మట్టి బొమ్మలూ చేయడం నేర్చుకోవడానికీ వచ్చాను. నా మాటల మీద నీకు నమ్మకం కుదరడం లేదా?

**భీమన్న** : అదికాదు. నేను మరొకరికి పని యిచ్చేటంతటివాణ్ణి కాదు. నేను మట్టితో కుండలూ, బొమ్మలూ చేస్తూ ఉంటే నాభార్య నాకీ పనిలో సహాయం చేస్తూ ఉంటుంది. మేం చేసే పని మాయిద్దరికే సరిపోతోంది. వాటిమీద వచ్చే ఆదాయం బొటాబొటిగా మా కుటుంబానికి సరిపోతోంది. మరొకరిని పనిలో పెట్టుకొనేటంతటి ఆదాయం మాకు లేదు.

తమాలిని : మరొక్కరికైనా భోజనం పెట్టే స్తోమత మాకు లేదు.

అతడు : 'స్తోమత' అంటే ఏమిటమ్మా! ఆదాయం పెంచుకొన్నప్పుడు స్తోమత పెరుగుతుంది. మనం అదనంగా మరో పని కల్పించుకోవడంవల్ల ఆదాయం పెరుగుతుంది. మీరు కుండలూ, బొమ్మలూ చేసే పనే కాకుండా ఉపాధి పెంచుకోవాలని మరోపని కూడా అప్పుడప్పుడూ చేస్తుంటారుకదా!

తమాలిని : ఔను. తిరుమల యాత్రికులకు అప్పుడప్పుడూ భోజనాది వసతి సౌకర్యాలు ఏర్పరుస్తూ ఉంటాము. వాళ్ళిచ్చే దానిని స్వామివారి ప్రసాదంగా స్వీకరిస్తుంటాము.

అతడు : మీరిటువైపు వచ్చే యాత్రికులకందరికీ అంటే చాలా మంది వచ్చినప్పుడు వసతి ఏర్పాటు చేయలేక పోతుంటారు కూడా. మీకు మరో మనిషి సహాయం ఉంటే ఇంకా ఎక్కువమందికి వసతి ఏర్పరచవచ్చు కదా!... ఇదో మీ యింటి చుట్టూ ఖాళీ జాగా ఉంది. ఆఖాళీ స్థలంలో మరో పెద్ద గుడిసె వేద్దాం. ప్రక్కనే అడవి ఉంది. గుడిసెకు కావలసిన కట్టెలు, బోదా, తీర్లూ అన్నీ అక్కడినుండే తెచ్చుకుందాం.

తమాలిని : నీవు చెప్పేది బాగానే ఉంది. కానీ...

అతడు : నా ఒక్కడి భోజనం కోసం వెనుకాడుతున్నారా? దానిగురించి మీరేమి చింతించకండి. కుండలూ, బొమ్మలూ మీరెలా అమ్ముకుంటారు? ఇంటికి వచ్చి అడిగిన వారికిస్తారు లేకపోతే నెలకో, రెణ్ణెల్లకో తిరుపతికిపోయి అమ్ముకొని వస్తాడు భీమన్న. ఒకనాడన్నా వాటినన్నీ అమ్ముకు వచ్చాడా?

భీమన్న : ఒక్కోసారి కారు చౌకగా అడుగుతారు. గిట్టుబాటుకాదు. అదంతా ఆయా సమయాలను బట్టి ఉంటుంది.

అతడు : అలా కాకుండా తిరుపతిలో అంగడివాళ్ళెవరితోనైనా మాటాడుకొని ఎప్పటికప్పుడు తయారు చేసిన వాటిని అక్కడికి చేరిస్తే... అంగడివాళ్ళకు ఏదోకొంత ముట్టచెపితే... ఎలా ఉంటుంది?

భీముడు : అంత తీరుబాటూ, సమయమూ మాకు దొరకడం లేదు. ఇంటిలోనే సరిపోతోంది.

అతడు : నేనుంటానుగా. వాటి వ్యవహారమంతా నేను చూచుకుంటా. భీమన్నా! నాకు నీవద్ద పని చూపించు చాలు. ఆ తర్వాత చూడు నాపనితనమేమిటో!

అతడు : నీవు చూస్తుంటే ఇలాంటి పనిచేసే కుటుంబానికి చెందినవాడివిలా కనబడటంలేదు... నీపేరేమిటి?

అతడు : నాపేరు శ్రీపతి.

భీమన్న : నీ పేరు విన్నా, నిన్ను చూచినా నీవు మట్టిపని చేయగలిగే వాడివిలా అనిపించదెవరికీ... అది సరే నీవేం చదువుకున్నావు? ఎక్కడినుండి వచ్చావు?

శ్రీపతి : *(చిరునవ్వుతో)* నేను చదువుకోవడమైతే చాలానే చదువుకున్నాను. అదంతా వేంకటేశ్వరుని భక్తులనుండి మాత్రమే నేర్చుకున్నది. ఇక నేనెక్కడినుండి వస్తున్నానంటావా? అదో! ఆ వెంకటగిరులలోని ఆశ్రమాలనుండి వస్తున్నా.

తమాలిని : అయితే నీవు నిత్యమూ ఏడుకొండలస్వామిని దర్శించుకుంటూ ఉంటావు. స్వామివారి సుందర సుకుమార రూపాన్ని నయనా నందకరంగా వీక్షిస్తూ ఉండి ఉంటావు. నీ యంతటి మహాద్భాగ్యం మాకెప్పుడు కలుగుతుందో!

శ్రీపతి : మీ దగ్గరే ఉండి ఆ విషయాలన్నింటినీ చెపుతానమ్మా! నన్ను మీయింట చేరనీయండి. మీలో ఒకడిగా కలుపుకోండి. మీకన్నింటా చేదోడు వాదోడుగా ఉంటాను.

తమాలిని : నీవు చూస్తే ఉన్నత కులస్థుడివిగా ఉన్నావు. ఇటువంటి నీవు ఇలాంటి మట్టిపని చేసుకునే మాయింటిలో ఉండడం చూచిన వాళ్ళు, విన్నవాళ్ళు ఏమనుకుంటారో!

శ్రీపతి : అదా నీ సందేహం తల్లీ! కులాన్ని బట్టి గొప్పదనం వస్తుందా? గుణాన్ని బట్టి వస్తుందా? పనులను బట్టి కులాలను ఏర్పరచుకున్నారే కానీ గుణాన్ని బట్టి కాదమ్మా! లోకంలోని మనుషులందరూ ఒకే తీరున

పుడుతారు. చావడం కూడా అలాగే ఉంటుంది. ఎవరూ కలకాలమూ బట్టకట్టుకొని ఉండిపోలేరు కదా! మనుషులు లేకున్నా కీర్తి ప్రతిష్ఠలు మాత్రం నిలిచి ఉంటాయి. మనుషులు చేసే పనులను బట్టి పాపపుణ్యాలూ, పునర్జన్మలూ, మోక్షాలూ ఉంటాయి కానీ కులాలను బట్టి ఉండవు.

భీమన్న : ఎలా చెపుతారామాట?

శ్రీపతి : చూడు భీమన్నా! గుహుడు ఒక నిషాధరాజు. గిరిజనంలో ఒక తెగ అయిన శబరకులంలో పుట్టింది శబరి. సూర్యవంశస్థుడైన శ్రీరాముడు గుహుని ఆతిథ్యం స్వీకరించాడు. శబరి ఇచ్చిన ఎంగిలి పండ్లను తిన్నాడు. శ్రీకృష్ణుడొక పశువుల కాపరి అయినా సర్వజగత్తునూ తన చక్రంతో నడిపించాడు. క్షత్రియుడైన అర్జునుడికి లోకరీతినీ, కర్మాదియోగాలనూ బోధించిన గురువు అయ్యాడు. మతంగమహర్షి ఎవరు? అరుంధతీ దేవి ఎవరు? వారిని నిమ్నకులస్తులంటారా ఎవరైనా? చంద్రవంశపు రాజయిన హరిశ్చంద్రుడు చండాలుడైన వీరబాహు వద్ద పనిచేయలేదా? క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రహ్మర్షి కాలేదా? మహర్షి కుమారుడైన పరశురాముడు క్షత్రియకుల సంహారణకు పూనుకోలేదా? ఇంకా ఇలాంటి దృష్టాంతాలు చాలా ఉన్నాయి. ఒక ఘనకార్యాన్ని నిర్వహించాలంటే కులమూ గోత్రమూ అడ్డు వచ్చిందా వీరందరికీ?

భీమన్న : అది సరే. "నలుగురితో నారాయణా" అంటారు కదా పెద్దలు.

శ్రీపతి : (చిరునవ్వుతో) "నలుగురితో పాటు నారాయణా" అనే కాదు "గుంపుతోపాటూ గోవిందా" అనికూడా అంటారు మనుషులు. ఒకరు 'నారాయణా' అని అంటే 'నారాయణా' అని నలుగురూ అనడం, ఒకరు 'గోవిందా' అంటే గుంపంతా 'గోవిందా' అనిపలకడం అంటే ఏమని నీవు భావిస్తున్నావు? ఒకరు భక్తితోనో, శ్రద్ధాసక్తులతోనో అన్నమాటను పట్టుకొని నలుగురూ అలాగే అంటారు. అందుకే భక్తీ శ్రద్ధా అన్నింటికీ మూలం అన్నా నేనిదివరకే మీలో అవి ఉన్నాయి కాబట్టే నేను మీవద్దకు రావాలనిపించి, ఇలా వచ్చాను.

తమాలిని : మాకంతటి శక్తిగానీ, భక్తిశ్రద్ధలు కానీ లేవు.

భీమన్న : మేము అంతటి గొప్ప వారమూ కాదు.

శ్రీపతి : ఎవరి శక్తి వారికి తెలియదన్నట్లుగానే మీశక్తిమీకు తెలియడంలేదు. ఎక్కడో ఉన్న నేను మీసంగతి తెలీకుండానే మీవద్దకు వచ్చానా?

తమాలిని : మా వారలెవరూ అంత శక్తిమంతులు కారు.

శ్రీపతి : నీ మనసులో మాట నాకర్థమవుతోంది తల్లీ! ఈభరతఖండంలో మూడు సముద్రాల మధ్య ప్రాంతాన్ని ఇటు సేతువు నుండి అటు మధురవరకూ పరిపాలన చేస్తున్న ఆంధ్రచక్రవర్తులు శాతవాహనులు పుట్టుకతో కులాల వంశానికి చెందినవారే. వారంతటి స్థితికి ఎలా ఎదిగారు? దీక్షా, పట్టుదలా, పనిపట్ల అంకితభావం, అంటే భక్తీ, లక్ష్యంపట్ల శ్రద్ధా, నిరంతరశ్రమ కనబరచడం వల్లనే కదా! అవి ఉన్న మనుషులు, ఏమైనా సాధించగలరు.

భీమన్న : దైవకృపకూడా తోడు కావాలిగా.

శ్రీపతి : ఔను. అవి ఉన్నప్పుడే దైవకృపా ఉంటుంది. (తమాలినితో) నాకాకలవుతోంది. ఏమైనా పెడతావా తల్లీ!

తమాలిని : మాయింటిలో .... గంజీ..... అంబలి తప్ప ....

శ్రీపతి : అలా కించపడకమ్మా! ఆకలి తీర్చడానికి ఏదైతేనేమి? గంజే పాయసం, అంబలే అమృతం... ఉన్నదేపెట్టు నన్ను మీలో ఒకడిగానే భావించండి.



# ద్వితీయాంకము

## 4వ రంగము

*పాత్రలు : తుండీర మండల ప్రభువు తొండమానుడు, అంగీరసమహర్షి*

*(ఆశ్రమ ప్రాంతం)*

**తొండమానుడు** : అంగీరస మహర్షికి తుండీరమండల మహాప్రభువు... తొండమాన్ చక్రవర్తి నమస్కారము లందజేస్తున్నాడు.

**అంగీరసుడు**: దీర్ఘాయుష్మాన్ భవ! తొండమాన్ చక్రవర్తీ! నీకు తగిన ఆసనం ఈ కుటీరంలో సమకూర్చలేక పోతున్నాను. అన్యథా భావించకండి.

**తొం.మా.** : మహర్షీ! మేమిప్పుడు మీకు అతిథులము కాము. అభ్యర్థులము మాత్రమే. మీసహాయం కోరి వచ్చాము.

**అంగీరసుడు**: మీ మనస్సులోని మాట సంకోచించకుండా తెలియజేయండి మహారాజా!

**తొం. మా.** : మా మనస్సు అవ్యక్త వేదనతో కుంచించుకు పోతోంది, మహర్షీ! మాలో ఏవో తొకతొకలు గుబులు రేపుతున్నాయి.

**అంగీరసుడు**: దక్షిణ గంగ సువర్ణముఖి నదీ జలాలను స్వీకరించి సేద తీరండి మహారాజా! మీ మనోవేదన ఉపశమించి మనసు కుదుట పడుతుంది.

**తొం. మా.** : (అంగిరస మహర్షి శిష్యుడు అందించిన నీరు త్రాగుతాడు) మహర్షీ! మేము స్వర్ణముఖినదీ జలాలనే నిత్యమూ ఉపయోగించుకుంటూ ఉంటాము. మా రాజాంతఃపురం దాపుల నుండే ప్రాగ్దిశలో ఈనది ప్రవహిస్తూ ఉంది. మేమటు పశ్చిమ దిశ నదీతీరాన నివాసముంటే, మీరిటు తూర్పుదిశన ఉన్నారంతే. అయినా మీ సాన్నిహిత్యంలో ఉన్నా ఈ నీరు ఒకే నది నీరయినా మాకిప్పుడు అమృతతుల్యంగా ఉంది.

**అంగీరసుడు**: అది మన అంతరంగ స్థితిని బట్టి ఉంటుంది ఇప్పుడు నీ ఆవేదనకు కారణమైన పూర్వాపరాలను గుర్తుచేసుకొని తెలియజేయండి మహారాజా!

**తొం. మా.** : నావల్ల ఒక మహాపరాధం జరిగిపోయింది మహర్షీ! అయితే ఆ అపరాధాన్ని తాత్కాలికంగా, నా బంధువూ, శేషశైల ప్రభువూ అయిన

శ్రీనివాసుడు తొలగించి వేశాడు. కానీ అందుకోసం నేను చాలా పెద్ద మూల్యమే చెల్లించుకోవలసి వచ్చింది.

**అంగీరసుడు :** (చిరునవ్వుతో) అదెలా జరిగిందో తెలుపండి మహారాజా!

**తొం. మా. :** మీకా విషయం చెప్పుకోవడానికే వచ్చాము మహర్షీ! కొన్నాళ్ళక్రితం కూర్ముడనే బ్రాహ్మణోత్తముడు కాశీయాత్ర చేస్తూ తన భార్యాబిడ్డలను మా సంరక్షణలో ఉంచిపోయాడు. మేమందుకు సంతోషపడి వారికి కావలసి వాసగ్రాసాదులను ఏర్పరచాము. అయితే కొంతకాలానికి పరిపాలనా వ్యవహారాలలో పడి వారిని మరచిపోయాము. తర్వాత కూర్మాచార్యులు కాశి నుండి తిరిగి వచ్చి తన భార్యాబిడ్డలను గురించి అడిగాడు. అప్పుడు.. ఆక్షణాననే అతని భార్యాబిడ్డలను గూర్చి విచారణ చేస్తే ఏముంది... *(బాధతో మౌనంగా ఉండును)*

**అంగీరసుడు :** స్వాంతన చెందండి మహారాజా!

**తొం. మా. :** మహర్షీ! మేమేర్పాటు చేసిన గృహంలో వారు అస్థిపంజరాలై కనిపించారు. అయితే ఆవిషయం కూర్మాచార్యులకు తెలియనీయకుండా ఆయనను మరుదినాన రమ్మని చెప్పి పంపాము. అయనటు పోయిన వెంటనే ఈసమస్యకు పరిష్కారం చూపగలవాడొక్కడే అని నేను శేషాచలానికి తత్క్షణమే బయలుదేరాను. మహర్షీ! వేంకటాచలనాధుని నేను ఎప్పుడనుకొంటే అప్పుడు దర్శించుకొనేటంతటి బంధుత్వమూ, ఆదరాభిమానాలు ఉన్నసంగతి మీకు తెలునుకదా!

**అంగీరసుడు :** మహారాజా! నీ సోదరుడు ఆకాశరాజు కుమార్తె పద్మావతీదేవిని శేషగిరినాధుడు శ్రీనివాసుడు వివాహమాడాడు. నీవే శేషగిరిలో అయన నివాసానికి ప్రాకారాదులు ఏర్పరచావనే సంగతి సర్వజన విదితమే!

**తొం. మా. :** ఆచనువుతో వేళకానివేళఅర్ధరాత్రి శ్రీనివాసుని కలునుకొని జరిగినది తెలిపాను. అందుకాయన కించిత్తు కోపగించినా నామీది అభిమానంతో కూర్ముని భార్యబిడ్డల అస్థికలు తెప్పించి వానిని పాండు తీర్థమున వేయించాడు. వారా తీర్థంనుండి పునర్జన్మ ఎత్తి తిరిగి మాముందుకు వచ్చారు.

**అంగీరసుడు :** ఆపాండు తీర్థమే భవిష్యత్తులో అస్థి తీర్థంగా ప్రసిద్ధమవుతుంది మహారాజా!

**తొం.మా :** మహర్షీ! మేమాగండం నుండి శ్రీనివాసుని దయవల్ల బయటపడినామే కాని అంతటితో శ్రీనివాసునితో మాకున్న చనువూ, ప్రాముఖ్యతా సమసిపోయాయి.

**అంగీరసుడు :** ఏమిటిది మహారాజా! కొంచెం వివరంగా చెప్పు!

తొం. చ : మహర్షి! ఈ లోకంలో శ్రీనివాసునితో ప్రత్యక్షంగా సంభాషించే చొరవా, ప్రాముఖ్యతా మాకుతప్ప మరెవరికీ లేకుండేవి. అలాంటిది ఆ దినం నుండి శ్రీనివాసుడు మాకు కనిపించడు. మేమెంతగా ప్రార్థించినా ఆయన దర్శనం కావడం లేదు.

అంగీరసుడు: ఆ తర్వాత నుండి నీవు శ్రీనివాసుని ఆయన నివాస స్థలంలోనైనా దర్శనం పొందలేక పోతున్నావన్న మాట.

తొం. చ. : ఔను మహర్షి! శేషాచల వాసుని కోసం నేనెంతెంత వెదకినా ఎన్నెన్ని విధాలుగా వెదుకుచున్నా, ఎన్ని ప్రయత్నాలు చేసినా అన్నీ వ్యర్థమయ్యాయి. ఆయన దర్శనం కాలేదు కానీ ఒకనాడు ఆకాశవాణి భాషితంగా ఆయన మాటలు వినిపించాయి.

అంగీరసుడు సంశయించకుండా ఆమాటలేమిటో తెలియజేయి మహారాజా!

తొం. చ. : శ్రీనివాసుడాదినాన, "తొండమాన్ చక్రవర్తీ! స్త్రీ శిశుమరణాలకు నీ అలక్ష్యమే మూలకారణం. నీవెంతో బాధ్యతా రహితంగా ప్రవర్తించావు! నీతో నాకున్న బంధుత్వరీత్యా, పద్మావతీదేవి బాధపడుతుందని భావించి నీవు చిక్కుకున్న ఆవిషమసమస్యనుండి నిన్ను కాపాడగలిగానే కానీ అంతటితో నీపాపమంతా పరిహరింపబడిందని మాత్రం తలంచకు. ఇకనుండి నీవు మమ్ముచూడవలసిన పనిలేదు" అన్నాడు మహర్షి!

అంగీరసుడు: రాజా! నీవెంతటి దుస్థితిలో పడ్డావు?

తొం. చ. : అంగీరస మహర్షి! ఈదుస్థితి నుండి ఎలా బయట పడగలను? శ్రీనివాసుని మెప్పించి నిత్యమూ ఆయన దర్శనం కలిగే మార్గం ఏదైనా ఉందేమోనని మీకోసమీ ఆశ్రమానికి వచ్చాను. నా అభ్యర్థనను మన్నించి నాకోమార్గాన్ని చూపించండి మహర్షి!

అంగీరసుడు: (సాలోచనగా) మార్గముంది మహారాజా!

తొం. చ. : (ఉత్సాహంతో) త్వరగా చెప్పండి మహర్షి!

అంగీరసుడు : శ్రీవేంకటాచలాధినాథుడు భక్తసులభుడు తొండమాన్ చక్రవర్తీ! ఆయనకు ఇష్టమైన పూలు పత్రాలేమిటో నీకు తెలుసుకదా!

తొం. చ. : శ్రీనివాసునికి కమలకుసుమాలన్నా, తులసీ దళాలన్నా మహాప్రీతి పాత్రమైనవి అంగీరస మహామునీ!

అంగీరసుడు: ఔను శ్రీవేంకటేశ్వరస్వామి వారికి నీవు చేయవలసిన కార్యక్రమ మేమంటే

తులసీ దళాలనుకాని కమలాలను కానీ బంగారంతో చేయించి శ్రీనివాసునికి వేళతప్పకుండా సహస్రనామార్చన చేస్తూ సమర్పించుకో. ఇది మహారాజులకు మాత్రమే ఉచితమైన దనిచెవుతున్నాను. ఈపూజా విధానంలో ఎన్ని అవాంతరాలెదురైనా మధ్యలో విడిచి పెట్టకుండా ప్రతిదినమూ అర్చన చేయాలి. అంతేకాకుండా ఒక దినము వాడిన సువర్ణ పుష్పాలను మరోసారి ఉపయోగించకుండా నీవు సహస్రనామార్చన చేశావంటే వేంకటేశ్వరస్వామి తప్పకుండా నీకు దర్శనమిస్తాడు.

**తొం. చ.** మంచిది మహామునీ! బొక్కసం పాళెంలో నిక్షిప్తమయిన మాకోశాగార ధనాన్నంతటినీ వినియోగించి స్వర్ణపుష్పాలుగా చేయించి ప్రతిదినమూ శ్రీనివాసునికి సహస్రనామార్చన చేసి మెప్పిస్తాను. ఆయన దర్శన భాగ్యాన్ని పొందుతాను. అంగీరసమునీంద్రా! మా అభ్యర్థనను మన్నించి మార్గ నిర్దేశకాన్ని సూచించి ఎంతో సహాయాన్ని అందజేసినందుకు నా నమోవాచములు. మునీంద్రా! మాకిక సెలవిప్పించండి.

**అంగీరసుడు** మంచిది మహారాజా! అభీష్టసిద్ధిరస్తు *(తొండమానుడు వెళ్ళి పోవును)* *(మందహాసం చేస్తూ)* తొండమాన్ చక్రవర్తి శ్రీవేంకటేశ్వరస్వామి వారి భక్తుడేకానీ అతడిలో అహంకారం కొంత అధికంగా ఉన్నట్లు ద్యోతకమవుతోంది. స్వామివారు ఈరాజుకు బాంధవుడే కాదు ఆపద్బాంధవుడుకూడా. అలాంటి స్వామి ఈరాజుపట్ల కినుక వహించడానికి కారణం ఈతనికున్న అహంభావమేననిపిస్తోందినాకు. ప్రభుతకూ, బంధుత్వానికీ, భక్తి తత్పరతకూ తారతమ్యాన్ని గ్రహించలేక అర్భకంగా ఆలోచిస్తున్నాడు, తొండమాన్ చక్రవర్తి. జరుగబోయే పరిణామాలను, భూత భవిష్యత్ వర్తమానాలు తెలిసిన వేదవేద్యుడూ, పురాణపురుషోత్తముడూ, అప్రాకృత శరీరుడూ, లీలామానుష విగ్రహుడూ అయిన అనంత తత్వమూర్తి శ్రీనివాసమూర్తే నిర్ణయించాలి.

*మానయః సూత సర్వార్థ తత్వజ్ఞ సర్వవేదాంతపారగ*
*యేన చారాధిత స్సద్యశ్శ్రీమద్వేంకట నాయకః!*



## 5వ రంగము

*(తొండమాను చక్రవర్తి శ్రీవేంకటేశ్వరస్వామి వారి విగ్రహప్రతిష్ఠ చేసి, సువర్ణముఖినదీ తీరాన పూజచేయు చుండును. విగ్రహం ముందు బంగారు కమలాలు తులసీ దళాలు కొన్ని ఉంటాయి, అతనికి కుడి వైపున్న పళ్ళెంలో కుప్ప పోసిన బంగారు తులసీ దళాలు ఉండును. దీపపు సెమ్మెలు వెలుగుతుండును. పూజకుకావాలసినవన్నీ ఉండును. తొండమానుడు జందెం, దోవతి మాత్రం ధరించి అర్చకుడికి తగ్గ వేషంలో ఉండును. నుదుట త్రిపుండ్రములు, చెవులకు బంగారు జూకాలు, చేతులకు వజ్రాల కంకణాలు - మొ॥నవి.)*

**తొండమానుడు** : (పూజచేస్తూ) స్వామీ! శ్రీనివాసా!

అంగిరస మహర్షి నిర్దేశించనట్లుగా బంగారు తులసీదళాలతోనూ స్వర్ణ పద్మాలతోనూ పూజిస్తున్నాను. నాపైన కినుక విడనాడవా... నీకినుకను నేనెట్లు పోగొట్టగలను! నీ అలుక నేనెట్లు తీర్చగలను?

సీ॥ *అచ్యుత! గోవింద! అప్రాకృత శరీర!*
*వేంకటేశ్వర నాదువేడికోలు*
*అఖిల సురాధ్యక్షుడగు మనుజశ్రేష్ఠ!*
*వేంకటేశ్వర నీకు వేడికోలు*
*వేద వేద్య! పురాణ విదిత పురుషరత్న!*
*వేంకటేశ్వర నాదు వేడికోలు*
*సృష్టి స్థితిలయ విశిష్ఠ! మూల పురుష!*
*వేంకటేశ్వర నీకు వేడికోలు*
*తొండమాను సామ్రాట్టుకీ దోషమణచి*
*నీదు దర్శన భాగ్యమ్ము నిడుము దేవ!*
*ఊడ్చి నాపాపములనన్ని ఉద్ధరించి*
*తొలిదినమ్ముల విధమున మెలగుమయ్య!*

దేవా కరుణించవా నన్ను! నేను చేసిన ఒక చిన్న తప్పిదమునకు ఇంత పెద్ద శిక్షా! తప్పులను కాచే దయామయుడవందురే నిన్ను! ఇదేనా నీదయ? నీవు నిజంగా దయాహృదయుడవైతే నాకు వెంటనే నీదర్శన భాగ్యంకలిగించు

ఓం శ్రీవేంకటేశాయనమః

ఓం శ్రీనివాసాయ నమః

ఓం దేవ పూజితాయ నమః

ఓం చక్రధారాయ నమః

ఓం త్రిగుణాశ్రయాయ నమః

ఓం వైకుంఠ పతయే నమః

ఓం పరమార్థ ప్రదాయ నమః

ఓం దోర్దండ విక్రమాయ నమః

ఓం శ్రీవిభవే నమః

ఓం జగదీశ్వరాయ నమః

భగవాన్! వేంకటేశ్వరా! మూడు నెలలుగా నేను స్వర్ణ తులసీ దళాలతో, పద్మాలతో ఏకాగ్రచిత్తంతో నీకు సహస్రనామార్చన చేస్తున్నానే! అంగిరస మహర్షి ఒకటి చెప్పితే నేను రెండుగా స్వర్ణ దళాలనూ, పుష్పాలనూ సమర్పిస్తున్నానే! నామీద దయ కలుగలేదా! నామొరనీ చెవుల పడలేదా! ఎదురెదురుగా కూచొని మనమెన్ని మాటలు మాట్లాడుకోలేదు! నాచేతులు పట్టుకొని నీవు చిరునవ్వుతో సల్లాపాలాడడం మరచిపోయావా! నేనెప్పుడనుకుంటే అప్పుడు నీచెంతకు వచ్చే వాణ్ణికదా! వచ్చినప్పుడల్లా నీవు నన్నెంతో సాదరంగా ఆహ్వానించేవాడివే. ఆనందంగా మాటాడేవాడివే! అవన్నీ మరచిపోయావా? తిరిగీ అంతటి అభిమానాన్ని నీనుండి పొందడానికే కదా నేనీ స్వర్ణతులసీ దళాలతో నిన్ను పూజిస్తున్నాను! మూడు నెలలుగా నేను నిన్ను అర్చిస్తున్నానే! ఒక్కసారి, ఒక్కసారంటే ఒక్కసారి నాకలలోనైనా కనిపించవా! నీ మృదుభాషణలు నాకువినిపించవా!

అంతేకాదు శ్రీనివాసా! నేను నీ ముందు పెట్టే బంగారు పుష్పాలను మాయం చేసి మట్టి పూలను నీముందు పెట్టుకుంటున్నావా? నీవు చేసే పనా యిది! ఛ.ఛ. నేనే తప్పుగా తలస్తున్నాను. ఇది నీపని కాదు నీవు నాబంగారు దళాలను దోచుకునేటంతటి వాడివి కావు. బంగారానికి కొదవేమిటి నీకు శ్రీనివాసా! శ్రీదేవి నీవక్షస్థలాన నెలకొని ఉంది. ధనాధిపతి అయిన కుబేరుడు నీకు సర్వవేళలా అండదండగా ఉంటాడు. వసుంధర అయిన భూదేవి నీ చెంగట ఉంటుంది... నేను తప్పుగా ఆలోచిస్తున్నాను.

అయితే నా సందేహ మొకటి తీర్చేవారెవరు? మొన్నటికి మొన్న నీ పాదాలముందు నేను పెట్టిన బంగారు తులసి పూలపైన కొన్ని మట్టి పూలు వచ్చి చేరాయే. అవి ఎలా వచ్చాయి? ఈ దినం అలాటి మట్టి పూలే నేను ఉంచిన స్వర్ణ పుష్పాలను ప్రక్కకు నెట్టి నీపాదాల చెంతకు ఎవరు చేర్చారు? ఎవరైనా నీభక్తుడు చేర్చాడా? ఎవరైనా నన్నాట పట్టించడానికిలా చేశాడా? వాడు నీభక్తుడా? దొంగా? రాత్రులందుకూడా నేను నిన్ను తలచుకోలేదని నీకు కోపమా? మునుపు ఒకసారి అర్ధరాత్రి నేను నీ ఏకాంతానికి భంగం కలిగించానని చిన్న బుచ్చుకోలేదా నీవు?

*(చింతాక్రాంతుడై ఉన్న ఆసమయాన కుమారుడు శ్రీనివాస యువరాజు తొండమానుని వద్దకు వస్తాడు)*

**శ్రీనివాసుడు :** నాన్నగారూ! మీ ముఖమలా వివర్ణమై ఉందేమి? మీలో మీరు ఏదో గొణుగుకుంటున్నారెందుకు? స్వామి వారు దయచూపలేదా? మీరిలా లోలోపల మదనపడడానికి కారణమేమిటో చెప్పండి.

**తొండమానుడు :** కుమారా శ్రీనివాసా! ఏడుకొండల వాడయిన ఆశ్రీనివాసుని పేరే నీకూ పెట్టుకున్నాను. స్వామివారిని, నీవూ, నేనూ ఏసమయంలోనైనా దర్శనం చేసుకొని ప్రత్యక్షంగా మాటాడేవాళ్ళంకదా! అలాంటిది ఈనాడు స్వామి సాన్నిహిత్యం కాదుకదా అయన దయకైనా పాత్రులంకాలేక పోతున్నాము. ఇంకా చెప్పాలంటే ఆయన మనమీద ఆగ్రహం ప్రదర్శిస్తున్నాడని పిస్తోంది.

**శ్రీనివాసుడు :** ఏమిటి నాన్నగారు! పరమ నిష్ఠాగరిష్ఠుడవై మూడుమాసాలుగా సువర్ణ పుష్పాలతో సహస్రనామార్చన చేస్తూ వేంకటేశ్వరస్వామిని కొలుస్తున్నారే! అలాటి మీపైన స్వామికి ఆగ్రహమా?

**తొండమానుడు :** ఔను కుమారా! శ్రీనివాసా! మొన్న స్వామిని పూజిస్తూ నేను అయన విగ్రహం పాదాల ముందు పెట్టిన బంగారు పూలపైన మట్టితోచేసిన పూలు పరచుకొని ఉన్నాయి. నిన్న బంగారు పూలు కనిపించకుండా అడుగునపడి ఉన్నాయి. వాటిమీద అవే మట్టిపూలు! ఈ దినం నేనుంచిన బంగారు పూలు ప్రక్కకు తోయబడి మట్టిపూలు స్వామి వారి కాళ్ళ చెంతకు చేరాయి. దీనికి కారణం ఇదమిద్ధంగా

తెలియకపోయినా స్వామివారు అలా సూచన ప్రాయంగా నామీద కోపాన్ని ప్రదర్శించాడనుకుంటున్నాను. అంతేకాదు మరో సందేహం కూడా కలుగుతోంది శ్రీనివాసా!

**శ్రీనివాసుడు :** ఏమిటా సందేహం నాన్నగారూ!

**తొండమానుడు** స్వామి భక్తుడెవరైనా అర్ధరాత్రి పూట మట్టిపూలతో పూజిస్తున్నాడేమో!

**శ్రీనివాసుడు :** (ఆలోచిస్తూ) రాత్రులలో పూజ చేసేవాడు భక్తుడవుతాడా! అయితే దొంగయినా కావాలి. లేకపోతే రాక్షసుడైనా కావాలి. రాత్రిళ్ళు స్వామి వారికి విశ్రాంతి సమయమని భక్తులకు తెలియదా! ఒకవేళ రాత్రులలో పూజించే నిశాచరులు ఉన్నారనుకొందాం. బంగారు పూలమీద కానీ, ప్రక్కకు త్రోసికానీ మట్టి పూలను పాదాలముందుంచి పూజించవలసిన అవసరమేమిటి? ఆఁ నాన్నగారూ! దినదినమూ బంగారు పూలు తగ్గుతూ వస్తున్నాయా?

**తొండమానుడు** కుమారా! నీవు ప్రతి దినమూ వెయ్యి బంగారు పూలను తయారు చేయించి పంపుతున్నావు. నేను సహస్రనామార్చన చేస్తూ ఒక్కటొక్కటే స్వామి వారికి అర్పిస్తున్నాను. అవన్నీ నీవు స్వామి పుష్కరిణిలో కదా వేస్తున్నావు?

**శ్రీనివాసుడు :** ఒక్కసారి స్వామి అర్చనకు ఉపయోగించిన పుష్పాలు తిరిగి ఉపయోగించరాదనే నియమం ఉండడంవల్ల బంగారు పుష్పాలను స్వామి పుష్కరిణిలో వేయిస్తున్నాను నాన్నగారూ! అయితే మొన్న పుష్పాల బరువులో తేడా కనబడింది. లెక్కించిచూస్తే వెయ్యి బంగారు పుష్పాలు లేవు. వెంటనే నాకప్పుడు సందేహం కలిగి స్వామి విగ్రహం దాపుల్లో రాత్రులందు రాజభటులను కావలి కాస్తుండుమని నియమించాను.

**తొండమానుడు** వారేం తెలుసుకొన్నారు?

**శ్రీనివాసుడు :** సరిగ్గా అర్ధరాత్రి సమయాన సువాసనలను వెదజల్లే గాలులు వీచాయట. ఆగాలులు వీల్చగానే రాజభటులకు మైకం వచ్చి ఎక్కడున్నవారు అక్కడే పడిపోయారట. తెల్లవారు జాము వరకూ వారికి

మెలకువ రాలేదట. అదీ సరిగ్గా వేంకటేశ్వరస్వామి వారి సుప్రభాత వేళకు మాత్రమే రాజభటులకు మెలకువ వచ్చిందట. రెండుమూడు రాత్రులూ ఇలాగే జరిగిందని వారు చెప్పారు.

తొండమానుడు : ఆశ్చర్యంగా ఉంది శ్రీనివాసా!

శ్రీనివాసుడు : ఈ దినం మీరు అర్చన చేసి వదలిన పూలను లెక్కించమంటారా?

తొండమానుడు : నీయిష్టం కుమారా!

శ్రీనివాసుడు : *(లెక్కించును)* మూడు వందల నలభై ఎనిమిది బంగారు పూలు తక్కువ అయ్యాయి. వాటి స్థానంలో అన్నే మట్టిపూలు చేరాయి నాన్నగారు!

తొండమానుడు : ఆఁ! ఇదెలా సంభవించి ఉంటుంది?

శ్రీనివాసుడు : నాన్నగారూ! నాకు కలిగిన సందేహం తొలగిపోయేటట్లు కనబడుతోంది.

తొండమానుడు : ఎలా కుమారా శ్రీనివాసా!

శ్రీనివాసుడు : ఈ పని చోరనైపుణ్యం గల దొంగకానీ, పాలనా నైపుణ్యం ఉన్న రాజ ద్రోహికానీ చేశాడనిపిస్తోంది. వారెవరో రాజభటులకు కనిపించకుండా వాయురూపంలో నిద్రమత్తు మందును వదలి ఉంటారు. రాజభటులు మత్తులో పడిపోగానే బంగారుదళాలను దొంగిలించి ఉంటారు. మన కెవరికీ అనుమానం రాకూడదని కొన్నింటిని మాత్రమే దొంగిలించి వాటి స్థానంలో మట్టి పూలను పెట్టి ఉంటారు.

తొండమానుడు : ఆ చోరుడు స్వామి వారి భక్తుడై ఉంటాడేమో! స్వకార్యమూ, దైవకార్యమూ ఒకే సారి ఫలించేటందుకు అలాచేస్తూ ఉంటాడేమో! ఎలాచెప్పగలం కుమారా!

శ్రీనివాసుడు : కావచ్చు కాకపోవచ్చు. బంగారు బాతుగుడ్డు కథలో లాగ ఒక్కరోజుతో బంగారుబాతును చంపుకొనే మూర్ఖుడు మాత్రం అయి ఉండడనిపిస్తోంది. ఆ బంగారుపూల దొంగ ప్రతిరోజూ పథకం ప్రకారం కొన్ని కొన్ని బంగారు పూలను మాత్రమే దోచుకుంటూ ఉన్నాడు.

తొండమానుడు : ఇది స్వామి మహిమా కావచ్చు. దొంగతెలివీ అయి ఉండవచ్చు.

**శ్రీనివాసుడు :** నేనా విషయాన్ని పూర్తిగా తెలుసుకొంటాను నాన్నగారూ! మీరు దిగులు పడకుండా మీ పూజా కార్యక్రమాన్ని యధావిధిగా కొనసాగిస్తూ ఉండండి.

**తొండమానుడు :** కుమారా శ్రీనివాసా! నాకంతా అయోమయంగా ఉంది. నీవేం చేస్తావో ఏమో! కానీ నాలో ప్రాణం ఉన్నంతవరకూ వేంకటేశ్వరస్వామిని పూజిస్తూనే ఉంటాను.

**శ్రీనివాసుడు :** అలాగే నాన్నగారూ! నేను నాపరిశోధనను ఇప్పటినుండే ప్రారంభిస్తాను. సెలవిప్పించండి.

**తొండమానుడు :** (తల ఊపును)

(రాకుమారుడు శ్రీనివాసుడు నిష్క్రమించును)

**తొండమానుడు :** త్వాం వదన్తి సురాధ్యక్షం
వేదవేద్యం పురాతనం
మనయో మనుజశ్రేష్ఠాః
తచ్ఛ్రు త్వా హ మిహాగళః

**స్వామిన్ అచ్యుత గోవింద**
**పురాణ పురుషోత్తమః**
**అప్రాకృత శరీరో పి**
**లీలామానుష విగ్రహః**



## 6వ రంగము

*(రహస్యమందిరం. శ్రీనివాస యువరాజు, మంత్రి ఆసీనులై ఉందురు)*

శ్రీనివాస : మహామంత్రీ! నేను చెప్పినట్లు చేశారా! మీ పరిశోధనా ఫలితం ఏమిటో తెలియజేయండి.

మంత్రి : రాకుమారా! స్వర్ణపుష్పాలను దొంగిలించే చోరుడెవరో తెలియరాలేదు కానీ మరోవింత విషయాన్ని వేగులవారు తీసుకు వచ్చారు.

శ్రీనివాస : ఏమిటది?

మంత్రి : మనం కావలిపెట్టిన రాజభటులు మనుపటి ప్రకారం అర్ధరాత్రి అవుతూనే సువాసన వాయువులను పీల్చి నిద్రలో పడిపోతున్నారు. అయితే ఇక్కడికి ఉత్తర దిక్కుగా రెండు మూడు యోజనాల దూరంలో ఒక చిన్న పల్లె ఉంది. దాని పేరు కుర్వపల్లె. అపల్లెలో ఒక కుమ్మరివాడు మట్టితో తులసీ దళాలను పుష్పాలను చాలా నేర్పుతో అందంగా తయారు చేస్తున్నాడట. మన రాజ్యంలో ఎవరూ మట్టితో పూలను తులసి దళాలను చేయరు, చేయలేరుకూడా.

శ్రీనివాస : ఆకుమ్మరికి మట్టిపూలతో పనేమిటి? ఆ పూలు మనం మహారాజు వారి పూజకోసం తయారు చేయించే పూలలాగ ఉన్నాయా?

మంత్రి : ఆవిషయం తెలియాలంటే బంగారు పూలనూ, మట్టి పూలనూ ధగ్గర దగ్గర పెట్టి చూస్తే కానీ నిజమేమిటో గ్రహించలేము. రాకుమారా! (యువరాజు లేచి లోనికి పోయి వచ్చును)

శ్రీనివాస : అమాత్యా! ఇవి మహారాజులవారికి కనిపించిన మట్టిపూలు.

మంత్రి : (వాటిని అందుకొని చూచి) తయారుచేసిన పద్ధతి, ఆకారమూ, వాడిన మన్నూ ఒకటిగానే ఉన్నాయి రాకుమారా! ఆ పూలకూ, వీనికీ ఏమాత్రం తేడా కనబడడంలేదు.

శ్రీనివాస : అయితే అమాత్య వర్యా! ఈ కార్యాన్ని ఆ కుమ్మరి చేశారా? లేక అతని చేత మరెవరైనా ఇలాంటి మట్టిపూలను చేయించి తమ ప్రయోజనాలకోసం ఉపయోగించుకుంటున్నారా? ఆ విషయమై ఏమైనా ఆరా తీశారా?

మంత్రి : రాకుమారా! నేనూ అదేవిధంగా ఆలోచించాను. వెంటనే ఆకుమ్మరివాని మీద నిఘా ఉంచాను కూడా. కానీ అతని వద్దకు కొత్తవాళ్ళెవరూ రావడం లేదు. కానీ ఆ కుమ్మరి వాని వద్ద ఒక పనివాడు ఉన్నాడు. అతడు తనయజమానికి మట్టికుండలూ, బొమ్మలూ మొదలైన వాటిని తయారు చేయడంలో ముఖ్యమైన సహాయకుడిగా ఉన్నాడు.

శ్రీనివాస : అపనివాడు ఆ ఊరివాడేనా? మరెక్కడ నుండయినా వచ్చి అతని వద్ద చేరాడా? అలా చేరి ఉంటే ఎంతకాలంగా కుమ్మరి వద్ద పని చేస్తున్నాడు? ఇలాంటి వివరాలు సేకరించారా?

మంత్రి : తెలుసుకున్నాను రాకుమారా! ఆ వివరాలన్నింటితోపాటు అతని దినచర్య ఏమిటో కూడా మనవాళ్ళు సేకరించారు.

శ్రీనివాస : చెప్పండి అమాత్యా!

మంత్రి : అతడు ఆ ఊరివాడు కాదు. ఎక్కడి నుండి వచ్చాడో ఎవరికీ తెలీదు. అతడీమధ్యనే కుమ్మరివద్ద పనికి కుదిరాడు. కానీ అతడు కుర్వగ్రామానికి వచ్చినప్పటి నుండి ఎక్కడికీ పోలేదు. అంతేకాదు కొత్త వాళ్ళెవరు కూడా అతడిని కలుసుకోవడాన్ని అహర్నిశలూ నిఘావేసిన మన వేగులవారు చూడలేదు.

శ్రీనివాస : (సాలోచనగా) సరే అతని దినచర్య ఏమిటి?

మంత్రి : అతడు కుర్వ పల్లెకు ప్రక్కనే తూర్పు దిక్కున ఉన్న చెరువుకు తెల్లవారు జామునే పోతాడు. స్నానాదికార్యక్రమాదులు ముగించుకొంటాడు. చెరువుకు సమీపంలో ఒకచోట ఉన్న మెత్తటి ఎర్రమట్టిని త్రవ్వి తట్టతో తీసికొని తనయజమాని కుమ్మరి యింటికి వస్తాడు. ఆమట్టిని యింటి ముందు పోస్తాడు. అంతలో కుమ్మరి భార్య అంబలి తెచ్చి అతనికి అందిస్తుంది.

శ్రీనివాస : అప్పుడు కుమ్మరి ఏం చేస్తుంటాడు?

మంత్రి : కుమ్మరీ, అతని సేవకుడూ సరిసమానంగా ఒకరి ప్రక్కన ఒకరు కూర్చొని అంబలి తాగుతారు. తాగడం అయిపోగానే కుమ్మరి భార్య అందించిన కుండలోని నీటిని, యింటిముందున్న మెత్తటి మట్టిలో పోస్తాడు సేవకుడు. తర్వాత మట్టిని మెత్తగా త్రొక్కి ముద్దలు చేసి సారెముందున్న కుమ్మరి వానికి అందిస్తాడు.

శ్రీనివాస : మట్టి ముద్దలతో వారేమేమి చేస్తారు అమాత్యా!

మంత్రి : రాకుమారా! వారిద్దరూ కలిసి మొట్టమొదట మట్టిపూలను చేస్తారు. సారెను సేవకుడు అత్యంత నేర్పుతో మెల్లగా త్రిప్పుతుంటే యజమాని ఒడుపుగా మట్టిముద్దను ఒక చేత్తో కదుపుతూ, మరో చేత్తో ఒక పుల్లను ఇటూఅటూ త్రిప్పుతూ పూలనూ తులసీ దళాలను చేస్తాడు. సేవకుడు వానిని అందుకొని నీడలో ఆరబెడతాడు.

శ్రీనివాస : తర్వాత?

మంత్రి : అవెప్పటికో ఆరిపోతాయి. ఆరిన వాటిని కుమ్మరి భార్య వారిముందు పెడుతుంది. ఆతర్వాత వారిసేవకుడు సేకరించి తెచ్చిన ఏవో ఆకులను నూరి మట్టి మూకుడులో పిండుతుంది. ఆరసాన్ని వారు ముప్పురూ మట్టిపూలకు పూసి తిరిగి ఆరబెడతారు.

శ్రీనివాస : ఆకురసం పూసిన పూలు ఆకుపచ్చరంగులోకి మారుతాయన్న మాట. మరి ఈ పూలు బంగారు వర్ణంలో ఉన్నాయేమిటి?

మంత్రి : పూలు తయారు చేసే పని అయిపోగానే కుమ్మరీ, అతనిభార్యా ఇద్దరూ కలిసి ఇంటి ముందు అరుగుమీద పరచిన ఈతాకుల చాప మీద నీడలో ఆరబెట్టి లోపలికి పోతారు. ఇంతలో సేవకుడు రకరకాల బొమ్మలు చేతులతోనే చేయడం మొదలు పెడతాడు. కాస్సేపటికి కుమ్మరీ, అతని భార్య ఒక చిన్నకుండతో బయటికి వస్తారు. ఆకుండలోని ద్రవాన్ని ఆకుపచ్చగా మారిన మట్టిపూలకు పూయగానే అవి బంగారు రంగులోకి మారుతాయి రాకుమారా!

శ్రీనివాస : సేవకుడు చేసే బొమ్మలు ఎలాంటివో తెలుసుకున్నారా? మహామంత్రీ!

మంత్రి : అతడు చేసే బొమ్మలు అందరు కుమ్మరి వాళ్ళు చేసే బొమ్మల్లా ఉండవు. రాజ్య రక్షణ కోసం రాజులు తమవద్ద ఉంచుకొనే చతుర్విధ బలగాల బొమ్మలు చేస్తాడా సేవకుడు. అంటే రథాలూ, గుఱ్ఱాలు, ఏనుగులు, సైనికులు ఇలాంటి వాటిని మట్టితో చిన్నచిన్నవిగా చేస్తాడు. వానిలో జీవకళ ఉట్టిపడుతూ ఉంటుందట.

శ్రీనివాస : ఆతర్వాత

మంత్రి : భోజనాల వేళకు కుమ్మరి భార్య భర్తతోపాటు సేవకుడిని ఇంటిలోపలికి పిలుస్తుంది. కాళ్ళూ చేతులూ కడుగుకొని లోపలికిపోతారిద్దరూ.

శ్రీనివాస : వారి దినచర్య ఇదేనా? వారిని ఎవరైనా కలుసుకోవడం కానీ, వీరు మరెవరినైనా ఎక్కడైనా కలుసుకోవడం కానీ జరిగిందా?

మంత్రి : మనవేగుల వారు కుర్వ గ్రామవాసుల నందరినీ రహస్యంగా విచారించారు. కుమ్మరి కానీ, సేవకుడుకానీ ఎవరినీ కలవడం వారెప్పుడూ చూడలేదట.

శ్రీనివాస : రాత్రులలో - అందరూ గాఢ నిదురలో ఉన్నప్పుడు వారేం చేసేదీ మనవేగులవారు అరాతీశారా?

మంత్రి : వేగువారే కాదు గ్రామస్థులు కూడా ఎంత నిదురలో ఉన్నా చీమచిటుక్కుమన్నా గ్రహించే స్థితిలో ఉంటారు. అరణ్యాల మధ్య నివసించే పల్లెవాసులకు అలా అప్రమత్తతతో ఉండడం పసివయసునుండే అలవాటవుతుంది. అంతేకాదు యువరాజా! ఊరినిండా ప్రతియింటికీ కుక్కలు ఉంటాయి. ఏప్రాణి అయినా పల్లెలోకి అడుగు పెట్టగానే అవి ఊరుకుంటాయా? భయంకరంగా మొరుగుతూ ఊరంతటినీ ఉలిక్కిపడేటట్టు చేస్తాయి. ఆ సేవకుడు, కుమ్మరి ఇంటిలో చేరి నప్పటినుండి ఒక్కనాడూ రాత్రి వేళల్లో కుక్కలు మొరిగిన దాఖలాలు లేవు. ఇన్ని దినాలుగా వీరిద్దరూ ఎవరినీ కలుసుకోలేదని నిశ్చయంగా తెలిసింది యువరాజా!

శ్రీనివాస : ఇది ఆశ్చర్యకరమైన విషయమే అయినా అందులో ఏదో తిరకాసు ఉన్నట్లు నాకనిపిస్తోంది అమాత్యవర్యా! ఆసేవకుడూ, అతని యజమాని అయిన ఆకుమ్మరీ, అతని భార్యా ముగ్గురూ అంతుపట్టని వారిగా ఉన్నా అత్యంతనైపుణ్యంతో చీమకైనా అంతుచిక్కని రీతిలో వారే బంగారు పూలను దొంగిలిస్తున్నారనే సందేహం వదలడం లేదు నన్ను.

మంత్రి ఎలా నిశ్చయంగా చెప్పగలం వారు చోరులు అని యువరాజా! ఊరకుక్కలను మచ్చిక చేసుకొనో, మత్తుమందు పెట్టో అవి మొరగకుండా చేసి రాత్రులలో ఊరు వదలి ఎక్కడికైనా పోయే అవకాశం కానరావడం లేదు మనవేగుల వారిమాటలను బట్టి చూస్తే యువరాజా!

శ్రీనివాస : పగలు చుట్టూ పరచుకొని ఉన్న అడవిలో ఏ పొదలలోనో తాము చేసిన మట్టి పూలను దాచి వస్తున్నారేమో! ఆ సంకేత స్థలాన్ని ముందే ఎరిగిన చోరుడెవరో వాటిని సంగ్రహించి, ప్రతిఫలమేదైనా వారికి

అందిస్తున్నాడేమో! ఇది పరమానవుడెవరికంట పడకుండా అత్యంత రహస్యంగా జరుగుతోందేమో! ఎలా తెలుసుకోగలం అమాత్యా!

మంత్రి : ఇది తెలుసుకోవలసిన విశేష విషయమే యువరాజా!

శ్రీనివాస : ఎలా.తెలుసుకోవడానికి వీలవుతుందో ఉపాయమేమిటో తెలుపండి అమాత్యవర్యా!

మంత్రి : యువరాజా! ఇక్కడ మన కోశాగార పరిస్థితిని కూడా మనం అవగాహన చేసుకోవలసి ఉంది. మూడు నెలలకు పైగా దినానికి వేయి.బంగారు పుష్పాలను చేయిస్తూ ఉండడం వల్ల మన బొక్కసం ఇంచుమించు ఖాళీ అయిపోయింది. ఇంక కొన్ని రోజులకు మించి బంగారం లభ్యమయ్యే అవకాశం కనబడడం లేదు. ఏమి చేయమంటారు?

శ్రీనివాస : ఆవంగతి ఇంతకు ముందే నాదృష్టిలోకి వచ్చింది అమాత్యా! మేమింతగా ఆరాటపడడానికి మన కోశాగార స్థితి ముఖ్యకారణం. అటు మహారాజుల వారి కోరిక తీరలేదు. ఇటు బొక్కసం వట్టిపోతోంది. మరోప్రక్క పూల రూపంలో ఉన్న బంగారం మాయమై మట్టిపూలు చేరుతున్నాయి. దీనిని పరిహరించాలంటే మనమేదో ఒకటి చేయాలి.

మంత్రి . మీ ఆలోచన ఏమిటో తెలుపండి యువరాజా!

శ్రీనివాస : అమాత్యవర్యా! నేను మారువేషంలో రహస్యంగా సైన్యంతో కుర్వ గ్రామానికి బయలుదేరి పోతాను. గ్రామస్థులెవరికీ తెలియకుండా మనసైనికులు ఆటవికుల వేషాలతో పరిసర అరణ్యాలలో తిరుగుతూ ఉంటారు. వారు అడవిలో దొరికే పుట్ట తేనె, వెదురు బియ్యం, సారపప్పు, శ్యామ ధాన్యం సేకరించే పనులలో ఉంటూ కుర్వపల్లెపై ఒక కన్నువేసి ఉంటారు. వారిని నేను సేనాపతి సహాయంతో పర్యవేక్షిస్తూ ఎప్పటికప్పుడు విశేషాలను సేకరిస్తూ ఆ రహస్యాన్ని ఛేదిస్తాను. ఏమంటారు అమాత్యా!

మంత్రి : మీ ఆలోచన చాలా బాగుంది యువరాజా! నన్నూ మీ వెంట రమ్మంటారా?

శ్రీనివాస : వద్దు అమాత్యవర్యా! మేము లేని సమయంలో ఇక్కడ మీరు నిర్వహించ వలసిన కార్యాలు చాలా ఉన్నాయి. అటు మహారాజుల వారి పూజా కార్యక్రమానికి భంగం కలుగకుండానూ ఇటు పరిపాలనాకుంటు పడకుండానూ యథావిధిగా జరిగిపోవడానికి

మీరిక్కడే ఉండాలి. అంతే కాదు అమాత్యా! నేను సేనాపతీ, సైనికులూ ఎక్కడికి పోయిందీ ఎవరికి తెలియకూడదు. ముఖ్యంగా నేను ఇక్కడ లేనట్లుగా ఎవరూ అనుకోని రీతిలో మెలగేటట్లు మన అంతరంగికులకు మీరు ఆజ్ఞ ఇవ్వాలి.

మంత్రి : అలాగే యువరాజా!

శ్రీనివాస : అమాత్యా! సేనాపతికి ఈ విషయాన్ని వివరించి, సైనికులను సిద్ధం చేయించండి. సైనికులలో కొందరు బోయల రూపాలలో, కొందరు కోయలుగానూ, ఎరుకలుగానూ, యానాదులుగాను వేషాలు వేసుకోవడానికి కావలసిన వస్త్రాదులను సిద్ధంచేయించి సైనికుల కిచ్చి పంపుమని చెప్పండి.

మంత్రి : శేష పర్వతాలు చాలా దట్టంగా పరచుకొని ఉన్నాయి. అక్కడ క్రూరమృగాలు అధికం సైన్యం గుంపులు గుంపులుగా మారువేషాలతో అయినా సరే ఉండాలి. కాబట్టి సైనికులు అధికంగానే ఉండాలికదా యువరాజా!

శ్రీనివాస : నిజమే అమాత్యా! వేయి మంది సైనికులైనా కావాలి. వారిని ఎనిమిది దళాలుగా విభజించి ఎనిమిది దిక్కులకూ పంపాలి. దళాధిపతులు గట్టి వారిని మీరే ఎన్నిక చేసి పంపండి.

మంత్రి : అలాగే యువరాజా! ఇప్పుడే సేనాపతిని పిలిపించి, అన్నీ వివరించి చెప్పి మీరన్న ప్రకారమే సిద్ధం చేయిస్తాను.

శ్రీనివాస : మంచిది అమాత్యవర్యా! మహారాజుల వారిని జాగ్రత్తగా గమనిస్తూ ఉండండి.

మంత్రి : చిత్తం యువరాజా! మీ ప్రయాణం సుఖవంతంగా జరగాలని శ్రీవేంకటేశ్వరస్వామిని వేడుకొంటున్నాను.

*(ఇద్దరూ నిష్క్రమింతురు)*



# తృతీయాంకము

## 7వ రంగము

*(కుర్వగ్రామం వెలుపల చెరువుకు కొంత దూరంలో కుమ్మరి సేవకుడు మట్టి త్రవ్వు చుండును. మారువేషాలతో యువరాజు శ్రీనివాసుడు, సేనాపతి ప్రవేశిస్తారు)*

**సేనాపతి** : అయ్యా ! ఆ కనబడేదేనా కుర్వపల్లె.

**సేవకుడు** : *(చిరునవ్వు నవ్వును కానీ జవాబు మాత్రం చెప్పడు)*

**సేనాపతి** : ఎందుకలా నవ్వుతున్నావు? నేనడిగింది నీకు వినబడలేదా?

**సేవకుడు** : *(సమాధాన మివ్వక నవ్వుతూ తల ఊపును)*

**సేనాపతి** : మూగవానివా నీవు? తల ఊపుతావు కానీ సమాధానమివ్వవేం?

**సేవకుడు** : *(ఈసారి తల అడ్డంగా ఊపును)*

**సేనాపతి** : *(నిగ్రహించుకొంటూ)* ఇంతకూ నీది ఈ పల్లేనా? అదయినా చెప్పు.

**సేవకుడు** : నేను ఎక్కడుంటే అదే నా పల్లె, నా ఊరు.

**సేనాపతి** : అయితే నీ సొంత ఊరు ఇది కాదన్నమాట.

**సేవకుడు** : నేనిప్పుడు ఇక్కడ ఉన్నాను కనుక ఇదే నా సొంత ఊరు.

**సేనాపతి** : సరిగా చెప్పవయ్యా!

**సేవకుడు** : నేను సరిగా సమాధాన మిస్తున్నాను కానీ ఆ విషయం నీకే అర్థం కావడం లేదు.

**సేనాపతి** : *(యువరాజువైపు చూచును)*

**శ్రీనివాస** : చూడూ - మేమడిగిన వాటికి సక్రమంగా సమాధానమిస్తావా లేదా?

**సేవకుడు** : ఇవ్వకపోతే! మీరిప్పుడు నావద్దకు వచ్చారు నా సహాయాన్ని అర్థిస్తున్నారు. మీ అవసరం కనుక అలా చేస్తున్నారు. నేను మీ వద్దకు ఏపని మీదా రాలేదు. నన్నెందుకు దబాయిస్తారు మీరు? మర్యాదగా అడిగితే మర్యాదగానే సమాధానమిస్తాను.

**సేనాపతి** : *(యువరాజును వారిస్తూ)* మీరుండండి. నీవన్నట్టు నీవద్దకే మేము సహాయం కోసం వచ్చాము. అందుకే ఇలా అడుగు తున్నాము. నీవు మరో విధంగా భావించకుండా మేమడిగే వాటికి సమాధానాలిస్తావా?

సేవకుడు : అలా అడిగితే నేను చెప్పనన్నానా? మీ రేమడిగినా సమాధానమిస్తాను. అడగండి.

సేనాపతి : అయితే మొదట నీ పేరు చెప్పాలి.

సేవకుడు : నా పేరు శ్రీపతి.

సేనాపతి : నీవు పని చేసేచోటు.

శ్రీపతి : అదో ఆ కుర్వపల్లెలోనే

సేనాపతి : సొంతంగా పని చేసుకుంటున్నావా? ఎవరి వద్దనైనా పనికి కుదిరావా?

శ్రీపతి : నేను నిజంగా స్వతంత్రుడినే అయినా ప్రస్తుతానికి మాత్రం కుర్వపల్లి నివాసి అయిన భీమన్నవద్ద పనికి కుదిరాను.

సేనాపతి : ఏం పని?

శ్రీపతి : భీమన్న ఒక కులాలుడు ఒక కులాలుని వద్ద ఏ పని చేయడానికి వీలుంటుందో అదే చేస్తున్నాను.

సేనాపతి : కుండలు చేసే పనేనా?

శ్రీపతి : అవును.

సేనాపతి : నీవు చూస్తూఉంటే నాగరికునిలా, గొప్ప వంశంలో పుట్టిన వాడివిలా కనబడుచున్నావు. కుండలు చేసే పనిలో చేరడం నీకు అగౌరవంగానూ, హీనంగానూ అనిపించడం లేదా?

శ్రీపతి : కుండలు చేసే పని అగౌరవమయిందీ, హీనమయిందీనా? కులాలుడే లేకపోతే మనుషుల జీవితాలు ఎలా ఉంటాయి? నీళ్ళు తెచ్చుకోవాలన్నా, వంటలు వండుకోవాలన్నా, యజ్ఞయాగాదులు చేయాలన్నా కుంభం లేనిదే కూడు వస్తుందా? కుంపటి నిలుస్తుందా? వృత్తులు అవసరాన్ని బట్టి ఏర్పడ్డాయి. అంతేకానీ వృత్తులను బట్టి గౌరవా గౌరవాలను నిర్ణయించడం సంకుచిత మనస్తత్వానికి గుర్తు.

శ్రీనివాస : అదికాదు పెద్దలు అలా భావించి నడచుకొంటూ ఉంటారు.

శ్రీపతి : పెద్దలు భావించడం అని చెపుతున్నావే! పెద్దలు అంటే నిజమైన అర్థం ఏమిటో నీకు తెలుసా? పెద్దలు అంటే వేదాలు చదివిన వారు అని అర్థం

కాదా! వేదాలలో వృత్తులను బట్టి హీనమైనదని గానీ అగౌరవమైనదని కానీ ఎక్కడా చెప్పలేదు. నడవడికను బట్టి ఔన్నత్యం నిర్ణయింపబడింది. ఆ ఔన్నత్యాన్నే బ్రాహ్మణత్వం అంటారు.

*"నయోనిర్నాపి సంస్కారో*
*నశ్రుతం నచసంతతిః*
*కారణాని ద్విజత్వస్య*
*వృత్తమేవతు కారణమ్*

అంటే కులము, ఉపనయనాది సంస్కారాలు, వేదాధ్యయనం జాతి ఇవేవీ బ్రాహ్మణత్వానికి కారణాలు కావు. నడవడి మాత్రమే దాని కారణాన్ని నిర్ణయిస్తుంది. భీమన్న వంశానుగతంగా అంటే వృత్తిపరంగా కులాలుడుగా పేర్కొనబడ్డా అతడిలో బ్రాహ్మణత్వం పరిపూర్ణంగా ఉంది.

**శ్రీనివాస** : అంతటి గొప్పవాడా నీవు చెప్పే భీమన్న?

**శ్రీపతి** : ఆ సంగతి మీకు నిదానంగా తెలుస్తుంది.

**సేనాపతి** : అది సరేకానీ నీవు వాస్తవంగా ఎవరవు? ఎక్కడినుండి వచ్చిన వాడవు? ఏమి చదువుకున్నావు? ఇంత తెలిసిన నీవు ఈకుగ్రామంలో ఎండనకా, వాననకా శ్రమిస్తూ, భీమన్నకు ఊడిగం చేయవలసిన అవసరమెందుకు వచ్చింది?

**శ్రీపతి** : నన్నెవరవని అడిగితే ఏమని చెప్పను? నేనంటే నేనే! వెంకటగిరి ప్రాంతాల నుండి వచ్చాను. ఇక నా చదువంటావా? ఉచితానుచితజ్ఞత నెరిగి మెలిగే లోకజ్ఞానం చదువుకున్నాను. ఇక శ్రమ అంటావా? శ్రమ సౌభాగ్యానికి, సౌఖ్యానికి మూలం భీమన్నకు ఊడిగం చేస్తున్నానన్నావే? ఇది ఊడిగం కాదయ్యా! అభిమానం! భీమన్నా, అతని గృహమూ, అతడు తిరుగాడే ఈ ప్రాంతమూ ఎంతో స్వచ్ఛమైనవి, నిష్కల్మషమైనవి. ఇవన్నీ నాకు నచ్చాయి. కాబట్టే ఇక్కడికి వచ్చి ఉంటున్నాను.

**శ్రీనివాస** : అభిమానాలతో కడుపులు నిండుతాయా! భీమన్న నీకేం పెడతాడు? పంచభక్ష్య పరమాన్నాలారగింప జేస్తాడా? పట్టుపరుపుల మీద శయునింప జేస్తాడా? గంజికి గతిలేని భీమన్న నీకసలు గంజయినా కడుపునిండా పోస్తున్నాడా? చూడు శ్రీపతీ! నీకున్న విజ్ఞానానికీ, పాండితా .. నీవే ప్రభువునైనా ఆశ్రయించావంటే అందలాల మీద ఊరేగిస్తారు.

శ్రీపతి : ప్రేమాభిమానాలకు మించిన భోగభాగ్యాలెందుకయ్యా! భోగభాగ్యాలంటూ, సుఖమంటూ వాటి వెంట పరుగులు పెడుతూ పోయినా, లేదా వాటినే అనుభవిస్తూన్నా ఒక నాటికి అవీ ముఖం మొత్తుతాయి. ఇంకా ఏమో కావాలనీ, ఏదో కొదవయినదనిపిస్తుంది. తామను భవిస్తూన్న వాటికంటే సుఖభోగాలింకా అధికంగా ఉన్నయేమోననే ఆశ, వెంపర్లాట మనసులో ఏమూలో తొలుస్తూనే ఉంటుంది. కానీ తృప్తి మాత్రం కలుగదు. అయితే ప్రేమాభిమానాలు అలాంటివి కాదు. అవి తరగనివి. అవి పొందేకొద్దీ ఇవ్వాలని పిస్తాయి. అలా అధికమవుతాయి కూడా.

శ్రీనివాస : నీ మీద అంతటి ప్రేమాభిమానాలు చూపుతాడా ఆ కుమ్మరి భీమన్న!

శ్రీపతి : ప్రేమాభిమానాలకు కొలమానం లేదు. మలయ మారుతాన్నీ సుగంధ పరిమళాన్నీ ఎలా అనుభవిస్తామో ఇవీ అలాంటివే నోరులేని జంతువులు కూడా ప్రేమానురాగాల వాసనను పసిగట్ట గలవు. నోరు కలిగిన వారూ, జ్ఞానాన్నెరిగిన వారూ ఆ విషయాన్ని గ్రహించలేరా!

శ్రీనివాస : అయితే భీమన్న వద్ద నుండి నీవంతటి అభిమానాన్ని పొందు తున్నావన్న మాట. దానిని మాలాంటివారు గ్రహించలేరన్న మాట. తా మునిగింది గంగ, తామెచ్చింది రంభ అంటారే ఇదీ అలాగే ఉంది.

శ్రీపతి : కొంత మందికి కొన్ని సూక్ష్మవిషయాలు బొత్తిగా అర్థం కావు. కనీసం అర్థం చేసుకొనే ప్రయత్నమైనా చేయరువారు. జాగ్రత్తగా మనసం చేసుకో. నేను ముందే ఒక మాట చెప్పాను. ఎవరు నాపట్ల ఆదరాభిమానాలు కనబరుస్తారో వారికి నేను దాసుడిని. ధన కనక బలాదులేవైనా వాటికి లొంగని వాడిని. అయ్యా! నేను భీమన్న దాసుడినే... చాలా సేపయింది. భీమన్న నాకోసం ఎదురు చూస్తుంటాడు. ఈ మట్టిని యింటికి చేర్చి, తిరిగి మరో విడత మట్టికోసం ఇక్కడికి రావాలి.

*(శ్రీపతి వెళ్ళగానే యువరాజు శ్రీనివాస, సేనాపతీ...)*

సేనాపతి : యువరాజా! ఇతని వద్ద నుండి మనం మనకు కావలసిన విషయాన్ని రాబట్టలేమేమోనని నాకనిపిస్తోంది.

శ్రీనివాస : సేనాపతీ! ఔను, నిజమే. దానికి మరో మార్గం... ఔను. ఇప్పుడు మన నిజరూపాలను చూపి, అసలు సంగతి నేరుగా అడిగేద్దాం.

సేనాపతి : మీరు తుండీరమండల యువరాజనీ, నేను సర్వసేనాధిపతినని తెలిసినంత మాత్రాన అతడు నిజం చెపుతాడా? ఇంకా తప్పించుకునే యుక్తులు పన్నుతాడేమో!

శ్రీనివాస : అతనికి మన విషయం చెప్పడంతో ఊరుకోము సేనాపతీ! వారికి అంటే శ్రీపతికీ, భీమన్న కుటుంబానికీ ఒక విషమ పరీక్ష పెడదాం.

సేనాపతి : ఏమిటది యువరాజా!

శ్రీనివాస : ఈ భీమదాసుడు అహంకారంతో విఱ్ఱవీగుతున్నాడు ఆ అహంకారం అణగ దొక్కాలంటే మనమొక పనిని పురమాయించాలి, వారికి... మన సైనికులందరికీ ఒక పూట ఆతిథ్యమిమ్మని వారిని అజ్ఞాపిద్దాం.

సేనాపతి : అందుకు హేతువు ఏమని చెప్పాలి యువరాజా!

శ్రీనివాస : హేతు వక్కర లేదు. వారిని అవహేళన చేయడం, కించపరచడం సవాలు విసరడం, పంతాలు పలకడం లాంటివి చేసి రెచ్చగొడుదాం.

సేనాపతి : వేయి మందికి పైగా ఉండే మన సైనికులకు ఒక నిరుపేద అయిన భీముడు కానీ, అతని సేవకుడు కానీ కావలసిన భోజనాది వసతులు ఎలా సమకూర్చగలరు యువరాజా!

శ్రీనివాస : అదే పరీక్ష సేనాపతీ! ఆ భీమదాసుని అహంకార మేమిటో దీనివల్ల తెలిసి పోతుంది. ఒకవేళ అతడు ఈపని తన వలన కాదని చెప్పాడనుకో అది మరీ మంచిది. అంతటితో అతడు అవహేళనలూ, అవమానాల పాలు కావలసి వస్తుంది. లేదనుకో అతడింత మందికి వసతి ఎలా కల్పిస్తాడో అదీ చూద్దాం. ఏమంటారు సేనాపతీ!

సేనాపతి : చాలా గొప్ప పథకం ఇది రాకుమారా! అదో భీమదాసుడు వస్తున్నాడు.

(శ్రీపతి వచ్చును)

శ్రీపతి : ఇంకా ఇక్కడే ఉన్నారా మీ రిద్దరూ! మార్గం మీకు కానరాలేదా?

సేనాపతి : మా మార్గమేమిటో మాకు స్పష్టంగా తెలిసి వచ్చింది. కానీ మేమెవరమో నీకు తెలుసా!

శ్రీపతి : మీరెవరో ఎందుకోసం వచ్చారో మీనోటితోనే చెప్పండి.

సేనాపతి : వీరు తుండీర మండల మహారాజ్యాధీశులైన తొండమాను చక్రవర్తుల వారి కుమారుడైన శ్రీనివాస యువరాజులవారు. నేను ఆయన సేనాపతిని.

శ్రీపతి : ఓహో! అలాగా! అయితే ఏమిటి?

సేనాపతి : మేము సేనతో ఈ ప్రాంతాలలోనే విడిది చేసి ఉన్నాము. మేము వేయి మందిమి మాత్రమే ఉన్నాము. మా అందరికీ ఒకపూట భోజనవసతి కల్పించే సత్తా నీకుగానీ, నీయజమానికి గానీ ఉందా?

శ్రీపతి : ఇది ఆజ్ఞా! అభ్యర్థనా! ఒకపూట తింటే మరోమారు పస్తులుండ వలసిన స్థితిలో ఉన్న కుమ్మరి భీమన్న వేయిమంది రాజసైనికులకు భోజనాది వసతులు ఏర్పరచగలరని మీరెలా భావిస్తున్నారు?

శ్రీనివాస : ప్రేమాభిమానాలు ఉంటే చాలు ధనకనక వాహనాదులతో పనిలేదని కదా ఇంతకు ముందు నీవన్నది! అదేదో నిరూపించుకోవలసిన పని నీది కాదా! అహంకరించి నీవా మాటలు అంటున్నావని తెలిసే ఇదో శిక్షలాంటి ఆజ్ఞను ఈ రాజ్యపాలకుడిగా మీకు విధిస్తున్నాను.

శ్రీపతి : *(పకపక నవ్వుతూ)* ఓ రాజకుమారా! మహాద్భుతంగా మాట్లాడు చున్నావు. గొప్ప వింత శిక్షే మాకు విధిస్తున్నావు కానీ ఆపని మావల్ల కాదంటే మీరేం చేయగలరు?

శ్రీనివాస : రాజదండన ఎంత కఠినంగా ఉంటుందో ఇన్నిన్ని మాటలు నేర్చిన నీకు తెలీకుండా ఉంటుందనుకోము.

శ్రీపతి : ఏం చేస్తారు? ఉరిశిక్ష వేస్తారా? మరణానికి భయపడే వారమను కుంటున్నారా భీమన్న గానీ, నేనుగానీ.

శ్రీనివాస : *(సేనాపతి వైపు సాలోచనగా చూచును)*

సేనాపతి : ఉరిశిక్ష వల్ల ఒక్కసారిగా ప్రాణం పోతుంది. అలాంటి శిక్ష వేయడం లేదు మీకు. అహంకారులకు అలాంటి తేలిక అయిన శిక్ష విధింపబడుతుంది అని అనుకోకు.

శ్రీపతి : సరేకానీ ఇంకెలాంటి శిక్ష ఉంటుందో త్వరగా చెప్పు.

సేనాపతి : కొరత, కొరత వేయిస్తాము. కొరత అంటే ఏమిటో తెలుసా! తెలిసే ఉంటుందిలే! పొడువాటి బల్లెము భూమిలో పాతిపెట్టి, దానిమీద నేరస్థుణ్ణి నిలువుగా దిగగొడుతారు. అప్పుడా నేరస్థుడి పరిస్థితి ఎలా ఉంటుందో తెలుసా ఇటు ప్రాణంపోక, అటు బ్రతక లేక భూలోక నరకం అనుభవించవలసిందే!

శ్రీనివాస : చూడు శ్రీపతీ! మాండవ్య మహర్షి ఎందుకు కొరత వేయబడ్డాడో నీకు తెలిసే ఉంటుంది. అయినా చెపుతా విను మాండవ్యముని తన

ఆశ్రయంలో దాగికొని ఉన్న దొంగలను గురించి రాజభటులకు మౌనవ్రతంలో ఉండి చెప్పక పోవడంవల్ల అయినా ఆ దేశ రాజుచేత ఒక దొంగల పెద్దగా నిర్ణయింపబడి శిక్షింపబడ్డాడు. అంటే ఆ దేశపు రాజు ఆ మునికి దొంగలతో పాటు కొరత వేయించాడని వినలేదా నీవు!

**సేనాపతి** : దొంగల గురించి రాజభటులకు చెప్పక పోవడం రాజద్రోహం. అలాగే నీవూ నిజం చెప్పకపోతే నీతోపాటూ నీ యజమాని భీమన్నకూ అదే స్థితి ప్రాప్తిస్తుంది.

**శ్రీపతి** : రాజులు తమ మాట చెల్లుబాటుకోసం ఎంతటి క్రూరకార్యానికైనా పూనుకుంటారు. ఎంతటి నీచ కృత్యమైనా చేస్తారు అనే సంగతి మీ మాటల ద్వారా తెలుస్తూనే ఉంది. మీనోటి వెంట వెలువడే ఆ ములుకుల వంటి పలుకులను బట్టే అవగతమయింది. నా వలన నాయజమాని కుమ్మరి భీమన్న భయంకరమైన క్రూరచిత్ర హింసల పాలవడం నేను సహించను. ఓ యువరాజా! మీరు కోరుకున్నట్లే మీ సైనికులు వేయిమందికి భోజన వసతులు ఏర్పాటు చేయిస్తాము.

**సేనాపతి** : ఎక్కడ ఏర్పాటు చేయిస్తావు?

**శ్రీపతి** : కుర్వగ్రామానికి పడమటి దిశలో ఉండే చింతతోపులోనికి అందరూ రండి. ఎప్పుడు వస్తారో చెప్పిపోండి.

**శ్రీనివాస** : రేపటి సాయంత్రానికి వస్తాము. మమ్ము ఇలా పిలిచి అలా పారి పోదామనుకుంటే మాత్రం కుదరదు. కుర్వగ్రామం చుట్టు పక్కలంతా మా సైనికులు ఉన్నారు.

**శ్రీపతి** : నేల చూపులు చూచుకోకు రాకుమారా! ప్రాణాలు నిలువుగా పోయినా మాట తప్పని వారము మేము.

**సేనాపతి** : సరే రేపు అపరాహ్నానికి మేము చింతతోపులోకి వస్తాము. అందరికీ భోజనాలు ఎలా ఏర్పాటు చేస్తావో చూస్తాం. ఇక వస్తాం.

*(నిష్క్రమింతురు .శ్రీపతి బిగ్గరగా నవ్వు చుండును)*



## 8వ రంగము

పాత్రలు : శ్రీనివాస యువరాజు, సేనాపతి, శ్రీపతి

స్థలం : చింతతోపు, గ్రామ వాతావరణం, ఉచిత ఆసనాలపై యువరాజు, కొంత దూరంలో సేనాపతి కూచొని శ్రీపతి నిలుచొని ఉండును.

**సేనాపతి** : శ్రీపతీ! మాకూ, మా సైనికులకూ మృష్టాన్న భోజనాలు పెట్టించారు. తుండీర మండల రాకుమారులు వేయిమందికి భోజన వసతులను ఏర్పరచుమని మీకదో శిక్షగా విధించినా మీరు మాత్రం ఏదో పెట్టి భోజనం అయిపోయిందని అనిపించకుండా అందరికీ చాలా సంతృప్తికరంగా వడ్డన చేశారు. అందుకు నీకూ, నీ యజమాని అయిన భీమన్నకూ యువరాజుల వారు అభినందనలు తెలుపుతున్నారు.

**శ్రీపతి** : సేనాపతీ! మీరందరూ సంతృప్తి చెందడం మాకూ ఆనందకరమే.

**సేనాపతి** : ఒక్కరోజులో ఇంతమందికి, ఇన్ని రకాల వంటకాలను శుచిగా రుచిగా తయారు చేయడానికి పాచకులూ, పరివారమూ మీకెక్కడ నుండి లభించారు?

**శ్రీపతి** : *(నవ్వుతూ)* "మనసుంటే మార్గముండదా" అన్నట్టు ఈ కార్యానికి ఎందరో మహానుభావులు తిరుమల యాత్రికులు తమ సహాయ సహకారాలను అందించారు. పరిసర జానపదులు సంతోషంగా ధాన్యాన్ని అందజేస్తే, వర్తకులు పాత్రలనూ, సంభారాలను అడుగక ముందే తెచ్చియిచ్చారు. ఇక పాచకు లెవరంటే అరవదేశం నుండి తిరుమల యాత్ర చేసే వారే.

**శ్రీనివాస** : వేయిమందికి కావలసిన సంబారాలను, అందుకు అవసరమయ్యే సామగ్రినీ ఒక్కరోజులో వారంతా ఎలా ఇవ్వగలిగారో నాకు అర్థం కావడం లేదు.

**శ్రీపతి** : ఇదంతా కుమ్మరి భీమన్న మీద వారికుండే అభిమానం వల్ల జరిగింది రాకుమారా!

**శ్రీనివాస** : పలుదేశాల నుండి తిరుమల యాత్రచేసే వారందరి అభిమానాన్ని చూరగొనే టంతటి వాడా కుమ్మరి భీమన్న?

శ్రీపతి : విడవకుండా ప్రతీ సంవత్సరం తిరుమల యాత్రచేసే భక్తులు ఎందరో ఉన్నారన్న సంగతి అందరికీ తెలిసిందే. వస్తూ వస్తూ వారు తిరుమల సమీపంలో నివసిస్తూ ఉన్న కుమ్మరి భీమన్నను గురించి తెలుసుకున్నారు. కుమ్మరి భీమన్న తిరుమల వాసుని అహరహమూ మనసావాచా అనమానమైన భక్తి తత్పరతతో కొలుస్తూ ఉండడం చూచారు. అప్పటి నుండి కుర్వగ్రామాన్ని ఒక మజిలీగా చేసుకున్నారు. కుమ్మరి భీమన్న నిష్ఠాగరిష్ఠతను గ్రహించి ఆతిథ్యం తీసుకోసాగారు. అతను పాడే పాటలు విన్నారు. వానిని నేర్చుకున్నారు కూడా. అతనిని గురించి తాము పోయిన చోటల్లా ప్రచారం చేశారు. అలా కుమ్మరి భీమన్న భక్తి గురించీ, పేరు గురించి దేశ దేశాలలో వ్యాపించింది రాకుమారా! అంతేకాదు అరవ భక్తులు అతనిని "కురువరతి నంబి" అని పిలుస్తారు.

శ్రీనివాస : తిరుమల యాత్రికులకు ఆతిథ్యమిచ్చేటంత జరుగుబాటు కలవాడా నిరుపేద అయిన కుమ్మరి భీమన్న?

శ్రీపతి : తిరుమల యాత్రికుల గురించి నీకు సరైన సమాచారం అందినట్టు లేదు. వారు యాత్రకు బయలు దేరేముందు వడ్డికాసుల వానికి చెల్లించు కోవడానికి తెచ్చుకునే ముడుపులే కాకుండా దారిబత్తెం కోసం దానధర్మాల కోసం కూడా కొంత ధనమూ, ధాన్యమూ కూడా తమవెంట తీసుకొని వస్తారు. యాత్రికులైనవారు దానంచేయడం ఒక పవిత్ర కార్యంగా భావిస్తారు. ఇక వసతి కల్పించి, ఆతిథ్యమిచ్చే వారిని తృప్తిపరచడం తమ ధర్మంగా భావిస్తారు.

శ్రీనివాస : కుమ్మరి భీమన్న భక్తీ, ఆదరణా అంత గొప్పవా? అది నిజమైన భక్తేనా? వ్యాపారమా! నీలాంటివారు అతణ్ణే గొప్ప భక్తుడుగా చిత్రించి ప్రచారం చేశారేమో!

శ్రీపతి : రాకుమారా! నీవొక విషయం గ్రహించవలసి ఉంది. భీమన్న తన పనేమో, తనదైవ పూజయేమో తప్ప మరే విషయాన్ని అంతగా పట్టించుకోడు. తిరుమల యాత్రికులకు వసతీ ఆతిథ్యాలను భీమన్న భార్య తమాలిని చూచుకుంటుంది. భీమన్న తన స్వస్థలాన్ని వదలి ఎక్కడికీ పోడు. అతనికంతగా బంధువర్గమూ లేదు. కాని భీమన్న భార్య నేర్పరి అయిన మహాఇల్లాలు కాబట్టి ఒంటిచేతి మీదగా సర్వం చక్కబెడుతూ ఉంటుంది.

శ్రీనివాస : అయితే నీవెందుకు వారింటిలో సేవకుడిలాపడి ఉన్నావు?

శ్రీపతి : నేను ముందే చెప్పానుకదా రాకుమారా! భీమన్న భక్తికీ నీతీ నిజాయితీలకూ, భీమన్న భార్య తమాలిని ధర్మతత్పరతకూ లొంగిపోయి ఆయింటిలో చేరాను.

సేనాపతి : శ్రీపతీ! నీమాటలో ఏదో తిరకాసు ఉంది. కుమ్మరి భీమన్న తిరుమల దేవుని పరమ భక్తుడనీ, అతని భార్య మహా ఇల్లాలు అనీ గొప్పగా చెపుతున్నావు. నీవు ఒకే ఒక్క రోజులో అప్పటి కప్పుడే భోజనాది వసతులు ఏర్పరచడానికి తగినంత పరివారమూ, పాచకులూ, సామాగ్రి తిరుమల యాత్రికుల రూపంలో ప్రత్యక్షమై సర్వం సిద్ధం చేయడం సాధ్యమా?

శ్రీనివాస : వేయిమందికి పంచభక్ష్య భోజనాలను యాత్రికులు ఏర్పాటు చేశారంటావు? ఇది చిత్రాతి చిత్రంగా ఉంది. ఇటువంటి పని ఇంత తక్కువ సమయంలో మానవమాత్రు లెవరైనా చేయగలిగిందేనా?

శ్రీపతి : (నవ్వును కానీ సమాధానమివ్వడు)

శ్రీనివాస : లేదు లేదు. రాజ పరివారానికి ఏ మాత్రం ఎరుక కాకుండా పరమ రహస్యంగా ఏదో భయంకరమైన కుట్ర ఇక్కడ జరుగుతున్నట్లు నాకనిపిస్తోంది.

శ్రీపతి : (నవ్వుతూ) ఏమిటో ఆ కుట్ర? వివరించి చెప్పండి.

శ్రీనివాస : శ్రీపతీ! ఇప్పుడు నీకో విషయం తెలియజెప్పాలను కొంటున్నాను. నా తండ్రి తుండీర రాజ్య అధినేత అయిన శ్రీమాన్ తొండమాన్ చక్రవర్తి. ఆయన ఎప్పుడో శ్రీవేంకటేశ్వరునికి ఆవాస ప్రాకారాదులు నిర్మించి ఇచ్చాడు. అది కూడా వేంకటేశ్వరుడు మా తండ్రిగారిని కోరుకోవడం వల్ల జరిగింది. ఆ వేంకటేశుడు మా పెదనాన్న కూతురు పద్మావతి దేవిని వివాహం చేసుకొన్నాడు కనుక మాకు ఆ వేంకటేశ్వరునికీ అలా దగ్గరి బంధుత్వమూ ఉంది. నా తండ్రిగారు పిలిచినంతనే పలికేవాడు వేంకటేశ్వరుడు.

శ్రీపతి : పలికేవాడు వేంకటేశ్వరుడు అంటున్నావు రాకుమారా! ఇప్పుడు పలకడం లేదా?

శ్రీనివాస : ఏదో ఒక చిన్న పొరపాటు జరిగిపోవడం వల్ల వేంకటేశ్వరుడు మా తండ్రిగారు పిలిచినా పలకడం లేదంతే.

శ్రీపతి : అదేనా కారణం? మరేదీ గ్రహించలేక పోయారా మీరందరూ?

శ్రీనివాస : ఆ శ్రీనివాసుని మీద అపారమైన భక్తితో నా తండ్రిగారు తొండమాను చక్రవర్తి తన కొడుకు అయిననాకు శ్రీనివాసుడు అని పేరు పెట్టుకొన్నాడు. ఇంతటి సంబంధ బాంధవ్యాలున్న మామీద దోషాలేమున్నాయి శ్రీపతీ!

శ్రీపతి : రాకుమారా! అసలు దోషాలేమిటో మీరింకా గ్రహించినట్లు లేదు.

శ్రీనివాస : ఏమిటది?

శ్రీపతి : ఒకటి మానసికమైనది. మరొకటి భౌతికమైనది.

శ్రీనివాస : వివరంగా చెప్పు శ్రీపతీ! భౌతికమైన నేరం మాకు తెలుసు.

శ్రీపతి : నీ నిర్లక్ష్యం, నీ తండ్రి అలసత్వం వల్లనే కదా కూర్మాచార్యులనే దక్షిణాది బ్రాహ్మణుని భార్యాపిల్లలు అకాల మరణం పాలయ్యారు. అది మీరిద్దరూ చేసిన భౌతిక పరమైన నేరం కాదా?

శ్రీనివాస : ఇదంతా నీకెలా తెలుసు శ్రీపతీ!

శ్రీపతి : రాకుమారా! నాకన్నీ తెలుస్తూంటాయని నీకు ముందే చెప్పాను.

శ్రీనివాస : సరే. కానీ శ్రీపతీ! బ్రహ్మహత్యా పాపాన్ని ఆ వేంకటేశ్వరుడే పరిహరించాడు కదా. అయితే ప్రత్యక్ష దర్శనం మాత్రం మా తండ్రిగారికి ఇవ్వనన్నాడు. అందుకు చింతించిన నా తండ్రి అంగిరస మహర్షి ఆశ్రమానికి పోయాడు. వేంకటేశ్వరుని మెప్పించడానికి మార్గాన్ని తెలుసుకొన్నాడు.

శ్రీపతి : ఏం తెలుసుకొని, ఏం చేస్తున్నారు? (వ్యంగ్యంగా)

శ్రీనివాస : అంగిరసముని చెప్పినట్లుగా స్వర్ణపుష్పాలతో శ్రీవేంకటేశ్వర సహస్రనామార్చన చేస్తున్నాడు. మూడు నెలలుగా చేస్తున్నా, మా కోశాగారం వట్టిపోతున్నా ఆయన మాత్రం నాతండ్రిగారికి దర్శనం ఇవ్వడం లేదు.

శ్రీపతి : అదీ ఎందుకో తెలుసుకొన్నారా రాకుమారా?

శ్రీనివాస : నా తండ్రి సహస్రనామార్చన కుపయోగించే స్వర్ణపుష్పాలను ఎవరో ప్రతి దినమూ దొంగలిస్తూ, వాటి స్థానంలో మట్టిపూలను పెట్టి నాతండ్రి పూజకు భంగం కలిగిస్తున్నారు. ఇలా పూజకు భంగం కలుగుతూ ఉండడం వల్లనే వేంకటేశ్వరుడు నాతండ్రి గారికి దర్శన మివ్వడం లేదని నేననుకుంటున్నాను శ్రీపతీ!

శ్రీపతి : ఇది వాస్తవమేనని అనుకుంటున్నావా రాకుమారా?

సేనాపతి : స్వర్ణపుష్పాల దొంగలను పట్టుకోవాలని రాజభటులను కావలిపెడితే, వారిపై మత్తుమందు చల్లి మరీ నేర్పుగా దొంగలిస్తున్నారెవరో శ్రీపతీ!

శ్రీపతి : అది దొంగలు చేసేపని కాదేమో! ఇదంతా దైవసంకల్పం వల్ల జరుగుతూ ఉందేమో!

శ్రీనివాస : శ్రీపతీ! దీనిని ప్రజలంతా దైవసంకల్పంగా భావించాలని కడునేర్పుతో రోజుకు కొన్ని కొన్ని బంగారు పూలను దొంగిలించి, అదే రంగులో ఉన్న మట్టి పూలను వాటి స్థానంలో పెడుతున్నారు. ఈ సంగతి తెలిసిన ప్రజలు ఏమనుకుంటారు?

సేనాపతి : దేవుడు అలా చేస్తూ పరీక్షిస్తున్నాడు అని ప్రజలు అనుకోవాలని అతి తెలివితో ఎవరో దొంగలు ఇలా చేస్తున్నట్లు అనిపించడం లేదా?

శ్రీపతి : ఇది నిజమే నంటారా రాకుమారా?

సేనాపతి : శ్రీపతీ! నేను సమాధానం చెపుతాను. అది చెప్పేముందు మునుపు జరిగిన ఒక సంఘటనను గురించి నీకు తెలియవలసి ఉంది.

శ్రీపతి : (నవ్వుతూ) ఏమిటో నాకు తెలియవలసింది?

సేనాపతి : అది తొండమాను రాజపుత్రులు శ్రీనివాస యువరాజుల వారి శక్తి యుక్తులకు సంబంధించి నట్టిది. చోళరాజ్యాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలిస్తుండిన ఆకాశరాజు పద్మావతీ శ్రీనివాసుల వివాహ అనంతరం మరణించాడు. ఆకాశరాజు కుమారుడు వసుదాసు చిన్నవాడు. ఆకాశరాజు తమ్ముడు తొండమాన్ రాజు వసురాజు తన తండ్రి వారసునిగా తానే

చోళరాజ్యానికి రాజునన్నాడు. తొండమాను రాజు తాను పెద్దవాడిని కదా తనకే రాజ్యార్హత ఉంది అన్నాడు. కడకు వీరిద్దరూ యుద్ధం చేసి తేల్చుకోవాలను కున్నారు. బలాలను కూర్చు కొన్నారు. ఆ తర్వాత శ్రీనివాసుని సహాయాన్ని ఇద్దరూ కోరారు. ఆ సమయాన నూతన దంపతులు ఆరు నెలల లోపల కొండను ఎక్కకూడదనే నియమం ఉండడంతో, ఆ మధ్య కాలంలో పద్మావతి శ్రీనివాసులు అగస్త్య మహర్షి ఆశ్రమంలో ఉన్నారు.

శ్రీపతి : తొండవాడలోని అగస్త్య మహర్షి ఆశ్రమంలో నన్నమాట.

సేనాపతి : ఔను శ్రీనివాసుడు తన బావమరిది వసుదాసు పక్షం వహించి తన చక్రశంఖములను చిన్నమామగారయిన తొండమాన్ చక్రవర్తి కిచ్చాడు. ఆ తర్వాత తండ్రీ కొడుకుల నడుమ సమరం అనివార్యమయింది. దొమ్మీ ముమ్మరమైనపుడు యువరాజుకు తొండమాన్ చక్రవర్తి, వేంకటేశ్వరుడు తనకిచ్చిన శంఖచక్రాలను ఇచ్చి యుద్ధరంగానికి పంపాడు. ఆ యుద్ధంలో రాకుమారుడు శ్రీనివాస యువరాజు చేతనున్న చక్రాన్ని వేంకటేశ్వరునిపైకి విసిరాడు. దాని దెబ్బకు వేంకటేశ్వరుడు తెలివితప్పి పడిపోయాడు.

శ్రీపతి : ఇదంతా నీవెందుకు చెపుతున్నావు సేనాపతీ!

సేనాపతి : వేంకటేశ్వరునే ఎదిరించి నిలచిన శౌర్యం కలవాడు మారాకుమారుడు అని నీకు తెలియజేయడానికే చెపుతున్నాను శ్రీపతీ!

శ్రీపతి : అయితే తుదకు నీవు చెప్పదలచుకున్న దేమిటో స్పష్టంగా తెలియజేయ్ సేనాపతీ!

సేనాపతి : స్వర్ణ పుష్పాల స్థానంలో మట్టిపూలు ప్రత్యక్షమవడానికి కారణం అందరూ అనుకున్నట్లు దైవ సంకల్పం కాదు అని స్పష్టపరుస్తున్నాను శ్రీపతీ! ఎవడో తెలివిగల దొంగ ఒక పథకం ప్రకారం నేర్పుగా స్వర్ణపుష్పాలు అపహరిస్తున్నాడని మాకు బాగా తెలుస్తోంది.

శ్రీపతి : (నవ్వుతూ) ఇదేదో పథకం అని ఏ కారణాలను బట్టి భావిస్తున్నారు?

సేనాపతి : ఈరోజు వేయిమందికి విందు భోజనాలు ఏర్పరచి అందరినీ తృప్తి పరచారే మీరు ఇదంతా తిరుమల యాత్రికుల దానధర్మాల వల్ల మాత్రమే జరిగిందంటున్నారు ఇది అసంభవం. మీవద్ద ఎంతో బంగారం ఉండి ఉంటుంది. దానివల్లనే మీరు ఇంత గొప్ప విందును ఏర్పాటు చేయగలిగారు.

శ్రీనివాస : సందేహ మెందుకూ? ఆ విషయం ప్రత్యక్షంగా, స్పష్టంగా ఋజువవుతూ ఉంది గదా!

శ్రీపతి : ఓహో! మమ్మల్ని మీరు దొంగలుగా భావిస్తున్నారన్నమాట.

సేనాపతి : నిజంగా మీరు దొంగలే శ్రీపతీ! పైకి భక్తులుగా, సాధువులుగా నటిస్తూ నేర్పుగా దొంగతనాలు చేస్తూ, అదంతా 'దైవసంకల్పం' అని ప్రజలను మభ్యపెడుతున్నారు. అమాయకులైన ప్రజలు గుడ్డిగా మీ మాటలు నమ్ముతున్నారు. వాస్తవమేమిటో గ్రహించలేక పోతున్నారు. కాబట్టి మీ ఆటలు ఇన్నాళ్ళుగా సాగుతున్నాయి.

శ్రీనివాస : మేము "వేయిమందికి విందు భోజనాల ఏర్పాటు" అనే శిక్షను మీ మీద వేయడానికి కారణం ఏమనుకున్నావు? నిజానిజాలను తెలుసుకోవడానికే. నిజం బయటపడింది స్వర్ణపుష్పాలను ఎక్కడ దాచారో మర్యాదగా చెప్పు శ్రీపతీ!

శ్రీపతి : స్వర్ణపుష్పాల స్థానంలో మట్టిపూలను పెట్టినవాడు తెలివి కలవాడు, అవునో కాదో కానీ ఇప్పుడు మాత్రం మీ తెలివి తెల్లవారినట్లే ఉంది. మేము స్వర్ణపుష్పాలను దొంగలించడమేమిటి? మీరు మామీద నేరం ఆరోపించడం ఏమిటి?

శ్రీనివాస : ఇది ఒక దొంగతనం మాత్రమే అనుకోవడానికి వీలుకలగడం లేదు శ్రీపతీ! మీరేదో పెద్ద కుట్రనే మనసులో పెట్టుకొని ఒక వినూత్న పథకాన్ని రచించి ఇలా చేస్తున్నారు. దేవుని పేరు చెప్పి దేశద్రోహం చేస్తున్నారు మీరు!

శ్రీపతి : రాకుమారా! పిచ్చి పిచ్చిగా ఆరోపణలు చేయకుండా భక్తి మహిమను గురించి ఆలోచించు.

శ్రీనివాస : మావి పిచ్చి పిచ్చి ఆలోచనలా? భక్తి, దైవమహిమ అంటూ మీరు మాదేశ ప్రజలను ఆకర్షించి, మభ్యపెట్టి మాకు వ్యతిరేకంగా విప్లవాన్ని

తీసుకొని వచ్చేటటువంటి రాజద్రోహం చేస్తున్నారు.

సేనాపతి : కుమ్మరి భీమన్న పరమ భక్తుడని ప్రచారం చేయించి, వేంకటేశ్వరస్వామి కృపాకటాక్షాలు అతని మీద మాత్రమే ప్రసరిస్తున్నాయని, తొండమాను చక్రవర్తి ఎంత బంగారం వెచ్చింది నిరంతరంగా పూజలు చేసినా ఫలించడం లేదని ప్రజలకు చాటి చెప్పడానికే మీరు సువర్ణ పుష్పాలను అతినేర్పుగా దొంగిలిస్తున్నారు.

శ్రీనివాస : ఒకే దెబ్బకు రెండు పక్షులు అన్నట్లు రాజుపై దుష్ప్రచారం చేయడమేకాక, బంగారాన్ని సేకరించి దానితో విప్లవ సైనికులకు శిక్షణ ఇస్తున్నారు.

సేనాపతి : ఆ విప్లవ సైనికులే ఇంతవరకూ మాకు వసతులు ఏర్పరచిన మీ పరివారం.

శ్రీపతి : (నవ్వుతూనే) సేనాపతీ! నీ పరిశోధన అద్భుతం! నీ తెలివి అమోఘం! రాకుమారా! నీ ఆలోచన బహుదొడ్డది నీ వివేకం అపారం!

శ్రీనివాస : శ్రీపతీ! శ్రుతిమించి మాటాడుతున్నావు. నేను చెప్పినట్లు మీరు చేయగలిగి నప్పుడు మాత్రమే మీఇద్దరికీ శిక్ష తప్పుతుంది. ఎవడి తెలివి ఏపాటిదో ఋజువవుతుంది.

శ్రీపతి : (నవ్వుతూనే) అదేమిటో చెప్పు రాకుమారా! అదీ వింటాను.

శ్రీనివాస : కుమ్మరి భీమన్న ఇకనుండి వేంకటేశ్వరుడిని పూజించరాదు. తన వృత్తి ధర్మాన్ని దాటరాదు. ఇక నుండి నీవు అతని వద్ద పని చేయరాదు.

శ్రీపతి : ఇంకెక్కడ చేయాలి?

శ్రీనివాస : నీ బ్రతుకు తెరువుకు మార్గం మేము చూపిస్తాం. నీకు మా కొలువులో ఏదైనా ఉద్యోగం ఏర్పాటు చేస్తాం.

శ్రీపతి : ఇది మీరు విధించే శిక్ష అన్నమాట.

శ్రీనివాస : ఇది శిక్ష అని అయినా అనుకో ఆజ్ఞ అని అయినా అనుకో. ఇది తుండీర మండల రాజకుమారుడు శ్రీనివాస యువరాజు చెపుతున్నమాట.

శ్రీపతి : రాకుమారా! ప్రీతిలేకుండా పెట్టిన తిండి పిండాకూడుతో సమానం అనే మాటను నీవు వినలేదా?

సేనాపతి : అయ్! రాకుమారుల మాటనే ధిక్కరిస్తున్నావా?

**శ్రీపతి** నేనే కాదు నా యజమాని భీమన్న కూడా మీ ఆజ్ఞనూ, శిక్షనూ గడ్డి పోచకంటే తేలిగ్గా, హీనంగా పరిగణిస్తాము.

*(శ్రీనివాస, సేనాపతి దిగ్గున ఆసనాల మీద నుండి లేస్తారు)*

**సేనాపతి** ఇదుగో! కాచుకో శ్రీపతీ! నీకు కాలం మూడింది కాబట్టే ఇలా మా ఆజ్ఞలను ధిక్కరిస్తున్నావు. ఎవరక్కడ? (రాజభటులు వస్తారు) వెంటనే పదిమంది భటులు పోయి ఆ కుమ్మరి భీమన్ననూ, అతడి భార్యను పట్టి బంధించి తీసుకురాండి. మీలో ఇద్దరు వచ్చి ఈ కుమ్మరి భీమన్న సేవకుణ్ణి బంధించి తీసుకురండి.

*(అంటూ ముందుకు అడుగులు వేయును)*

**శ్రీపతి** : ఆగండి! అందరూ ఆగండి! ఒక్కడుగు ముందుకు వేశారంటే అడుగంటి పోతారు. (భటులు నిలుచుండిపోతారు. శ్రీపతి అక్కడికి దగ్గరగా ఉన్న మట్టి బలగాలను తదేకంగా చూస్తాడు. ఆ మట్టి బలగాలు వాస్తవ సైనికబలగాలుగా రూపొందుతాయి అవి రాకుమారుడినీ, సేనాపతినీ రాజ సైనికులందరినీ చుట్టుముట్టి నిర్వీర్యులను చేస్తాయి.)

**శ్రీనివాస** : చూడు శ్రీపతీ! ఇది రాజద్రోహం! క్షమించరాని నేరం. రాజకుమారుణ్ణే బంధించావంటే దాని ఫలితం ఎలా ఉంటుందో గ్రహించడం లేదు నీవు.

**శ్రీపతి** : రాకుమారా! ఫలితాలను గురించి బెదిరిస్తున్నావా! వాస్తవా లేమిటో సహనంతో, శాంతితో పరిశీలన చేసినప్పుడే ద్యోతకమవుతాయి. ఇప్పటికీ మించిపోయింది లేదు. భీమన్న సాధుత్వమే ప్రస్తుతం నిన్ను క్షమించి వదలి పెడుతోంది. స్వగృహానికి చేరి, నీ తండ్రి తొండమానునికీ విషయమంతా తెలియజేయండి మీ రందరూ కలసి వాస్తవాలనూ, దైవబలాన్ని గురించి తీరికగా ఆలోచించుకోండి.

*(శ్రీపతి మెల్లగా నిష్క్రమించును. రాకుమారునితో పాటు సైన్యమంతా తలలు వంచుకొని రాజనగరు వైపు మరలుదురు)*



## 9వ రంగము

*(తొండమాన్ చక్రవర్తి, యువరాజు శ్రీనివాసుడు, సేనాపతి విచారగ్రస్థులై ఉంటారు)*

**తొండమానుడు:** నాయనా శ్రీనివాసా! నా పూజకు స్వర్ణపుష్పాలను పంపడానికి ఆలస్యం జరుగుతోందెందుకు?

**శ్రీనివాస :** నాన్నగారూ! మూడు నెలలు పైబడి దినానికి వేయి బంగారు పుష్పాలు తయారు చేయించడంలో మన బొక్కసంలోని బంగారమంతా తరిగిపోయింది. ఇతర ప్రాంతాల నుండి కూడా బంగారం తెప్పించాము. అదీ అయిపోయింది. నారాయణపురం నుండి కూడా సోదరుడు వసుదాసు నా అభ్యర్థనను మన్నించి సాధ్యమైనంత బంగారాన్ని పంపాడు. అది కూడా అయిపోయింది.

**తొండమానుడు:** దక్షిణ దేశం నుండీ, రేనాటి సీమ నుండీ కావలసిన బంగారాన్ని తెప్పించకూడదూ!

**శ్రీనివాస :** మన దగ్గరున్న ధనమంతా అయిపోయిన వెంటనే బొక్కసంలోని రత్న మాణిక్యాది నవరత్నాలను మీరు చెప్పిన దేశాలల్లో విక్రయించి, బంగారాన్ని తెప్పించడం కూడా జరిగిపోయింది.

**తొండమానుడు:** మన పాళెగార్లకు వర్తమానం పంపితే...

**శ్రీనివాస :** పంపాము నాన్నగారూ! వారికీ వర్తమానం పంపాము. వారి శక్తి మేరకు, వీలయినంత వరకూ ఈ విషయమై సహాయ సహకారాలందజేశారు. దేవుని కార్యమనగానే ప్రతివారూ తమకు తోచినంత ధనాన్ని సమర్పించుకున్నారు. పాళెగార్లేకాదు. బేహారులూ, సాతవాహలూ, పసుపు లేటివారూ, పెరికవాండ్లూ ఒకరేమిటి సమస్తకులాల వాండ్లూ శ్రీవేంకటేశ్వర సహస్ర నామస్వర్ణ పుష్పార్చన తమదేశ చక్రవర్తులు చేయిస్తున్నారనగానే తమ వద్ద ఉన్న రొక్కం కూడా సమర్పించుకున్నారు.

**తొండమానుడు:** *(బాధతో)* అయితే ఇక స్వామివారి సహస్ర నామార్చన, అర్ధాంతరంగా ఆగిపోవలసిందేనా?

**శ్రీనివాసుడు :** అర్ధాంతరంగా నిలిచి పోకుండా ఉండడానికి బంగారాన్ని ఎలా సేకరించాలో నాకేమీ తోచడం లేదు, నాన్నగారూ! మరో మార్గమేదైనా

మీ మనసులో ఉంటే తెలియ జేయండి. మీరు చెప్పినట్లు చేయడానికి దేశప్రజలందరూ మనస్ఫూర్తిగా సిద్ధపడి ఉన్నారు.

తొండమానుడు: నాకేమి తోచకున్నది శ్రీనివాసా! ఆ ఏడుకొండలవాడు మనలను ఈవిధంగా కూడా ఏడిపిస్తూ పరీక్షలు పెడుతున్నాడా! ఏమిటో అర్థం కావడం లేదు ఏమనుకున్నా ఆ స్వామికి మనమీద దయ తప్పింది.

సేనాపతి : (చిన్నగా) యువరాజా! మొన్న జరిగిన సంఘటన అదే కుమ్మరి భీమన్న సేవకుడు శ్రీపతి గురించి మహారాజులుంగారికి తెలుప వచ్చునా?

తొండమానుడు: ఏమిటి సేనాపతి! యువరాజుతో మెల్లగా చెపుతున్నావు?... సేనాపతి స్వర్ణ సేకరణ కోసం ఏదైనా మార్గం సూచిస్తున్నాడా శ్రీనివాసా!

శ్రీనివాసా సేనాపతీ! మొన్న జరిగిన సంఘటనకూ, స్వర్ణ సేకరణకూ సంబంధమేదైనా ఉందా? నీ ఉద్దేశమేమిటో వివరించండి.

సేనాపతి కుమ్మరి భీమన్న సేవకుడు శ్రీపతి ఒక్కదినం వ్యవధిలో వేయి మందికి భోజనాది వసతులు కల్పించాడు కదా! అతని వద్ద అమితంగా ధన ముంటుందనే నాసందేహం ఇంకా నివృత్తికాలేదు యువరాజా!

తొండమానుడు: ఏమిటి మొన్న జరిగిన సంఘటన? కుమ్మరి భీమన్న అంటున్నారేమిటి?

సేనాపతి : మహారాజా! ఇంతకు మునుపు మీరు మాకో విచిత్ర విషయం తెలిపారు. స్వర్ణపుష్పార్చనలో మట్టిపూలు చేరుతున్నాయని, అప్పుడు మాకో సందేహం కలిగింది. నేర్పరి అయిన చోరుడెవరో స్వర్ణపుష్పాల స్థానంలో మట్టిపూలు పెడుతున్నాడేమోనని స్వర్ణపుష్పాలను బహుచాకచక్యంగా దోచుకొనే వానిని పట్టి బంధిద్దామన్నారు యువరాజులుంగారు, వేగులవారి ద్వారా మననగరుకు ఉత్తరాన పదిక్రోసుల దూరంలో కుర్వపల్లె ఉందని అక్కడ నివసించే కుమ్మరి భీమన్న మట్టి పూలను చేయడంలో నేర్పరి అని మాకు తెలిసింది.

తొండమానుడు బంగారుపూలు, మట్టిపూల ఆకారాలలో తేడాలు కనపడలేదా? రెండూ ఒకేలా ఉన్నాయా?

సేనాపతి మహారాజా! తేడా ఏమాత్రమూ కనబడదు. బంగారు పూలూ, మట్టిపూలూ ఒకే చిత్రిక పట్టినట్లుగా ఉన్నాయి. రంగులో గానీ,

ఆకారంలోగానీ ఏమాత్రం తేడా కనబడదు. ఒక్క బరువులో మాత్రం కొంత భేదం కనబడుతుంది. కానీ సామాన్యులు అది గుర్తించడం కష్టసాధ్యమే.

శ్రీనివాస : ఔను నాన్నగారూ! మట్టిపూలకు పసుపు ఆకుపసరేదో పూయడం వల్ల బంగారం రంగు వచ్చింది. అందువల్ల ఆ మట్టిపూలకూ, బంగారూ పూలకూ తేడా కనిపెట్టడం కష్టమేమరి.

తొండమానుడు: మీరు శ్రమించి ఈ విషయాన్ని గురించి తెలుసుకున్నా రన్నమాట.

సేనాపతి : ఔను మహారాజా! కానీ కుర్వపల్లె వద్ద జరిగిన సంఘటనలు... *(రాకుమారుని వైపు చూచును)*

తొండమానుడు: సందేహమెందుకు సేనాపతీ! ఆ సంఘటనలేమిటో తెలియజేయ్.

శ్రీనివాస : నాన్నగారూ! మీరిప్పుడు వేంకటేశ్వరస్వామి దీక్షలో నియమ నిష్ఠలతో ఉన్నారు. ఆ సంఘటలను గురించి మీకు తెలుపడం సబబుగా ఉండదనే ఉద్దేశంతో మేము సందేహిస్తున్నాము.

తొండమానుడు: మీ మాటలూ, సందేహాలను బట్టి చూస్తే నా అర్చనాకార్యం భంగపడే సూచనలు కనబడుతున్నాయి. అందువల్ల జరిగిన సంఘటన లేమిటో దాచకుండా వివరంగా చెప్పండి.

సేనాపతి : *(సాభిప్రాయంగా రాకుమారుని వైపు చూచును)*

శ్రీనివాస : చెప్పండి సేనాపతీ! మనమా విషయాలను దాచీ ప్రయోజనం లేదు. మహారాజుల వారికి మొత్తం తెలియజేయండి.

సేనాపతి : బంగారు పూల దొంగలను పట్టుకోవాలనే ఉద్దేశంతో శేషాచల అరణ్యాలలో మన సైనికులను మారువేషాలలో నియోగించాము. అప్పుడు కుర్వపల్లె కుమ్మరి భీమన్న గురించి సమగ్రంగా విచారణ చేయడానికి వీలయింది. కుమ్మరి భీమన్న వేంకటేశ్వరస్వామి భక్తుడట. అతడు స్వయంగా చేసిన మట్టిపూలతో స్వామివారిని అర్చిస్తాడు. ఈ విషయం ప్రత్యక్షంగా చూద్దామని రాకుమారులూ, నేనూ మారు వేషాలతో కుర్వపల్లెకు పోయాము. కుమ్మరి భీమన్న వద్ద సేవకుడిగా ఉన్న శ్రీపతి మాటలు విని మాకు సందేహాలు అధికమయ్యాయి.

తొండమానుడు: కుమ్మరి భీమన్న సేవకుని పేరు శ్రీపతా! శ్రీనివాసుని పేరును అంతనాగరికంగా ఒక జానపదుని సేవకునికి పెట్టబడిందా? ఇదేదో ఆశ్చర్యకరంగా ఉంది.

సేనాపతి : మాకూ అలాంటి అనుమానమే వచ్చింది. మహారాజా! ఆసేవకుని పేరేకాదు ముఖ వర్చస్సు కూడా సూర్యునిలా వెలిగిపోతోంది. అతడు ఒక దాసుడులాగ లేడు. గొప్ప రాజవంశీయుడు లాగ కనబడ్డాడు.

తొండమానుడు: ఇది మరింత ఆశ్చర్యంగా ఉందే సేనాపతీ!

సేనాపతి : ఔను మహారాజా! అతని ముఖవర్చస్సే కాదు. ఆకారమూ, మాటలూ, చేష్టలూ అన్నీకూడా ఒక మహారాజును తలపింపజేస్తాయి.

శ్రీనివాస : మేము అడిగిన ప్రశ్నలకు ఆశ్రీపతి సూటిగాను, సక్రమంగానూ సమాధానాలే ఇవ్వలేదు నాన్నగారూ!

సేనాపతి : మేమెవరమో తెలిసికూడా కించిత్ భయం గానీ గౌరవంగానీ అతనిలో ఏమాత్రం కనబడలేదు. జంకూ గొంకూ లేకుండా ధిక్కారంతో కూడా మాతో మాటాడాడు.

తొండమానుడు: *(ఆసక్తితో)* మీరే మడిగారో అతడేమి చెప్పాడో వివరంగా చెప్పండి.

శ్రీనివాస : మీదే ఊరు అంటే శేషాచలంలో ఉందా ఊరు అన్నాడు. ఇక్కడికి ఎందుకు వచ్చావు అంటే కుమ్మరి భీమన్న కోసం వచ్చాను అన్నాడు. కూటికి గతిలేని పేదవాడు భీమన్న నీకేం సహాయం చేస్తాడని వచ్చావు అంటే దానికి అతడు ఎవరు నన్ను ప్రేమాభిమానాలతో నిండు హృదయంతో ఆహ్వానిస్తారో వారు ఏమిచ్చినా వారివద్దనే పడిఉంటాను. అని పలికాడు.

తొండమానుడు: అలా చెప్పాడా?

సేనాపతి : ఔను మహారాజా! ఇంతటి విశాల ప్రపంచంలో ఈ కుమ్మరి భీమన్న నీకు దొరికాడా, రాజా శ్రయం పొందితే ఈ మట్టిమోసే పని తప్పిపోయి, రాజ భోగాలతో శ్రమలేకుండా జీవించవచ్చు కదా అనికూడా రాకుమారులు అన్నారు.

తొండమానుడు: దానికి అతని సమాధానమేమిటి?

సేనాపతి : ప్రేమాభిమానాలకు మించిన రాజవైభవాలా అని మందహాసం చేశాడు.

తొండమానుడు: తర్వాత?

సేనాపతి : కుమ్మరి భీమన్నా నీవూ తొండమాను చక్రవర్తి స్వర్ణ పూజా పుష్పాలను చాకచక్యంగా దోచుకుంటున్నారేమో అని అడిగినప్పుడు అందుకు స్పష్టమైన సమాధానం ఇవ్వలేదు.

శ్రీనివాస : అప్పుడు నాకు కోపం వచ్చింది నాన్నగారూ! అందుకు ఓ శిక్ష విధించాను. దానిని శిక్ష అనే కంటే ఒకవిధంగా పరీక్ష అనవచ్చు. అందులో అతడు నెగ్గాడంటే వారే దొంగలుగా నిరూపింపబడుతారు. లేదూ అంటే అంతటితో ఆ విషయాన్ని అక్కడే వదలి వేద్దామనుకున్నాము.

తొండమానుడు: ఏమిటా శిక్ష?

శ్రీనివాస : ఒక్క రోజు వ్యవధి ఇచ్చి, ఆరోజులోపల మన పరివారం వేయిమందికి భోజన వసతులు కల్పించమన్నాము. అలా చేయకపోతే కొరత వేయిస్తామని అజ్ఞాపించాము.

సేనాపతి : బంగారం దొంగిలించిన వారయితే వారివద్ద ధనం కావలసినంత ఉంటుంది. ఆ ధనంతో వేయి మందికి వారు ఏకష్టం లేకుండా వసతి ఏర్పాటు చేయగలరు. అలా చేయలేకపోతే మట్టిపూల సమాచారం తెలియడానికి ఆధారాలు వెదుకవచ్చు అనుకున్నాము మహారాజా!

తొండమానుడు: ఆ తర్వాతేం జరిగింది?

సేనాపతి : మహారాజా! మహారాజులు మాత్రమే ఏర్పాటు చేయగల విందు భోజనాలను ఒక్కరోజులో తయారు చేయించి వడ్డించారు.

శ్రీనివాస : అప్పుడు మాకు వారే స్వర్ణచోరులు అని నిర్ధారణ అయింది. వారి వెనుక విద్రోహుల ముఠా ఏదో రహస్యంగా తమ కార్యకలాపాలను జరుపుతోందని అనిపించింది. వారు పటిష్ఠమైన పథకంతో వేంకటేశ్వరస్వామి పేరు ఉపయోగిస్తూ, నేర్పుతో దొంగతనాలు చేసి ధనాన్ని కూడ బెడుతారు. ఆ ధనంతో కావలసిన సైనిక బలగాన్ని సిద్ధం చేసుకొని తుండీర మండలాన్ని ఆక్రమించుకోవడానికి ప్రయత్నిస్తున్నారని మాకు తోచిందినాన్నగారూ!

సేనాపతి : రాకుమారులు ఆలోచించింది వాస్తవమే మహారాజా! ఆ ఆలోచన రాగానే కుమ్మరి భీమన్ననూ, అతడి భార్యను, వారి దాసుడయిన శ్రీపతినీ బంధించుమని మనభటులకు ఆజ్ఞఇచ్చారు రాకుమారులు.

తొండమానుడు: ఏమిటీ?

సేనాపతి : ఎక్కడి నుండి వచ్చారో వేలాది మంది సైనికులు వచ్చి మన సైనికులను కమ్ముకున్నారు! వారి ధాటికి మన సైనికులు నిలువలేక చెట్టుకొకరు పుట్టకొకరు పరుగులు తీశారు.

శ్రీనివాస : చూడండి నాన్నగారూ! మనకు ఇసుమంత మాత్రమూ తెలీకుండా మనదేశ ప్రజలే ఎంతటి కుట్రపన్నుతున్నారో!

తొండమానుడు: కుమ్మరి భీమన్న చర్యలను గమనించడానికి మీరు రకరకాల వేషాలలో కుర్వపల్లె పరిసరాలలో నిఘా పెట్టాము అన్నారే. అప్పుడు విద్రోహుల కదలికలు మీ దృష్టికి రాలేదా?

సేనాపతి : లేదు మహారాజా! అటువంటి ఛాయలు కూడా మనవారు పసిగట్టలేదు.

తొండమానుడు: మీరనే ఆ విద్రోహులు క్షణమాత్రాన మీరు కుమ్మరి భీమన్నను బంధించండి అన్న వెంటనే మీ ముందు ఎలా ప్రత్యక్షమయ్యారు?

సేనాపతి : అదే మాకు అర్థంకాలేదు మహారాజా!

తొండమానుడు: ఇది విద్రోహుల కుట్రగా నా కనిపించడం లేదు. ఇదంతా ఆస్వామి వేంకటేశ్వరుని మహాత్మ్యంలా కనబడుతోంది.

శ్రీనివాస : నాన్నగారూ! వేంకటేశ్వర స్వామి మనలను ఇలా దెబ్బ తీయడానికి ఎందుకు పూనుకుంటాడు! మనం ఆయనకు బంధువులమే కాదు భక్తులం కూడా కదా! మీరాయన కోసం ఎన్ని కార్యాలు నిర్వహించారు!

సేనాపతి : ఆయన నివాసగృహాన్ని ప్రాకారాదులతో భయంకరమైన ఆకొండల నడుమ పటిష్ఠంగా కట్టించి ఇవ్వలేదా! ఆయన నివాస గృహవిమానానికి బంగారు తొడుగులు చేయించలేదా!

శ్రీనివాస : నిత్యమూ ఆయననే మనసావాచా కర్మే అర్చిస్తున్నారే అటువంటి మీకు ఆయన పరీక్ష పెట్టడమేమిటి నాన్నగారూ! ఇదంతా ఏమిటో నాకర్థం

కావడం లేదు. మనం వేంకటేశ్వరస్వామికి అత్యంత సన్నిహితులం అనీ, మన రాజ్యం సుభిక్షంగా ఉందనీ, అసమాన కీర్తి ప్రతిష్ఠలు మనకు లభిస్తున్నాయనీ, అసూయా ద్వేషాలతో ఎవరో మనపై కుట్రపన్ని మన రాజరికాన్ని కూల్చివేయడానికి భయంకరమైన పథకం వేశారు నాన్నగారూ!

**సేనాపతి** : మహారాజా! మీతో మనుపటిలాగ వేంకటేశ్వరస్వామి ప్రత్యక్షంగా మాట్లాడకపోవడం తెలుసుకున్న వారెవరో ఈ కుట్రకు కారణభూతులుగా కనబడుతోంది నాకు.

**తొండమానుడు**: మన ప్రజలు సుఖశాంతులతో ఉన్నారు. అటువంటి ప్రజలనుండి విద్రోహులూ, విప్లవకారులూ ఎలాపుట్టుకొని వస్తారు. సేనాపతీ!ఎవరికి ఆ అవసరం ఉంటుంది?

**సేనాపతి** : రాజ బంధువులకు రాజ్య కాంక్ష అధికంగా ఉంటుందని విన్నాను మహారాజా!

**శ్రీనివాస** : నాన్నగారూ! మీ సోదరుడూ నాకు పెద్దనాన్న అయిన ఆకాశరాజు మరణించిన వెంటనే సమస్తచోళరాజ్యం కోసం అన్నగారు వసుదాసు అఖ్ఖులు చాచలేదా! అప్పుడు అతిపెద్దయుద్ధమే జరిగింది. నా సోదరి పద్మావతీదేవి కూడా తన సొంత తమ్ముడు వసుదాసుకే మొత్తం రాజ్యాన్ని ధారాదత్తం చేయాలనుకొన్న సంగతి మీరు మరచారా! తర్వాత మహర్షి అగస్త్యుడు కలుగ జేసుకొని చోళరాజ్యాన్ని రెండుగా సమభాగాలు చేయించి సంధికుదిర్చాడు. వసుదాసు నారాయణపురం రాజధానిగా చోళరాజ్యంలో సగభాగాన్ని తీసుకొన్నాడు. మిగిలిన సగభాగం తొండమనాడు రాజధానిగా మనకు లభించింది.

**సేనాపతి** : మీకూ వసురాజుకూ జరిగిన యుద్ధంలో వేంకటేశ్వరుడు తన బావమరిది పక్షమే చేరాడుకదా మహారాజా!

**శ్రీనివాస** : లోకాపవాదం కొరకు వెరచి మనకు తనవద్ద ఉన్న రెండు ఆయుధాలు ఇచ్చాడుగా సమరాన్ని ప్రేరేపించే శంఖం ఒకటి, శత్రువుల మీదికి విసరడానికి చక్రం ఒకటి. చక్రాయుధాన్ని ప్రయోగించడం

అంతసులభం కాదు. ఎంతో సాధన చేయాలి. నేనెంతో శ్రమ పడిచక్రాయుధ ప్రయోగం నేర్చుకోవలసి వచ్చింది.

సేనాపతి : వేంకటేశ్వరుడు తన బావ మరిది వసుదాసు పక్షాన మీతో భీకర యుద్ధం చేస్తూ, మహారాజా! మిమ్ము కూల దోసే ప్రయత్నంచేశాడు కదా! అప్పుడు యువరాజు సమయస్ఫూర్తితో చేతిలోని చక్రాన్ని వేంకటేశ్వరునిపైకి విసిరారు. ఆ చక్రం దెబ్బకు వేంకటేశ్వరుడు తెలివి తప్పి పడిపోయాడుకదా మహారాజా!

శ్రీనివాస : ఆదెబ్బతో నాసోదరి పద్మావతీ దేవి అగస్త్య మహర్షిని వేడుకొని అగండం నుండి తన భర్తను కాపాడుకొంది. మనతో సంధి చేకూర్చుమని కోరింది కదా నాన్నగారూ! అయినా మీరు వేంకటేశ్వరునిపై విశ్వాసముంచారు. ఆయనకోసం ఎన్నెన్నో చేశారు.

సేనాపతి : అందుకు తగినట్లుగానే వేంకటేశ్వరస్వామి మీ పట్ల కృతజ్ఞతతోనూ, అభిమానంతోనూ వ్యవహరించారు. మీకు ప్రత్యక్ష దర్శనం ఇస్తూ ఉండేవాడు.

శ్రీనివాస : వేంకటేశ్వరుడు మనపట్ల ఎంతో ఆదరాభిమానాలు చూపుతూనే ఉన్నాడు. కూర్మాచార్యులధర్మపత్ని అనుకోని రీతిలో పిల్లలతో మరణించినపుడు మనలను మన్నించి వారిని బ్రతికించి బ్రహ్మహత్యా పాపం నుండి మనలను తప్పించాడు. కానీ వసుదాసు మనపట్ల ఎందుకు కృతజ్ఞుడుగా ఉంటాడు? అఖండ చోళరాజ్యాన్ని రెండు ముక్కలు చేశామని ఆయన మనపై కినుక వహించి ఉండడా? పైకి మనకు స్వర్ణసహాయ మందించినా అది ప్రజలను మభ్యపెట్టడానికే అని అనుకోకూడదా! సాధ్యమైతే మన రాజ్యాన్ని తన రాజ్యంలో కలుపుకొనే ప్రయత్నం చేయడా నాన్నగారూ!

తొండమానుడు: నాకు అలా అనిపించడం లేదు నాయనా శ్రీనివాసా! వసుదాసు సత్యసంధుడు, పరమసాధువు. తన బావ, అక్కలకు, అగస్త్య మహర్షికి ఇచ్చిన మాట తప్పడు.

శ్రీనివాస : మాట ఇచ్చాను కదా అని ఆ విషయం బయటి పడకుండా రహస్యంగా కుట్రపన్ని తుండీర రాజ్యంలో అల్లకల్లోలం సృష్టించి, మనం రాజ్యపాలనా అర్హులం కాదని ప్రజలకూ వేంకటేశ్వరునికీ ఎరుక

పరచడానికే ప్రయత్నం చేస్తున్నాడేమో! మనసులోని గుట్టు మాధవునికైనా తెలియదు అంటారు కదా నాన్నగారూ!

**తొండమానుడు:** కాదు, కాదు నాయనా! వసుదాను అంతటి ద్రోహానికి ఒడిగట్టడు. వాడి గుణ గణాలు పిన్నవయస్సు నుండీ నాకు బాగా తెలుసు. నా అన్న ఆకాశరాజు లాంటి స్వభావం కలవాడు వసుదాసు.

**శ్రీనివాస :** నాన్నగారూ! రావణాసురుడు కూడా ఇలాగే తన సోదరుడు విభీషణుని నమ్మిచెడ్డాడు.

**తొండమానుడు:** కుమారా! నన్ను వేంకటేశ్వర సహస్రస్వర్ణ పుష్పార్చన చేయమంటావా? వద్దంటావా?

**శ్రీనివాస :** నాన్నగారూ! కోపపడకండి. వేంకటేశ్వరస్వామి మీద నాకూ అపార భక్తివిశ్వాసాలు ఉన్నాయి. ఆయన నామార్చన చేయడానికి స్వర్ణ పుష్పాలను చేయించే బాధ్యత ప్రథమం నుండి నా మీద స్వచ్ఛందంగా వేసుకున్నాను.

**తొండమానుడు:** అయితే

**శ్రీనివాస :** నూరు దినములు గడిచినా ఆయన దర్శనం కాలేదుమీకు. అయినా పట్టువిడువలేదు నేను బొక్కసం వట్టిపోయినా దానంగానూ, ఋణంగానూ బంగారాన్ని తెచ్చి స్వర్ణపుష్పాలు చేయించాను. ఇప్పుడు నేను ఇరుగు పొరుగు దేశాలపైకి దండయాత్ర చేసి అయినా బంగారాన్ని సంపాదిస్తాను.

**తొండమానుడు:** కుమారా! శ్రీనివాసా! నేనేం చెప్పను! నేనేంచెప్పను? అమంగళం ప్రతిహతమగుగాక!

**శ్రీనివాస :** నాన్నగారూ! మరేమనుకోనంటే నేనో విషయం చెపుతాను. స్వర్ణపుష్పాలతో అర్చన కంటే తామరపూలతో పూజచేస్తే ఏమిటి? బంగారం లేనప్పుడు, లేనివారు పూలతో చేయడం లేదా! మనకు బంగారం సమకూరినప్పుడు స్వర్ణపుష్పార్చన చేద్దాము. ప్రస్తుతానికి అలా చేయడమే మంచిదనిపిస్తోంది నాకు. మిమ్ము తర్వాత కలుస్తాము.

*(శ్రీనివాసయువరాజు, సేనాపతి నిష్క్రమింతురు.)*



# చతుర్థాంకము

## 10వ రంగము

*(ఏకాంత మందిరంలో ఒంటరిగా అతడు పిచ్చి పట్టిన వాడిలా మెలగుతుంటాడు తొండమానుడు.)*

**తొండమానుడు :**

*నమో గదాబ్జ శంఖ చక్ర నవ్యబాహుపంకజా!*
*నమో కృపా కటాక్షలబ్ధ నాకరాజ్య వైభవా!*
*నమ స్సమస్త లోకపాల సంప్రశస్త మానసా!*
*నమో రమాధరాంగ నాధనాధ వేంకటేశ్వరా!*

*(కూచిరాజు ఎఱ్ఱన "సకలనీతి కథా విధానము")*

స్వామీ! ఇంకా నామీద దయ కలుగలేదా! ఎక్కడ ఉన్నా ఏవేళనైనా, ఏ స్థితిలో ఉన్నా నాకు దర్శన మిచ్చువాడివే! నాతో అరమరికలు లేకుండా మాటాడేవాడివే! మనం ఎదురె దురుగా కూచొని మామా అల్లుళ్ళలా కాకుండా ఆప్తమిత్రలులాగా ఎన్నిసార్లు సల్లాపాలాడుకోలేదు అవన్నీ మరచి పోయావా?

నా అన్న ఆకాశరాజు స్వర్లోక వాసి అయిన పిమ్మట రాజధర్మం ప్రకారం నేను చోళ సామ్రాజ్య అధినేత కావలసిననాడు నీ మాటను త్రోసివేయకుండా వసుదాసుకు సగం రాజ్యం ఇచ్చానే! అదీ నీకు జ్ఞాపకం లేదా?

నా సోదరుడు ఆకాశరాజు అనుంగు పట్టి పద్మావతీదేవిని నీవు చేపట్టిన నాడు, శుకబ్రహ్మాది మహర్షులు మీ కళ్యాణ మంటపమునకు వచ్చిననాడు అగస్త్య మహర్షి నీ మహిమాన్విత చరిత్ర అందరికీ తెలియజేశాడు. అప్పుడు నీవు కోరుకొన్న స్థలంలో ఏడుకొండల నడుమ, కీకారణ్య మధ్యాన, నీరాజసానికి భంగం కలుగని ఆవాస గృహాన్ని నీకు నిర్మించి ఇచ్చానే అవన్నీ గుర్తుకు రాలేదా నీకు స్వామీ!

ఈనాడు నీ కోసం, నీ అర్చన కోసం నా సమస్త సంపదనూ సమర్పించు కొంటున్నానే స్వామీ! ఇదిగో ఈ తుండీర రాజ్యాన్నీ నీకు ధారా దత్తం చేస్తాను. నాకు దర్శనం ఇవ్వు. ఒక్కసారి దర్శనమిస్తే చాలు శ్రీనివాసా! నాజన్మ ధన్యమవుతుంది.

కుమ్మరి భీమన్న, పేదవాడయిన కుమ్మరి భీమన్న నీకు కూర్మిని కూర్చే పరమ భక్తుడయ్యాడా! నేను, తుండీర దేశమహారాజును నీ దృష్టిలో తృణప్రాయుడినయ్యానా! గడ్డిపోచకంటే హీనంగా కనబడుతున్నానా నీకు నేను.

నాకుమారునికీ, సేనాపతికీ కుమ్మరి భీమన్న సేవకుని రూపంలో దర్శనమిచ్చావు. మాటాడావు. వాదించావు. ఎన్నో విధాలుగా వారిని కవ్వించావు. అయినా వారది గ్రహించలేక పోయారు. నీవే అలా చేస్తున్నావని తెలుసుకోలేక పోయారు. నీ లీలలు నేను అర్థంచేసుకో లేననుకున్నావా?

ఒక పాపం తెలియక చేసిన పాపం, బహ్మహత్యా పాపం మమ్ము అంటు కొన్నప్పుడు ఆపాప పరిహారార్థం అర్థరాత్రి నీ నివాసానికి నేను వస్తే, నా మాట మన్నించి నీవు వేళకాని వేళ అనకుండా పాండవతీర్థం రాలేదా? ఆ పాండవ తీర్థంలో బ్రాహ్మణుని భార్యా పిల్లల అస్థిపంజరాలను నీట ముంచుమని చెప్పి వారికి పునర్జీవం పోసి మాపాపాలను కడిగి వేయలేదా? అలా పాండవ తీర్థాన్ని అస్థితీర్థంగా చేసి ప్రసిద్ధం చేయలేదా స్వామీ! అలాంటి వాడివి నీవు ఈ నాడు నాకు నీముఖారవిందం చూపడానికి ఇచ్ఛగించడం లేదంటే ఏమనుకోవాలి. స్వామీ! శేషశైలవాసా!

ఒక శూద్రకుల సంజాతుడే ఈ నాడు నీకు ఎక్కువయ్యాడా! అతడొక్కడే నీపట్ల ప్రేమాభిమానాలు కురిపించే వాడయ్యాడా! అతడి వద్ద నీవు సేవకుడిగా చేరావా? మట్టి తవ్వుతూ మట్టిని పిసుకుతూ, అంబలి తాగుతూ కుమ్మరి భీమన్న వద్ద దాసుడిగా బ్రతుకుతున్నావా?

స్వామీ వేంకటాచలవాసా! చల్లటి నీరు తగులుతూనే ఎక్కడ నీచేతులు కందిపోతాయేమోనని మెత్తటి వస్త్రాలతో నేను నీ చేతులు తుడవడం మరచావా!

తిరుమలను ఎక్కేటప్పుడు నీ పాదా లెక్కడ. వడలిపోతాయేమోనని నీకాళ్ళ కింద పరుపులు పరిపించి నడిపించడం గుర్తు రాదానీకు!

అయ్యా! గరుడాద్రి వాసా! వసుదానుకూ నాకూ యుద్ధం జరిగి సంధి కుదిరాక నీవేమన్నావో ఒక్కసారిగుర్తు చేసుకో. "ఓ తొండమాన్ చక్రవర్తీ, ప్రాణంవదలడానికి సిద్ధ పడిన నాకూ, నీకుమార్తె పద్మావతికీ ఏమిస్తావు" అని అడిగితే నేనేం చేశానో గుర్తు చేసుకోవయ్యా! తుండీర రాజ్యంలో షోడషభాగం ఇవ్వడం న్యాయమని ముప్పయి రెండు గ్రామాలను మేము నీకు ధారాదత్తం చేయడంమరచిపోయావా?

నీ వివాహం జరిగిపోయిన తర్వాత, నా సోదరడు ఆకాశరాజు మరణానంతరం నీవు నాతో ఏమన్నావో ఒక్కసారి గుర్తు తెచ్చుకో తిరుమలవాసా! గుర్తు లేకపోతే నేను చెపుతావిను. "ఆకాశరాజు జామాత పరగృహంలో నివాసమేర్పరచుకొన్నాడు. అనే అపకీర్తిని పొందడం బాగుంటుందా! నాకో గృహాన్ని కట్టించి ఇవ్వలేవా". అని నీవు అన్నప్పుడు నేనేం చేశానో ఒక్కసారి మననంచేసుకో మహానుభావా!

ఓ వృషాద్రి వాసా! శేషాచలం పై నీకో గృహం నిర్మించి ఇమ్మన్నావు. వరాహస్వామి అనుమతితో స్వామి పుష్కరిణికి దక్షిణ దిశలో నీ గృహంకోసం నివేశవస్థలం తెలిపావు. ఆ స్థలమెలాగుందో తెలియదానీకు! పాడుబడిన రాళ్ళు గోడలు, ముళ్ళకంపలతో నిండిఉంది. పూర్వమెప్పుడో అక్కడ చింత చెట్టు కింద పెద్దపుట్ట ఉండేదట. ద్రుమ కుఠారుడనే బోయదొర, వాటి చుట్టు కొండరాళ్ళతో గోడలు పేర్పించాడట. వాటి మహిమ వల్ల, ఆ కోయవారు ఎన్నో శుభాలు పొందడంతో అలా చేశారట. అటువంటి స్థలాన్ని చదును చేసినాక నీవే మన్నావో గుర్తుచేసుకో శేషగిరివాసా?

"నా ఆలయం రెండు గోపురాలతో మూడు ప్రాకారాలతో ఏడు ద్వారాలతో, అత్యున్నతమైన ధ్వజస్తంభంతో ఉండేటట్లు నిర్మించి ఇమ్మన్నావు కదా! ఆ సంగతి అయినా నీమనస్సులో నిలచిఉందా ఏడు కొండలవాడా! అంతేనా వస్త్రగృహం, భూషణశాల, సువాసన ద్రవ్యశాల, మాలాగృహం, తైలశాల,

ఘృతశాల, భక్ష్యశాల, ఆస్థాన మండపం, యాగమంటపం, ధాన్యశాల, గోశాల మొదలైన వాటినెన్నింటినో బంగారు అలంకారాలతోనూ, తామ్రమట్లాలతోనూ ఉండాలి" అని నీవన్నప్పుడు నేనేమన్నానో ఒకసారి అంటే ఒక్కసారి జ్ఞాపకం తెచ్చుకోవయ్యా అంజనాద్రి వాసా!

నేను పూర్వ జన్మలో "అప్రాకృత పురుషుడైన నాకు నీవు పరమ భక్తుడిగా మెలగినావు అని చెప్పావు. ఆ సమయాన నీవు శ్రీతీర్థాన్ని, భూతీర్థాన్ని నిర్మించావు. అని అన్నావు. స్వామి పుష్కరిణి సమీపంలో ఒక కూపాన్ని కూడా నేనేత్రవ్వించాను అని నా పూర్వజన్మ విశేషాలను తెలియ జేప్పావు! పాడుబడిన ఆకూపాన్ని శుద్ధి చేసి పెట్టమంటే శుద్ధిచేయించింది నేనుకాదా!

ఓ వృషభాద్రినివాసా! నీ మాట నాకు వేదవాక్కు అది ఒక మహా ఆజ్ఞగా తలంచినానే! ఆసంగతి నీకు తెలియదా!

రత్న ఖచిత సమోన్నత చతుర్వృక్ష సముపేతవైన తేయ విభూషిత సువర్ణ కలిశసమేత విమానము నీకు నిర్మించి పెట్టింది ఎవరయ్యా. తిరుమలయ్యా!

ఇంత చేసిన నేను నీకీ నాడు కంటికానడం లేదా! పరాయి వాడినయి పోయానా! ఒక శూద్రుడు, దౌర్భాగ్యుడూ కులాలుడైన భీమన్న నీకీ నాడు ఒక మహారాజులాగ కనబడుతున్నాడా? ఆ భీమన్నకు నీవు దాసుడివా! భేష్! చాలా బాగుందయ్యా శేషాచలపతీ! చూడుమయ్యా! కంటకప్రాయమూ, గండశిలా స్థావరమూ మహావృక్షాలూ, లోయలూ, కీకారణ్యం కలిగి ఉన్న కొండలను ఎక్కివచ్చి నీ దర్శనం చేసుకోవాలనుకున్న వారి కోసం మార్గమేర్పరచిందెవరో గుర్తుచేసుకోవయ్యా స్వామీ! యోజనాధిక దూరమైన మార్గాన్ని అసంఖ్యాక సోపానాలతో నిర్మించి సుగమం చేసిన వాడు ఈ తొండమాను చక్రవర్తి కాదా! ఈ దుర్గమారణ్యాల మధ్య కొండకోనల్లో తిరుమల యాత్రికుల కోసం సోపానాలతోపాటు విశ్రమించడానికి కూడా మార్గమధ్యంలో అవసరమైన చోట మంటపాలనూ, దాహం తీర్చుకోవడానికి వాపీ కూపాలను నిర్మించి ఇచ్చిందెవరయ్యా శేషగిరివాసా! నేను కాదా! అంటే ఈ తొండమాను సామ్రాట్టు కాదా!

ఇంకా ఏమేమి చెప్ప మంటావు! వీటినన్నింటినీ నిర్మించి అగస్త్య మహర్షి ఆశ్రమంలో అతిథిగా ఉన్న నిన్ను రంగరంగవైభవంగా వేద పాఠకులతో, వివిధవాద్య సంగీత బృందాలతో పద్మావతీ దేవీ సమేతంగా నిన్ను శేషాద్రిపై నిర్మించిన ఆలయానికి తోడ్కొని వచ్చి వదలిని వారెవరనుకున్నావో మరచిపోయావా వేంకటేశా!

ఇంత చేసినది నేను అనే మాట అయినా, నీకు ఏకోశాన అయినా, ఏ క్షణాన అయినా నీ మనస్సులో మెదలదా! నన్ను నీవు మరచిపోతే పోనీలే. ఆ ఆలయంలోకి ప్రవేశిస్తూ నీవేమన్నావో ఒక్కసారి మననం చేసుకోవయ్యా! ఈ ఆలయం నాకు ఆనందజనకమైంది కాన ఇది ఆనంద నిలయం అన్నావు. అప్పటి నుండి నీ గృహం ఆనందనిలయంగా ప్రసిద్ధమైంది స్వామీ వేంకటరమణా! ఆనందనిలయవాసా! అది నీకు ఆనందనిలయమే కానీ దానిని నిర్మించి ఇచ్చిన నాకు దుఃఖ భాజకమయ్యేటట్టు చేశావా? నీవక్కడ ఆనందంగా ఉన్నావు. ఇన్ని చేసిన నేను నీకొండ కింద యోజనాధిక దూరంలో నీ దర్శనం కోసం అలమటించి పోతున్నాను! ఇది నీకు న్యాయమా? నామీద దయ కలుగలేదా! కృప చూపవా? నీ దర్శన భాగ్యం కలిగించవా? నేనీ నాడు నీ కొండకు దొంగనయ్యానా?

నీ దర్శన మివ్వకపోతే పోనీలే పోవయ్యా! ఇక చాలుగానీ! అడుగుతున్నే కొద్దీ నీవు అందలమెక్కి కూర్చుంటున్నావు?

ఆ భీమన్న నీకు ఆలయం నిర్మించాడా? మార్గమేర్పరచాడా? త్రాగేటందుకు ఇంత నీరు లభించే నుయ్యి త్రవ్వించాడా? అక్కడెక్కడో ఒక మారుమూల పల్లెలో పూరిపాకలో, పాత గోడలో ఒక చిన్న మట్టి గూటిలో నిన్నోచెక్క బొమ్మను చేసి ప్రతిష్ఠించుకొని, మట్టి పూలతో ఇంత పసుపూ,ఇంత కుంకుమా కాసింత గంధమూ పూసి పూజచేస్తే అతడే నీకంత అభిమాన పాత్రుడయ్యాడా? శహభాష్! భక్తవత్సలుడివికదా నీవు? అపద్బాంధవుడివికదా నీవు! నీకు నా సామ్రాజ్యాన్నే పణంగా పెట్టి కొండకోనల్లో ఇన్నిన్ని కట్టడాలు

నిర్మించి నిన్ను రాజవైభవాలతో తేల్చినందుకు నాకు ఈ నాడు తగిన ఫలితమే లభించిందయ్యా స్వామీ! తిరుమలేశా!

దీనికంతటికీ కారణం ఆ భీమన్న. భీమన్న నీ పట్ల ప్రేమనూఅభిమానాన్నీ, ఆరాధననూ, అర్చనలనూ ఎలా చూపుతున్నాడు? నీవా భీమన్న సేవలకు ఎలా లొంగిపోయావు? అదేమిటో నేను చూస్తాను స్వామీ! తత్క్షణమేనేనా భీమన్నను చూడాలి. అతని గొప్ప తనమేమిటో గ్రహించాలి. నీవా భీమన్నకు ఎందుకు, ఎలా సేవలు చేస్తున్నావో తెలుసుకోవాలి.

ఊహూఁ నేనెందుకు ఆ భీమన్నను చూడాలి? వాడెవడు? వాడి బ్రతుకేపాటిది? ఒక మహారాజునైన నేను ఒక కుమ్మరిని వెదుక్కుంటూ పోవాలా? నా రాజ ప్రాకారం చెంతకైనా రాలేని ఒక కుమ్మరి భీమన్నను నేను పోయి చూడాలా? కాదు కాదు. వాడు... ఆ భీమన్న నా చెంతకే రావాలి. నావద్దకు రావాలంటే అంత సులువనుకుంటున్నాడేమో! నాకోట వెలుపల సైనికులెందరో అప్రమత్తులై ఉంటారు. చీమను కూడా లోపలికి చొరనివ్వరు. ఒకవేళ కోటగవిని దాటి వచ్చాడనుకో సైనిక స్థావరాలను దాటాలి. అదీ అధిగమించాడనుకో రాజమార్గాన నడవాలి. రాజమార్గాన మంత్రి సామంత సైన్యాధిపతుల గృహాలను దాటిలి. తర్వాత రాజాంతఃపురం చేరాలి. అందులో ఉండే నా ఏకాంత మందిరానికి రావాలి. ఇన్నింటిని దాటి వచ్చినా నా దర్శనం ఆకుమ్మరి భీమన్న చేసుకోగలడా? నాకిష్టమైతే దర్శనమిస్తా! అడిగి అనుజ్ఞతీసుకోనందుకు కుమ్మరి భీమన్నకు ఉరిశిక్ష విధిస్తా? ఆహ్హాహ్హా

*(ఏడుస్తూ పరుగులు తీయును.)*



## 11వ రంగము

*(అభినయ పూర్వకమైన జానపద గీతం. యువతి, యువకుడు దరువువేసేవారూ. తొండమానుడు చిరిగిన వస్త్రాలతో నిలబడి ఉంటాడు).*

**యువతి :**

తూరపు గాలికి తూగినే మల్లె జంబూ జవ నేరేడల్లో
దక్షిణా గాలికీ దాగినేపల్లె ”
ఉత్తరపు గాలికి ఊగినేమల్లె ”
రాలిన పూలన్నీ రాసులూ పోసిరే ”
కోసినా పూలన్నీ రాసులూ పోసిరే ”

ఆ పూలను తీసుకు పోయి బేరానికి పెట్టారయ్యా
పూలమ్మి ఎవరెవరి దగ్గరికి పోయి అడిగిందో వినూ

ఎగువ తిరుపతి నుండె ఓయంకటేశా జంబూజవ నేరేడల్లో
పూలయ్యా యిరిమల్లె పూలు కొనరయ్యా ”

**ఒక యువకుడు** : పూవులా వెలయేమి చెప్పవేబాల ”

**యువతి** : పూవుకు పుట్టెడు రతనాలు చాలు ”
మొగ్గకు ఏదూము ముతియాలు చాలు ”

**యువకుడు** : అట్లయితే ఆపూలు కొనలేము బాల ”

**యువతి (మిగిలిన యువకులు ఒక్కొక్కరుగా జవాబిస్తారు)**
*దిగువ తిరుపతిలోని గోవిందరాజుల స్వామి* //అట్లయితే//
*రాయచోటిలోని రాసరాయుడూ* ”
*కడప ప్రాంతములోని వీరబల్లీలోని ఈశ్వరయ్యా* ”
*కదిరిలో నెలకొన్న నర్సిమ్మ స్వామీ* ”

**అందరూ ఒకటిగా** : అట్లయితే ఆపూలు కొనలేము బాల

**యువతి** : నాగలపై కూర్చున్న అలిమేలు మంగా ॥జంబూజవనేరేడల్లో॥
బండి నిలిపింది అలిమేలు మంగా "

అప్పటికప్పుడు వెంకన్న యేం చేశాడయ్యా ॥జంబూజవనేరేడల్లో॥
కోటి నామాలయ్య కొండన్న నగుచు "
పదిపుట్ల రతనాలు, ముతియాలు పోసి "
పూలన్ని తీసినే దండలల్లేనే "
పండు వెన్నెలలోన దండలు తీసి "
ముదిత కొప్పున ముడిసి మురిసిపోయేనే "

(కె.వి.కె. ముత్యయ్య సేకరణ, రాయలసీమ రాగాలు' నుండి).

**తొండమానుడు** : (ఒంటరిగా...)

ఒక్కోమల్లెపువ్వుకు పుట్టెడు రత్నాలు! ఒక్కో మొగ్గకు ఏదుము ముత్యాలు! ఎంత జాణ ఈ పడతి! ఆ పూలవెల ఎంత చెప్పింది? మొదట వెంకన్న కూడా కొనలేక పోయాడట. ఎందుకు? ఆ ధర చూచి జంకినాడు. గోవిందరాజస్వామిగాని, రాచరాయుడు గాని, ఈశ్వరుడు గానీ, ఖాద్రి నరసింహస్వామిగాని ఆపుష్పలావిక చెప్పిన వెలకు అమల్లెపూలు కొనలేకపోయారట.

స్వచ్ఛమైన, మృదువైన, సువాసనాభరితమైన మల్లెపూలను గానీ, మల్లె మొగ్గలను గానీ, ఇందరు-ఎంతో సంపదకలిగినవారు-పుష్పలావిక చెప్పిన ధరపెట్టి కొనలేకపోయారు. పోనీలే అనుకుందాం!

మొదట వెంకన్న - అపూలు కొనలేము అనిచెప్పిన వెంకన్న తిరిగి కొన్నాడే!! అవీ ఎన్నెన్ని రత్నాలు, ముత్యాలు పోసి కొన్నాడు? పదిపుట్ల రత్నాలు, ఏదూము ముత్యాలు లెక్కన పోసి మల్లెపూలూ, మొగ్గలు కొన్నాడే వెంకన్న - ఆఁ. ఆ వేంకటేశ్వరుడు ఎందుకు కొన్నాడు? ఆహాఁ! ఆ అలిమేలు మంగమ్మను చూచికొన్నాడు! అలిమేలు మంగమ్మ కోసం అపూలను దండలుగా కూర్చాడు. అపూలహారాలను ఆమె కొప్పున స్వయంగా ముడిచాడు? ఎప్పుడు? పండువెన్నెలలొన! పూలూ స్వచ్ఛమై శ్వేత వర్ణం కలవే! వెన్నెలా! అహ్లాదకరమైన

తెల్లని వెన్నెలలోని ఆ తల్లి అలిమేలు మంగమ్మ అంటే శ్రీదేవి కొప్పులో శ్రీనివాసుడు ముడిచాడు.

శ్రీదేవి - సిరుల దేవేరి తన వక్షస్థలాన అపురూపంగా పెట్టుకొన్న శ్రీనివాసునికి పదిపుట్ల రత్నాలు, ముత్యాలు ఏపాటి? స్వామీ! శ్రీనివాసా! సిరిసంపదలు నీ వెన్నంటే ఉన్నప్పుడు నీవు ధనానికి, రాజ వైభవాలకూ లొంగుతావా? నేను అమాయకుడియ్యాను. అందుకే నిన్ను బంగారు పూలతో పూజచేసి మెప్పించాలనుకొన్నాను.

నేను చేసిన అపరాధం చిన్నదిగా భావించాను. బ్రాహ్మణహత్యా దోషం పోగొట్టుకోవాలనే ఆత్రంతో అర్ధరాత్రి, అపరాత్రి అనకుండా నీ ఏకాంతానికి భంగం కలిగించాను. అదీ శ్రీదేవి సాన్నిహిత్యంలో నీవు ఉండగా... ఎంతటి అపరాధం నాది స్వామీ!

రత్నాలు, ముత్యాలు పోసి శ్రీదేవిని సతోషపరచడానికి మల్లెపూలను కొందామనుకొన్నావు. అందుకోసం పదిపుట్ల రత్నాలూ, ముత్యాలూ నీకు ఏమాత్రం లెక్కలోకి రాలేదు. ఆతల్లి సంతోషమే నీకు అన్నింటికంటే ప్రధానమైంది దేవా!

ఆ విషయం నేను గ్రహించలేకపోయాను. ఆ దినం... ఆ అర్ధరాత్రి నేను మీ ఏకాంత మందిరానికి రావడంతో ఆతల్లి శ్రీదేవి ఆక్షణాన ఎంత చిన్నబుచ్చుకొన్నదో! సంక్షుభిత మనస్కుడనై ఉన్న నేను గుర్తించ లేకపోయాను.

ఇప్పుడర్థమౌతోంది వేంకటేశా! నేను చాలా పెద్ద తప్పు చేశాను. అంతేకాదు. ఒక విధంగా అహంకారంతో మీ దంపతులపట్ల నేను వ్యవహరించిన తీరు తలచుకొంటే.... అయ్యో! స్వామీ! నేనెంత దుర్మార్గుడిని!

అంతేనా! బంగారంతో నిన్ను ప్రసన్నుడిని చేసుకోవాలను కొన్నాను. నేనో మహారాజును కదా అనే అహంకారంతో మెలగుతూ నిన్ను అర్చించాను. ఓహ్! చిత్తశుద్ధి లేని పూజ చేసి నిన్ను మెప్పించాలనుకొన్నాను.

అయినా భగవాన్ శ్రీవేంకటేశా! ఎన్నో జన్మలుగా నీకు భక్తుడనైన నాకు అపూర్వజన్మ సుకృత ఫలం వల్లనే నీతో బంధుత్వం పొందాను. నీతో కలసిమెలసి తిరిగాను. దానితో అహంకారాన్ని పెంచుకున్నాను. ఫలితాన్ని అనుభవిస్తున్నాను శ్రీనివాసా! అందుకే రాజాంతఃపురం వదలి పిచ్చిపట్టిన వాడిలా దేశమంతా తిరిగాను.

ఇప్పుడు ఈపుష్పలావిక పాడిన పాటను వినగానే నాకు జ్ఞానోదయమయింది. ఈ జానపదుల కున్నంత భక్తి తత్పరతలు నాలో లేక పోయాయి అని గ్రహిస్తున్నాను.

ఔను! కుమ్మరి భీమన్నా ఒక జానపదుడే. అతడు మనస్సునిండా నిన్నే నింపుకొని నీవు తప్ప ఇతఃపరంబెరుగక నిన్ను సర్వవేళలా, సర్వావస్థల్లోనూ తలచుకొంటూ, కొలుచుకొంటూ ఉన్నాడని పిస్తోంది.

కుమ్మరి భీమన్న అమాయక, అకుంఠిత భక్తితో నీహృదయాన్ని దోచుకొన్నాడు. భగవాన్ వేంకటేశా!

ఇక నేనా! అదంతా ఎందుకులే స్వామీ!....

భీమన్నా! నీ హృదయం, నీభక్తి ఎంత ఉన్నతమైందో నాకర్థమయిందయ్యా! నీభక్తి శ్రద్ధలతో ఏడుకొండలవాడినే నీయింటిలో పెట్టుకొన్నావు నీకే పనులు చేసిపెట్టేటట్లు చేసుకొన్నావు

భీమన్నా! నీవు మహాభక్తుడివి. నీదర్శనం చేసుకొన్న తర్వాతనే నాకు ఆభగవంతుని దర్శనం లభిస్తుందని నాహృదయం చెబుతోంది.

స్వామీ! వేంకటేశా! ఇదిగో నేనిప్పుడే కుర్వపల్లెకు పోయి, మహాభక్తుడయిన కుమ్మరి భీమన్నను దర్శించుకుంటాను.......(ముందుకు అడుగులు వేయును)



## పంచమాంకము

### 12వ రంగము

*(కుమ్మరి భీమన్న గుడిసె. సన్నటి వెలుగు రేకలు లోపలికి ప్రసరిస్తూ ఉంటాయి. గుడిసెలోపల తలుపుకు ఎదురుగా ఎడమవైపున గోడలోని దీగూడులో చందనపు కొయ్య బొమ్మ వేంకటేశ్వరుడు. దీగూడుకు ముందు అడ్డంగా ఒక చెక్క. చెక్కమీద పూజాసామాగ్రి, మట్టిబుడుగులు రెండు మూడు కొయ్యపీటపై భీమన్న ధోవతీ నడుముకు తుండుగుడ్డ కట్టుకొని ఉంటాడు. తమాలిని ఉతికిన ముతక చీరలో ఉంటుంది కానీ - రవిక ఉండదు. చీర చెరగుతో వక్షస్థలాన్ని కప్పుకొని ఉంటుంది).*

**భీమన్న** : తమాలినీ! మట్టి పూలనూ తులసీ దళాలను తీసుకురా! (తెస్తుంది) ఒక్కటికూడా విరిగిపోలేదుకదా!

**తమాలిని** : లేదు స్వామీ! మట్టిపూలకు, తెమ్మగా ఉన్నప్పుడే ఆకురసం పూయడం వల్ల జిగురుతో అతికినట్టు గట్టిగా ఉన్నాయి. బంగారంతో చేసిన పూలలాగ మెరిసిపోతున్నాయి కూడా.

**భీమన్న** : స్వామివారిని బంగారు పూలతో పూజచేసే భాగ్యం మనకు లేదు. కానీ స్వామివారిని పూజించకుండా ఉండలేముకదా! మనవృత్తి మట్టి వస్తువులు చేయడం కాబట్టి మన వృత్తి ధర్మం ప్రకారమే వేంకటేశ్వరస్వామిని మట్టిపూలతో పూజిస్తున్నాముకదా తమాలినీ! అదే స్వామి వారికీ సంతోషదాయకం. తమాలినీ! చేసే పూజ హృదయాన్ని అర్పిస్తూ చేయాలికానీ నివేదించే పదార్థాలు అంతముఖ్యం కాదు.

**తమాలిని** : కొండంత దేవరకు గోరంత పత్రి.

**భీమన్న** : అంతే తమాలినీ! స్వామి వారు నాకు కలలో కనిపించి, తగిన మార్గాన్నే చూపాడు. చందనపు కొయ్య బొమ్మలో తనరూపాన్ని నెలకొల్పి మనకు ఇచ్చాడు. మనం అర్చన చేయవలసిన విధానాన్ని సూచించాడు.

**తమాలిని** : ఔను స్వామీ! ఆదినం తెల్లవారు జామున స్వామీ వారు మీకు కలలోకనబడట మేమిటి, వాన జల్లుల మధ్య ఉరుములు మెరుపులుతో పిడుగు పడటమేమిటి, స్వామి విగ్రహం మనయింటి గోడలో వెలయడమేమిటి నాకైతే అదంతా ఇప్పటికీ ఆశ్చర్యకరంగా అనిపిస్తూ ఉంది. అవన్నీ వేంకటేశ్వర స్వామి వారి లీలలే.

భీమన్న : ఆనాటి సంఘటనలు తలచుకుంటూ ఉంటే నాకు ఈక్షణాన కూడా ఒళ్ళు అమితానందంతో గగుర్పొడుస్తూ ఉంది తమాలినీ!

తమాలిని : నాకూ అలాగే ఉంది స్వామీ!

భీమన్న : నేను స్వయంగా స్వప్నంలో కన్న స్వామివారి రూపం అతి సుందరమైనది తమాలినీ!

తమాలిని : స్వామి వారి సౌందర్యం గురించి పెద్దలు పండితులూ పరమ భక్తులూ ఎలా స్తుతించారో ఒకసారి వివరించండి స్వామీ!

భీమన్న : శ్రీవేంకటేశం అతిసుందర మోహనాంగం
శ్రీభూమి కాంతం అరవింద దళాయ తాక్షం
ప్రాణప్రియం ప్రవిలసత్ కరుణాంబురాశిం
బ్రహ్మేశవంద్యం అనిశం వరదం భజామి!

తమాలిని : స్వామి వారి రూపం బ్రహ్మాదుల చేతకూడా కొనియాడబడింది.

భీమన్న : స్వామి వారి దివ్య మంగళ మనోహర రూపం కలలో కాంచాను. ధన్యుడనయ్యాను.

తమాలిని : అయితే స్వామీ! శ్రీనివాసుడు వెలసి ఉన్న కొండ ఎలాంటిదని చెప్పారు మనపెద్దలు!

భీమన్న : సర్వపాపాని వేం ప్రాహుః
కటస్తద్దాహ ఉచ్యతే
తస్మాత్ వేంకట శైలోయం
లోకే విఖ్యాత కీర్తిమాన్

అంటే సర్వ పాపాలనూ దహించి వేసే వేంకటాద్రి లోకంలో ఎంతో ప్రశస్తి చెందినది అని అర్థం.

వేంకటాద్రి సమస్థానం బ్రహ్మాండే నాస్తి కించన
వేంకటేశ సమో దేవో నభూతో నభవిష్యతి
వేంకటాద్రితో సమానమైనది బ్రహ్మాండంలో ఎక్కడాలేదు.
వేంకటేశ్వరుని వంటి దేవుడు లేదు ఒక ఉండడు.

తమాలిని : ఎంత బాగా చెప్పారెవరో! వేంకటాద్రి వంటిది ప్రపంచంలో ఎక్కడుంటుంది. వేంకటేశుని వంటి దేవుడు ఎక్కడా లేడు ఉండబోడు.

భీమన్న : ఈమాట దేవతలు, మహర్షులు ఏనాడో చెప్పారు. చూడు తమాలినీ! సూర్యోదయ సమయానికిముందుగా వేంకటాద్రిని ఎవరు స్మరించుకొంటారో వారు, గంగనుండి సేతువు వరకూ వేయిసార్లు యాత్ర చేసినంత పుణ్యాన్ని మూటగట్టు కుంటారు అని మనపెద్దలు అనుభవంతో చెప్పారు.

తమాలిని : ఏడు కొండల వాడా! వేంకటాద్రివాసా! శ్రీవేంకటేశా!

భీమన్న : ఆఁ.... తమాలినీ! స్వామి వారి పూజకు వేళ అయింది. పూజా సామగ్రి అంతా సిద్ధంగా ఉందా?

తమాలిని : సిద్ధం చేసి పెట్టాను స్వామీ! అవన్నీ స్వామి వారి విగ్రహం ముందే పెట్టాను చూడండి.

భీమన్న : (తనకు తెలిసిన పద్ధతిలో పూజించసాగాడు. తమాలిని మట్టిపూలను తీసి ఒక్కటొక్కటే భీమన్నకు అందిస్తూ ఉంటుంది.)

భీమన్న : ఓం శ్రీవేంకటేశాయ నమః

ఓం శ్రీనివాసాయ నమః

ఓం లక్ష్మీపతయే నమః

ఓం పరాత్పరాయ నమః

ఓం పర స్మై బ్రహ్మణే నమః

ఓం శ్రీ విభవే నమః

ఓం జగదీశ్వరాయ నమః

తమాలిని : స్వామీ! మనమందరం దేవతలను నూట ఎనిమిది నామాలతోనో, వేయినామాలతోనో పూజిస్తామే ఆపేర్లు చూచామంటే ఒకే అర్థం వచ్చే పదాలే ఉంటాయి వానిని పదేపదే మననం చేసుకోవలసిన అవసరం ఎందుకు వచ్చింది. ఈ సందేహం నాకు చాలాకాలంగా ఉన్నా అడగలేక పోయాను.

భీమన్న : తమాలినీ! తిరుమల యాత్రికులు మనయింటికి వస్తూనే ఉంటారు కదా! నీవు వారిచ్చిన సంబారాలతోనే వారికి వండి పెడుతూ ఉంటావుగా. అప్పుడు వారుమాటాడే మాటలను విని నేను తెలుసుకొన్నది చెపుతాను.

తమాలిని : నేనా సమయాలలో పని తొందరలలో ఉండి వారి మాటలు సరిగ్గా ఆలకించలేకపోయాను. చెప్పండి.

భీమన్న : మనసు చంచలమైనది అవటంతో ఏ కార్యం మీదా తొందరగా నిమగ్నం కాదు. అలాగే ఒక పట్టాన దేవుని మీదా నిమగ్నం కాదు, ఏకాగ్రతా కుదరదు. అందువల్ల తరచూ ధ్యాన భంగం జరుగుతూ ఉంటుంది మానసికంగా జరిగేదిది. దేవుని రూపం మనమనస్సుల్లో స్థిరంగా నిలవాలంటే ఆయన పేరును పదేపదే మననం చేసుకోవాలి. ఒకే పేరును వివిధాలుగా మననం చేసుకోవడం వల్ల ఆరూపం మీదే ఏకాగ్రత కలుగుతుంది, ధ్యానం నిలుస్తుంది.

తమాలిని : బిడ్డలు తల్లిని పదే పదే అమ్మా! అమ్మా! అని కలవరించినట్లన్న మాట.

భీమన్న : ఊc. దూడకూడా తల్లి గోవు చుట్టూ తిరుగుతూ అంబా అంటూ, తల్లిని స్పర్శిస్తూ ఉంటుంది కదా!.

తమాలిని : అందుకే నన్నమాట దేవుడిని ఒకే అర్థం ఉన్నా వేల నామాలతో రక రకాలుగా పిలుస్తూ ఉన్నట్లు పలకడమన్న మాట.

భీమన్న : కొందరు నూట ఎనిమిది సార్లు జపిస్తే అది చాలవని వేయిసార్లు నామజపం చేస్తారు. అది వారి వారి మానసిక దృఢత్వాన్ని బట్టి, దేవునిలో మమైక్యం కావాలనే వాంఛను బట్టి ఉంటుంది. అందుకే పెద్దలు రెండు పద్ధతులనూ అంగీకరించారు. అష్టోత్తర శతనామావళి అనీ, సహస్రనామావళి అని నిర్ణయించారు. అప్పటికీ ఏకాగ్రత కుదరకపోతే అది వారి చపల చిత్తం అనుకోవలసిందే.

తమాలిని : మరి శతనామావళి స్తోత్రం అంటూ ఉంటారే....

భీమన్న : అష్టోత్తర శతనామ స్తోత్రమ్, సహస్ర నామస్తోత్రం ఆయా పేర్లతో స్తుతించడమే తమాలినీ!

తమాలిని : స్వామీ! మీరు కూడా వేంకటేశ్వర సామి వారల మీద స్తోత్రాలు రచించారే! అవి అన్నీ స్తోత్రాలులాగే ఉంటాయా ప్రత్యేకత ఏమన్నా ఉందా!

భీమన్న : ఉంది తమాలినీ! విశ్వంలోని విశిష్ట వస్తువులు స్వామి వారి శరీరాంగములుగా వర్ణించాను. ఇలా స్తుతించిన వారు ఇంతకు పూర్వం నాకు తెలిసినంతవరకు లేరు.

**తమాలిని** : ఓహో! వానిని ఒకసారి వినిపించండి.

**భీమన్న** : అవి వినిపించే ముందు ఒక మాట తమాలినీ! అహరహమూ శ్రీవేంకటేశ్వర స్వామి నామనను నిండా కదలాడుతూ ఉంటారు. ఆయన లేనిదే నేను లేను అని అనిపిస్తూ ఉంటుంది నాకు. నేనే నేమిటి ఈ అఖిల ప్రపంచంలో ఆయన లేనిదేదీ లేదు. నాకు శ్రీనివాసుని కృపా కటాక్షాలవల్ల వినూత్నమైన భావజాలం నాహృదయంలో ప్రవేశించి ఈవిధంగా నా నోట పలికించింది తమాలినీ! విను!

*స్వామి వైకుంఠమే నీ నివాసమయ్యె!*
*పాల్కడలి పుత్రి లక్ష్మి నీపట్ట మహిషి*
*స్రష్ట నీనాభి నుండియే జననమ్మొందె*
*నే కులాలుడ నీపూజ నెటుల సేతు!*

*పాపహారిణి గంగ నీపాదజనిత*
*వేయి పడగల ఫణి శయ్య యాయెనీకు*
*వైనతేయుడేయాయె నీ వాహనమ్ము*
*నేకులాలుడ నీపూజనెటుల సేతు!*

*తారహారము నీదు దంతములు కావె*
*మెఱుపు మండల మాయె నీమేనికాంతి*
*చంద్ర సూర్యులమరిరి నీచక్షువులుగ*
*నేకులాలుడ నీపూజనెటుల చేతు!*

**తమాలిని** : చాలా బాగుంది స్వామీ! మిమ్మల్ని మీరు స్వామికి పరిచయం చేసుకుంటూ - స్వామి వారి గొప్పదనాన్నీ, విశ్వంలోని ప్రధానమైన వానిని స్వామి వారి శరీరంగాలతో పోల్చి విశిష్ట రీతిలో ప్రస్తుతించారు.

**భీమన్న** : స్వామి వారు ....... (అనబోతున్నంతలో బయటినుండి.. )

**గ్రామస్థుడొకని కంఠం** : భీమన్నా! ఓ భీమన్నా! రా! బయటికి రా! తొందరగా రా! ఎవరో శోషవచ్చి నీయింటి ముందు పడి ఉన్నాడు. చూడు. అతడు నీపేరే పలవరిస్తున్నాడు.

*(భీమన ఇంటిలోపలి నుండి బయటికి వచ్చును)*



## 13వ రంగము

*(భీమన్న తన యింటి గుమ్మం ముందుకు వస్తాడు. చింకిపాతలతో మట్టి గొట్టుకు పోయి ఉన్న ఒక వ్యక్తి గుమ్మం ముందు పడి ఉంటాడు... అతనిని చూస్తూ...)*

**భీమన్న** : భగవాన్! వేంకటేశా! ... తమాలినీ! ఈయనెవరో తెలివి తప్పిపోయి మనింటి ముందు పడ్డాడు! చెంబుతో నీళ్ళు తీసుకురా!

*(తమాలిని నీరు తెచ్చును. భీమన్న ఆవ్యక్తి మీద నీరు చల్లును కాస్సేపటికి భీమన్న నీరు త్రాగిస్తాడు. అతడు కోలుకోగానే...)*

ఎవరు స్వామీ మీరు! ఇక్కడికి ఎలా వచ్చారు? ఏడుకొండలస్వామి వారి దర్శనం కోసం కాలినడకన యాత్ర చేస్తూ వచ్చారా? ఒంటరిగా వచ్చారా?... ఏమడిగినా ఉలకరూ పలకరేం?

*(అవ్యక్తి పిచ్చి చూపులు చూస్తుంటాడు. భీమన్న భుజాల మీద చేతులు వేయగానే ఉలిక్కిపడుతాడు. దిక్కులు చూస్తూ....)*

**అతడు** : ఇది కుర్వ గ్రామమేనా?

**తమాలిని** : ఔను. కుర్వగ్రామమే యిది.

**అతడు** : అయితే శ్రీవేంకటేశ్వరస్వామి వారి పరమ భక్తుడు భీమన్న ఈ పల్లెలోనే కదా నివాసముండేది?

**భీమన్న** : స్వామివారి పరమ భక్తుడవునో కాదో కానీ కుమ్మరి భీమన్న అనే వాడీ పల్లెలోనే ఉన్నాడు.

**అతడు** : అతడే! కులాలుడయిన ఆభీమన్నను గురించే... నేనడిగేది.

**భీమన్న** : మీ కతనితో పనేమిటి స్వామీ! అతని గురించి ఎందుకడుగుతున్నారు?

**అతడు** : భీమన్న తిరుమల వాసునికి ప్రియమైన భక్తుడు. సర్వలోకాలూ ఆరాధించే శ్రీనివాసునే మెప్పించిన ఘనుడాతడు. నేనా భీమన్న

దగ్గరికిపోయి అతని పాదాలకు నమస్కరించాలి. తొందరగా చెప్పండి. అతని యిల్లేదో చూపించండి.

**భీమన్న** : కుండలు చేసి అమ్ముకొని జీవనం గడిపే ఒక పేదకుమ్మరి పాదాలకు మీరు నమస్కరించడమా? చాలా విడ్డూరంగా మాట్లాడుతున్నావు! నీవెవరవో చెప్పుముందు.

**అతడు** : దయచేసి నాకు ఆ భీమన్న ఇల్లేదో చూపించు ముందు. ఆ తర్వాత చెపుతాను.

**భీమన్న** : నేనే కుమ్మరి భీమన్నను, నీవున్నది నాయింటిముందే.

**అతడు** : (భీమన్న కాళ్ళు తాకుతాడు. భీమన్న వారిస్తూ వెనుకకు జరిగి) అయ్యో! అయ్యయ్యో! మీరు నాకంటె పెద్దవారుగా ఉన్నారు. పెద్దవారు పిన్నవారి కాళ్ళు పట్టుకోవచ్చా! నీవెవరివో ఇప్పటికయినా చెప్పవా?

**అతడు** : నేనెవరినైతే నేమి? శ్రీవేంకటేశ్వరస్వామి పరమ భక్తుడివి నీవు. ఆయన ప్రేమాభిమానాలను అపారంగా పొందినవాడివి. నీపాద రేణువు నాశిరస్సును తాకితే చాలు నాకు పాపప్రక్షాళన జరుగుతుంది. అప్పుడే స్వామివారి కృపా దృష్టి నాపై బడుతుంది.

**భీమన్న** : అయ్యా! నేనూ , నాభార్య ఒక చిన్నగుడిసెలో స్వామివారిని ప్రతిష్ఠించుకొని పూజ చేసుకొంటున్నాము. మేము సాధారణ మనుషులకంటే క్రింది వారమే. కోటాను కోట్ల ప్రజలూ, ముక్కోటి దేవతలూ శ్రీనివాసుని కొలుస్తూ ఉంటారు. వారిలో నేనేపాటి? మహాసముద్రంలో నీటి బిందువుతో సమానుణ్ణికూడా కాను. నన్ను, అలాంటి నన్ను, శ్రీవేంకటేశ్వరస్వామి పరమభక్తుడనీ, ఆయన ప్రేమాభిమానాలు అపారంగా పొందిన వాడనని ఎలా భావిస్తున్నారు?

**అతడు** : నీ భక్తి మహాత్మ్య ఏమిటో నీకు తెలియదు భీమన్న! స్వామి వారే నీకు దాసుడై సేవలు చేస్తున్నాడు.

భీమన్న : స్వామి వారు నాకు దాసుడా? నీకు పిచ్చి పట్టింది.

అతడు : నీవు అమాయకుడివి భీమన్నా! శ్రీనివాసుని పూజించుకోవడం, జీవనం కోసం కుండలు చేసుకోవడం తప్ప నీకేమీ తెలియదు.

భీమన్న : అయ్యో! నీవు చెప్పే దేమిటో నాకర్థం కావడం లేదు. స్వామి వారి పాదరేణువు కూడా సోకనంత దూరంలో ఉన్న నన్ను చూచి నీకు ఎగతాళిగా ఉందా? మాటవరుసకైనా ఇలాంటి మాట అనడం మహాపాపం.

అతడు : భీమన్నా! భక్తికి తోడు వినయ విధేయతులు కూడా పూవుకుతావి అబ్బినట్లు నీలో నిండుగా అమరి ఉన్నాయి.

భీమన్న : తమాలినీ! ఎండన పడి వచ్చినట్లున్నాడీయన. ప్రకోపించిందేమో! ఏమేమో పలవరిస్తున్నాడు. (అతడివైపు తిరిగి) లేవగలరా? ఇంటిముందున్న అరుగుమీద కాస్సేపు కూర్చొందురుగాని! లేకపోతే నన్ను లేపమంటారా!

అతడు : (లేవబోతూ తూలుతాడు. భీమన్న పట్టుకొని అరుగుపై కూర్చోబెడుతాడు) భీమన్నా! నీ స్పర్శతో నాలో నూతన శక్తి వచ్చి చేరినట్లయింది. నా కిక్కడే ఉండిపోవాలని కూడా అనిపిస్తోంది.

భీమన్న : స్వామీ! మీకు ఉండాలనిపించి నన్నాళ్ళు ఉండండి. మాతోపాటు వేంకటేశ్వరస్వామిని కొలుచుకొంటూ ఉండవచ్చు. మీరేమీ పని చేయనక్కర లేదు.

తమాలిని : ఇంతవయసులో నీవేం పనిచేయనక్కలేదు. మాతోపాటు కలిసి ఉండు. మాకో పెద్దదిక్కుగా మంచి చెద్దలు చెపుతూ ఉండు చాలు.

అతడు : మీ యిద్దరి అభిమానాలకు తట్టుకోలేకుండా ఉన్నాను. మాధవుని పట్ల మీకున్న అభిమానం మానవుల పట్ల కూడా చూపుతున్నారు మీదంపతులు.

భీమన్న : అంత పెద్దమాటలు ఎందుకు స్వామీ! ఇంతకూ మీరెవరో ఇంతవరూ చెప్పనేలేదు.

**అతడు** : నేనెవరో చెప్పగానే యింతటి అభిమానం నాపై చూపిస్తారా?

**భీమన్న** : అదేమిటి స్వామి! మీరెవరయినా దానితో మా కవసరంలేదు.

**తమాలిని** : ఏడుకొండల స్వామి తర్వాతే ఎవరైనా మాకు. అయితే మేము మనుషులందరూ ఒకటే అని అనుకుంటాము.

**అతడు** : అవునుతల్లీ! మాధవుని పైభక్తి, మానవులపై శద్ధా చూపే గొప్పదంపతులు మీరు.

**తమాలిని** : ఇంతకూ నీవెవరో చెప్పకూడ దనుకున్నావా?

**అతడు** : చెప్పకూడదని కాదు తల్లీ! చెప్పడానికి బిడియం, అభిమానం అడ్డు వస్తున్నాయి.

**తమాలిని** : అయితే ఇప్పుడు చెప్పవద్దులే. నీకిష్టమొచ్చినప్పుడు చెప్పాలను కుంటే చెప్పు.

**అతడు** : ఇప్పుడే చెపుతానమ్మా! నేను తొండమానుడిని

**భీమన్న** : ఏ ఊరుమీది?

**అతడు** : తొండమానుడు అనే పేరు నీవెప్పుడూ వినలేదా?

**భీమన్న** : విన్నాను స్వామీ! అయితే ఆయన ఈ దేశం అంటే తుండీరమండలాన్ని పరిపాలించే వారు, తొండమాను చక్రవర్తి.

**తమాలిని** : చక్రవర్తి పేరుతో ఉన్న నీవు ఎక్కడి నుండి వచ్చావు?

**అతడు** : (నవ్వుచు) మీరెంత అమాయకులు. నేనే ఆ చక్రవర్తి తొండమానుడిని.

**భీమన్న** : తొండమాను చక్రవర్తే ఈ పేదవానిని వెతుక్కుంటూ వచ్చారా!

**తమాలిని** : దుమ్ముకొట్టుకు పోయిన దుస్తులతో, మురికి పట్టిన దేహంతో యిలా ఒక అనాథలా ఈ దేశ చక్రవర్తి మాగుడిసెకు రావడం ఎంత ఆశ్చర్యం! ఇది నిజమేనా!

తొండమానుడు : నిజమేనమ్మా!

భీమన్న : మహారాజా! మీ రాజభటులేరీ! మీ పరివారమేదీ! ఒంటరిగా వచ్చారా! వస్తే ఇలా భిక్షగాడిలా వచ్చి మాయింటి ముందు పడిపోవడమేమిటి! మేమిచ్చిన నీరు త్రాగడమేమిటీ! నాకేమీ అర్థం కావడం లేదు ప్రభూ!

తొండమానుడు : భీమన్నా! అదంతా దైవలీల! అశ్రీనివాసుని లీల! నేను నారాజవైభవాలను వదలివేశాను. నాకెలాంటి పరివారమూ లేదు. నేనిప్పుడు ఒంటరి వాడిని. నేను చక్రవర్తిని కాను. వేంకటేశ్వరుడే నాకు మార్గదర్శి. స్వామి వారు చూపిన దారివెంటే నేను నడుస్తాను. స్వామి వారి పరమ భక్తులయిన మీరే నాకు గురువులు.

భీమన్న : మహారాజా! సర్వసంగ పరిత్యాగులయ్యారా!

తొండమానుడు : ఒక విధంగా అంతే భీమన్నా! సర్వసంగ పరిత్యాగులు తిండి నిద్ర సుఖాల నెరుగరుకదా! నేనూ వాటిని గురించి ఆలోచించడం మరిచాను. నాకిప్పుడు శ్రీనివాసుడూ, స్వామివారి ప్రియభక్తులైన మీరూ మోక్ష ప్రదాతలు!

తమాలిని : మహారాజా! మేము అనుచితంగా ప్రవర్తించి ఉంటే మన్నించండి. మీ మాటలను బట్టి మీరు మాతో కలసిపోయి ఏడుకొండల స్వామిని తలుచు కుంటామన్నారు. మాకంతకంటే కావలసిందేముంది?

తొండమానుడు : అమ్మా నాకు ఆకలి అవుతోంది. నేను భోంచేసి ఎన్నిదినాలైందో కూడా గుర్తు లేదు.

భీమన్న : ఇంటిలోనికి పోదాం పదండి. (లోపలికి పోదురు)



## 14వ రంగం

*(భీమన్న ఇంటి లోపలి భాగం)*

**భీమన్న** : తమాలినీ! మహారాజులు తినడానికేమైనా తీసుకురా!

**తొండమానుడు** : భీమన్నా! నేను మీతోపాటు ఉండేవాడిని. కాబట్టి నన్ను మీలో ఒకడిగానే భావించండి. ఇకనుండి నన్ను 'మహారాజా' అని పిలిచి మీ నుండి దూరం చేయకండి. నిజానికి నేను భక్తి తత్పరతలో మీకంటే అధముణ్ణి.. సరే. మీకు బాధకలిగస్తే మన్నించండి.

**తమాలిని** : *(భీమన్న వైపు చూస్తూ)* స్వామీ ఈరోజు మనము చేసుకున్న... ఉదయ భోజనం అంబలి ఉంది. మధ్యాహ్న భోజనం చేయడానికి కొంత ఆలస్య మౌతుంది.

**తొండమానుడు** : అమ్మా తమాలినీ! నాకిప్పుడు ఆ అంబలే తీసుకురా తల్లీ! మీఇంటి అంబలి అయినా అది నాకు పరమాన్నంతో సమానం.

**తమాలిని** : *(మట్టి పాత్రల్లో అంబలి తెచ్చియిచ్చును)*

**తొండమానుడు** : *(ఒక ముంత తీసుకొని)* భీమన్నా! నీవూ తీసుకో.

**భీమన్న** : మీరు త్రాగండి. నేను తర్వాత త్రాగుతాను.

**తమాలిని** : స్వామీ! మీరు త్రాగండి. ఇంకా ఉందిలే.

**భీమన్న** : మన మిద్దరం తర్వాత తీసుకుందాం తమాలినీ. చక్రవర్తిని త్రాగనీయ్ ముందు.

**తొండమానుడు** : భీమన్నా! తమాలినీ! మీరిద్దరు కూడా నాతోపాటు తీసుకుంటేగానీ నేను తీసుకోను.

**భీమన్న** : మహారాజా!

**తొండమానుడు** : అలా పిలవొద్దని చెప్పానుగా భీమన్నా! తిరిగి...

భీమన్న : మీరు పెద్దలు. పెద్దలను పేరుతో పిలువడం తప్పుకదా!

తమాలిని : మహారాజా అని మిమ్మల్ని పిలువరాదు. పెద్దలు కాబట్టి పేరుతోనూ పిలువరాదు. మరెట్లా పిలవాలో మాకర్థం కావడంలేదు.

తొండమానుడు : ఎలా మీరు పలుకరించినా పరవాలేదు. మీ యిష్టం.

తమాలిని : మాకేమీ తోచడం లేదు మహానుభావా!

భీమన్న : అనుకోకుండానే నీవు సంబోధించావే అలాగే పిలుద్దాం.

తమాలిని : మహానుభావా! మొదట మీ ఆకలి తీర్చుకోండి. ఆహారం తీసుకొని ఎన్నాళ్ళయిందో! మేము రాత్రి సుష్టుగా భోంచేశాము. మేము ఆకలికి తట్టుకోగలము.

భీమన్న : ఔను మహానుభావా! ఆహారం తీసుకోకనే కదా మీరు శోషవచ్చి పడిపోయారు? ముందు మీరు కానీయండి.

తొండమానుడు : భీమన్నా! తమాలినీ! మీరెన్నయినా చెప్పండి. నాతోపాటు మీరు కూడా ఆహారం తీసుకొన్నప్పుడే నేనూ తీసుకుంటాను. లేకపోతే ఇలాగే ఉంటాను.

భీమన్న : తమాలినీ! నాకో ముంత యివ్వు! నీవో ముంత తీసుకురా. ఇక్కడే ముగ్గురమూ తాగుదాము.

*(ముగ్గురు త్రాగుదురు).*

తొండమానుడు : తల్లీ! తమాలినీ! అంబలి అయినా నీచేతి వంట అమృతంలా ఉంది.

భీమన్న : మరికొంత తీసుకో మహానుభావా!

తొండమానుడు : వద్దు. నా కడుపు నిండిపోయింది. మీరింకా త్రాగడం పూర్తి చేయలేదు.

తమాలిని : ఇదో అయిపోయింది. మహానుభావా!
*(ముగ్గురు చేతులు కడుగుకొని నీరు త్రాగుతారు)*

తొండమానుడు : అమ్మా తమాలినీ! ఏడుకొండల స్వామిగురించి నీవు ఏదైనా ఒక కీర్తన పాడుతావా?

భీమన్న : ఇది మంచి సమయమే తమాలినీ! నీకు తెలిసిన పాసురాలు చాలా ఉన్నాయిగా! ఒకటి పాడి వినిపించు.

తమాలిని : సర్లే... పల్లాండు! పల్లాండు పత్తాయి రత్తాండు

పలకోడి నూఱాయిరమ్

మల్లాండ తిణ్‌తోళ్ మణివండా, ఉన్

శేవడి శెవ్వితిరాక్కాపు.

(-పెరియాళ్వారు - తిరుప్పల్లాండి పాశురము)

తొండమానుడు : దీని భావమేమిటో కూడా చెప్పమ్మా తమాలినీ!

తమాలిని : స్వామీ! ఎన్నో సంవత్సరాలు, వేలకోట్ల సంవత్సరాలు నీకు అన్ని రకాల మంగళములు కలుగుగాక! కాలతత్వం ఉన్నంత వరకూ నీవు జయశీలుడవు. చాణూర ముష్టికులు అనే మల్లుల గర్వం అణచిన దివ్య బాహువులకు, నీలమణుల వంటి కాంతి కలవానికి తామరలవలె మనోజ్ఞమైన పాదాల అపూర్వ సౌందర్యానికి ఆచంద్ర తారార్కము అకాంతి నిలిచి ఉండుగాక!

తొండమానుడు : నీలమణి కాంతులతో వెలగిపోయే స్వామివారి శరీరము, చాణూర ముష్టిక మల్లులను అణగద్రొక్కి విజయాన్ని పొందిన స్వామివారి ఆజాను బాహువులూ, ఎఱ్ఱతామరల వంటి పాదాలూ ఇవన్నీ ఎల్లకాలమూ వెలుగుతుండుగాక! అని ఎంతగొప్పగా మంగళాశాసన పాశురాన్ని శ్రీ పెరియాళ్వారు కవి చెప్పాడు? నీవు ఎంత అద్భుతంగా మధురాతి మధురంగా ఈ పాశురాన్ని పాడావు తల్లీ!

తమాలిని : నాకంతగా భాష తెలియదు మహానుభావా! అరవదేశం నుండి ఇటుగా వచ్చే తిరుమల యాత్రికులు పాడుతూ ఉండగా నేర్చుకున్నాను.

భీమన్న : మహానుభావా! ఇంకా చాలా వచ్చు పాశురాలు, కీర్తనలు తమాలినికి! అప్పుడప్పుడూ ఏమిటి, ప్రతిరోజూ ఏదో ఒక సమయాన వానిని పాడుతూ ఉంటుంది.

తమాలిని : మహానుభావా! నన్ను ఆకాశాని కెత్తేస్తున్నారు మా ఆయన విశేషమూ, విశిష్టమూ అయిన రీతిలో శ్రీవేంకటేశ్వర స్వామి వారిపైన స్వంతంగా కొన్ని స్తోత్రాలు రచించారు.

తొండమానుడు : భీమన్నా! నీవు స్వామివారిని ఎలా స్తుతిస్తావో, నీ మాటల్లో స్వామివారి రూపమెలా ఉంటుందో ఒకసారి వినిపించు.

భీమన్న : చెపుతాను. స్వామివారిని గురించి ఎంత చెప్పినా నాకైతే తనివే తీరదు. అందులోని భావమేమిటో వినండి.

స్వామీ! శ్రీనివాసా! వైకుంఠము నీ నివాసము. సముద్రరాజ పుత్రిక లక్ష్మి నీ పట్టమహిషి, సృష్టికర్త బ్రహ్మ నీ నాభినుండి జన్మించాడు. పాపాలను హరించే గంగ నీకాళ్ళ నుండి పుట్టింది, వేయి పడగల ఆదిశేషువు నీకు శయ్య, మహాబలవంతుడైన గరుత్మంతుడు నీకు వాహనము స్వామీ! ఆకాశంలోని తారకలు నీ దంతాలు, నీమేని కాంతి విద్యుత్ మండలము, సూర్యుడు చంద్రుడు నీకు రెండు కళ్ళు అయ్యాయి. నేను కుమ్మరి వాడిని. ఎంతో గొప్ప దేవుడవైన నీకు నేను ఎలా పూజ చేతును!

తొండమానుడు : భీమన్నా! నీవు కులాలుడవైతేనేమి? సృష్టికర్త బ్రహ్మప్రాణుల బొమ్మలు చేసి ప్రాణాలు పోస్తాడు. నీవు మట్టితో ఎన్నో రకాల బొమ్మలు చేసి జీవకళలు ఉట్టిపడేటట్లు చేస్తున్నావు కాబట్టి నీవూ సృష్టికర్తతో సమానుడవు.

భీమన్న : మహానుభావా! నన్ను బ్రహ్మతో పోల్చవద్దు. ఇలాంటి స్తుతులు నాకు నచ్చవు.

తొండమానుడు : నాలో చెలరేగిన భావాలను అణచుకోలేక పోవడంతో బయటకు వచ్చాయా మాటలు భీమన్నా! క్షంతవ్యుణ్ణి.

భీమన్న : క్షమించదగినంత తప్పుకాదులే మహానుభావా! అది సరే. నీవు స్వామివారిని ఎలా స్తుతించావో చెపుతావా!

తొండమానుడు : చెపుతాను భీమన్నా! నా దృష్టిలో, నా భావనలో శ్రీవేంకటేశ్వరుడిలా ఉంటాడు.

స్వామీ! నీవు సర్వలోకాలకూ, దేవతలందరికీ, యోగ్యులైనవారికీ ప్రభువువు. సృష్టి స్థితిలయలకు మూల భూతుడవు. వేద వేద్యుడవు, అనంత మూర్తివి అయిన నీకు నా నమస్కారములు. గోవిందా! నీవు పురాణ పురుషులలో ఉత్తముడవు. అప్రాకృత శరీరుడవు లీలామానుష విగ్రహుడవు. నీకు నా నమస్కారములు.

భీమన్న : మహానుభావా! స్వామివారిని పురాణేతిహాసాలలో ఎలా వర్ణించారో అంత గొప్పగానూ స్తుతించారు మీరు.

తొండమానుడు : నీ భావావేశంలో ఒక ప్రత్యేకత ఉంది. విశిష్టత ఉంది. వినూత్న రీతిలో వేంకటేశ్వరస్వామి నీ మనస్సులో నెలకొన్నాడు. విశ్వాన్ని అంతా స్వామివారి శరీరాంగాలతో పోల్చడం నీ విశాల భావాలను తెలుపుతోంది భీమన్నా.

భీమన్న : మహానుభావా! విశ్వమంతా స్వామివారిలో ఇమిడి ఉంది. శ్రీనివాస స్వామికి సాటి అయిన దేవుడు ఎక్కడా లేడు. ఉండడు ఉండబోడు కూడా! అసమాన దేవుడు ఆదిశేషశయనుడు శేషాద్రివాసుడు.

తొండమానుడు : ఇంతటి భక్తుడవు కాబట్టే స్వామివారు నీపట్ల అపార ప్రేమాభిమానాలను చూపుతున్నాడు భీమన్నా!

భీమన్న : అదంతా స్వామివారి కృపాకటాక్షమే.

తమాలిని : ఇన్నిన్ని మాటలు మాకు తెలియకపోయినా స్వామివారిని తెలిసీ తెలియక పూజించుకోవడ మొక్కటే మాకు తెలిసింది మహానుభావా!

భీమన్న : మహానుభావా! నీ ఈస్థితికి రావడానికి కారణమేమిటో తెలుపలేదు.

తొండమానుడు : చెపుతాను భీమన్నా!

నా అలక్ష్యం వల్ల కూర్మాచార్యులు అనే బ్రాహ్మణుడి భార్యాపిల్లల మరణానికి కారకుడి నయ్యాను. ఆ పాపపరిహారార్థం అర్ధరాత్రి స్వామివారి ఏకాంతానికి భంగం కలిగించాను. అయినా నాకు ప్రత్యక్ష దర్శనమిచ్చే స్వామివారు ఆ బ్రాహ్మణీ బిడ్డలనూ బ్రతికించారు. నా మీద బంధుత్వ ప్రేమతో అయితే ఆ రోజు నుండి స్వామివారి దర్శనం కాలేదు నాకు.

తమాలిని : తర్వాతేం చేశారు మీరు?

తొండమానుడు : అంగిరస మహర్షిని స్వామివారి దర్శనం కోసం నేనేం చేయాలి అని అడిగాను. అందుకాయన స్వర్ణపుష్పాలతో శ్రీవేంకటేశ్వర సహస్ర నామార్చన కొన్నాళ్ళ పాటు ఆపకుండా చేయమన్నారు. ఆయన చెప్పినట్లే నేను సుమారు నూరు రోజులు చేశాను. కానీ ఫలితం కలుగలేదు.

భీమన్న : స్వామివారు శాంత స్వరూపుడేకాదు సహిష్ణువుకూడా. మీ స్వర్ణపుష్ప సహస్ర నామార్చన ఫలించలేదంటే అందుకు అదొక్కటే కారణమై ఉండదనిపిస్తోంది.

తొండమానుడు : నాకిప్పుడర్థమవుతోంది భీమన్నా! ఒక్కో సంఘటనా తలచుకొంటూ ఉంటే నాకర్థమౌతోంది. నేనెంత గర్విష్ఠినో నిన్ను చూచినాక, మీ ఇద్దరితో మాటాడినాక గానీ నాకు స్పష్టంగా ఈ విషయం అర్థంకాకపోయింది. నా గర్వమే నన్నీస్థితికి తీసుకు వచ్చింది. నేను చక్రవర్తిననీ, స్వామివారి బంధువుననీ, నాకా ప్రత్యేకత ఎన్నో విధాలుగా కలిగిందనీ కాబట్టి స్వామి భక్తులందరికన్నా నేనే శ్రేష్ఠుడననీ, అందువల్ల స్వామివారు అధికాధికంగా నన్నే ఆదరించాలనీ, అది శ్రీనివాసుని యొక్క ధర్మం, విధీ అని నేను అహంకారంతో భావిస్తూ వచ్చాను. అదే విధంగా నడచుకొంటూ వచ్చాను.

భీమన్న : వేంకటేశ్వరస్వామి వారికి సర్వులూ ఒక్కటే. లోకంలోని ప్రాణులన్నింటికీ జీవనాధారమూ, కల్మషహారిణీ అయిన గంగ అందరిపట్ల తరతమ భేదాలు లేకుండా ఎలా వ్యవహరిస్తుందో చూడు. అలాంటి గంగకు జన్మనిచ్చిన స్వామివారు ఏ విధంగా నడచుకొంటారు? ఆలోచించండి మహానుభావా!

తమాలిని : సాగరం వంటి సహనం కలవాడు శ్రీనివాసుడు. సాగరకన్య అయిన లక్ష్మీదేవిని అపురూపంగా తన వక్షస్థలాన నిలుపుకొన్న వాడు.

భీమన్న : నిన్ను బ్రహ్మహత్యా పాతకం నుండి కాపాడడానికి తానే బ్రహ్మయై కూర్మాచార్యుల భార్యాబిడ్డలను పునర్జీవితులను చేశాడు.

తొండమానుడు : బ్రహ్మకు సృష్టి చేయడమూ, నుదిటిపై వ్రాత వ్రాయడమూ మాత్రమే తెలును. నుదుటి వ్రాతను మార్చడం బ్రహ్మవల్ల కాదు. అది బ్రహ్మజన్మకు కారకుడైన స్వామివారి వల్లనే సాధ్యమవుతుంది.

భీమన్న : మహానుభావా! మీ మీద స్వామివారికి ఆగ్రహం కలగడానికి కారణమేమిటో మీ యంతట మీరే నిర్ణయించుకోవలసి ఉంది.

తొండమానుడు : ఔను, భీమన్నా! ఆ విషయం నేను గ్రహించడానికి ఇంత కాలం పట్టింది. అదీ మీ వద్దకు రావడం వల్లనే అవగతమయింది. మీ రిద్దరూ పుణ్యదంపతులు స్వామివారి కృపాపాత్రులు. స్వామివారు కులమత తరతమ భేదరహితుడు అనడానికి మీరే ప్రత్యక్ష నిదర్శనం.

తమాలిని : మహానుభావా! మీరు చేస్తుండిన బంగారు పూలపూజ విషయం ఏమయింది?

తొండమానుడు : బంగారు పూలు చేయడానికి కోశాగారంలోని బంగారమూ, ధనమూ చాల లేదు తమాలినీ! అంతేకాదు నేను రోజూ చేసే బంగారు పూలపూజలో మట్టిపూలు వచ్చి చేరసాగాయి. అలా మట్టిపూలు చేరడం వెనుక రాజకీయ కుట్ర ఉందని నా కుమారుడు శ్రీనివాస యువరాజూ, సేనాధిపతీ భావించారు.

తమాలిని : మేము మట్టిపూలతోనే పూజలు చేస్తాము స్వామివారికి, అలా మట్టిపూలతో పూజలు చేయుమని సూచనలిచ్చింది స్వామివారే.

తొండమానుడు : నా కొడుకు శ్రీనివాసుడూ సేనాపతీ మీపైన మీ దాసుడయిన శ్రీపతి మీద సందేహపడ్డారు. అందుకోసం వేయిమంది సైనికులను మీ చుట్టూ నిఘావేయించారు. మీకు శిక్షలాంటి పరీక్ష పెట్టారు. కానీ వారే పరాభవం

పొందారు. అయితే ఆ సంగతి వారింకా తెలుసుకోలేదు. నాకు అర్థమైన తర్వాత నా మనసు విచలితమై పోయింది. పిచ్చివాడిలాగ దేశమంతా తిరిగి మీ వద్దకు వచ్చాను.

**భీమన్న** : అదేమిటి? అలా అంటున్నారు?

**తొండమానుడు** : భీమన్నా! స్వామివారి లీలలు అంత సులభంగా అందరికీ అర్థంకావు. నీవు స్వామివారి చైదములలోని అంతరార్థాన్ని గ్రహించడం లేదు. స్వామివారి మీద విశ్వాస మొక్కటే నీకు తెలుసు. మరేదీ తెలియదు అన్న విషయం నాకిపుడు అర్థమవుతోంది. అదటుండనీయ్... ఇప్పుడు నాకు నిద్ర ముంచుకొస్తోంది.

**తమాలిని** : ఇంటిముందు వసారా అరుగుమీద పడుకొంటారా? ఇంటిలోపల చాపవేసేదా?

**తొండమానుడు** : అమ్మా తమాలినీ! నాకు ఇంటిలోపలే పడుకోవాలని పిస్తోంది. మీ పూజా స్థలంలో పడుకోవచ్చా?

**భీమన్న** : స్వామివారితో చాలా కాలం కలిసి తిరిగిన మీరు, స్వామివారి పూజా స్థలంలో పడుకోవడానికి అభ్యంతర మేమిటి మహానుభావా?

**తొండమానుడు** : స్వామివారి దారుప్రతిమకు ఎదురుగా, ఆయననే చూస్తూ పడుకొంటాను. (ఆవులిస్తూ) ఇదేమిటి నాకింతగా నిద్రముంచు కొస్తోంది?

**తమాలిని** : చాలా రోజులుగా పస్తు ఉండేవారు. ఇప్పడే కడుపుకింత ఆదరువు పడడంవల్ల నిద్రవస్తున్నట్లుంది మీకు. చాపవేస్తాను పడుకోండి మహానుభావా!

**భీమన్న** : (తమాలిని తెచ్చియిచ్చిన చాప వేస్తూ...) పడుకోండి. ప్రశాంత చిత్తంలో నిదురపోండి. *(పడుకున్న వెంటనే తొండమానుడు గాఢ నిదురలోకి జారిపోతాడు)*



## 15వ రంగము

(తొండమానుడు నిదురలో ఉండగా తమాలినీ, భీమన్నా మెల్లగా మాటాడుకుంటూ ఉంటారు)

**తమాలిని** : స్వామీ! మీకా రోజు వేంకటేశ్వరస్వామి కలలో కనిపించి చెప్పిన మాటలు గుర్తున్నాయి కదా!

**భీమన్న** : తమాలినీ! ఆ కలను నేనెలా మరచి పోగలను! స్వామివారి దర్శనం కావడం, కలలో వారు చెప్పిన మాటలు... ఓహ్! ఎంత ఆశ్చర్యకరం!

**తమాలిని** : స్వామివారు కలలో మీకు చెప్పిన మాటలు వాస్తవం అవటానికి అప్పటికప్పుడే ఎన్నెన్నో నిదర్శనాలు చూపించారు. ఇక ఇప్పుడు...

**భీమన్న** : ఔను తమాలినీ! పరమాద్భుతమైన సంఘటనే జరిగిందిప్పుడు స్వామివారు నాకానాడు కలలో కనిపించి చెప్పిన మాటలు... "తొండమాన్ చక్రవర్తి మీ ఇంటి ముందుకు వస్తాడు" అని

**తమాలిని** : అలాగే స్వామివారు తెలిపినట్లే చక్రవర్తి మన ఇంటికే వచ్చారు. అదీ దీనాతి దీనంగా వచ్చి మనయింటిలోపల ప్రస్తుతం నిద్రిస్తున్నాడు కూడా.

**భీమన్న** : స్వామివారి లీలలు ఎవరూ ఊహించలేని రీతిలో అత్యద్భుతాలయి ఉంటాయి. స్వామివారు ఎప్పుడెవరి మీద తన ప్రేమామృతాన్ని చిలుకరిస్తాడో, ఎప్పుడు తన సమీప బంధువులనైనా నిర్లక్ష్యంగా చూస్తాడో ఎవరికీ అర్థం కాదు. అదెవరికీ సాధ్యం కూడా కాదు.

**తమాలిని** : ఔను! స్వామివారికి ఎప్పుడు ఎవరిని ఎలా చూడాలో బాగా తెలుసు. అయితే నాకో చిన్న సందేహం కలుగుతోంది?

**భీమన్న** : సందేహమా? ఏమిటది?

**తమాలిని** : స్వామివారు మీకు కలలో కనిపించి చెప్పిన మాటలు ఇంకా ఉన్నాయి. తొండమాన్ చక్రవర్తి అనాధలా మనయింటికి వచ్చిన తర్వాత ఏం జరుగుతుందని చెప్పాడు? అది జరిగేదేనా? అంతటి అదృష్టం మనకు దక్కుతుందా!

**భీమన్న** : ఔను తమాలినీ! నాకూ ఆ సందేహం ఉంది! దేవతలకు కానీ వేల సంవత్సరాలు తపస్సు చేసిన మహామునులకు కానీ 'బొందితో వైకుంఠం' కలిగే భాగ్యం ప్రాప్తించలేదే!

(ఇంతలో బయటి నుండి అలికిడి వినిపిస్తుంది)

శ్రీపతి : అమ్మా! తమాలినీ! (అంటూ లోపలికి వస్తాడు. భార్యాభర్తలిద్దరూ ఒకరి ముఖాలొకరు చూచుకుంటారు. అప్పుడు భీమన్నను ఉద్దేశించి.)

ఈ రోజు కుండలు చేయటానికి కావలసిన మట్టిని తీసుకు రావలసిన అవసరం ఉందా భీమన్నా?

(భీమన్న తేరుకొని...)

భీమన్న : వద్దు స్వామీ! నిన్న తెచ్చిన మన్నే ఉందిగా ఈ రోజు ఏమీ పని లేదులే.

తమాలిని : స్నానాదులు ముగించుకొని వచ్చావా! అయితే లోపలికి రా ఏదైనా తిందువుగానీ.

శ్రీపతి : నాకూ ఆకలవుతోందమ్మా! చెరువులో స్నానం చేసివచ్చాను. వీధిలో నడచి రావడం వల్ల కాళ్లకు దుమ్ము అంటుకొంది. పెరట్లోకి పోయి కడుక్కొని వస్తాను.

తమాలిని : సరే. త్వరగారా.

(శ్రీపతి పోవును)

తొండమానుడు : ఇతడెవరు భీమన్నా!

భీమన్న : మా కుటుంబానికి సన్నిహితుడు, అప్తుడు.

తొండమానుడు : ఎప్పటి నుండి!

తమాలిని : ఆయన వచ్చింది ఈ మధ్యనే మహానుభావా! చెప్పకుండానే పనులన్నీ చక చకా చేసుకుపోతుంటాడు. నిజం చెప్పాలంటే ఆయన నా సోదరుని కంటే తండ్రికంటే ఎక్కువగా మమ్మల్ని చూచుకొంటూ ఉంటాడు.

భీమన్న : మట్టితో బొమ్మలను ఎంత అద్భుతంగా చేస్తాడనుకున్నావు? ఆ బొమ్మల్లో జీవకళ ఉట్టిపడుతూ ఉంటుంది.

తొండమానుడు : కొన్ని బొమ్మలు చూపమ్మా తమాలినీ!

(తమాలిని లోపలికి పోవును)

భీమన్నా! అతడు ఎలాంటి పరిస్థితిలో మీ ఇంటికి వచ్చాడో అన్నీ వివరంగా చెప్పగలవా?

భీమన్న : చెపుతాను మహానుభావా!

తొండమానుడు : ఒక్కటీ వదలకుండా అన్నీ వివరంగా చెప్పాలిమరి.

భీమన్న : ఒకనాటి ఉదయాననే మాఇల్లు వెదుక్కుంటూ వచ్చాడాయన. వచ్చీరాగానే తనకు మాయింటిలో పని పురమాయించుమన్నాడు. మా పేదతనాన్ని గురించి చెప్పాము. "మీరేది తింటే అదే పెట్టండి మీరు చెప్పిన పనులన్నీ చేస్తాను" అన్నాడు. ఆ మాటలతో నేనేమీ బదులాడ లేక పోయాను. నా భార్య తమాలిని అతడిని తన సొంత సోదరుడు రాకరాక ఇంటికి వచ్చినట్లు ఆహ్వానించింది. అప్పటి నుండి అతడు మా కుటుంబంలో ఒకడయ్యాడు. శ్రీపతి వచ్చినప్పటి నుండి నాకు ఇల్లు విడిచి బయటి ప్రాంతాలకు పోయే పని తప్పింది. అతడు రోజూ ఉదయం పూట చెరువు వద్ద నుండి కుండలు చేయడానికి కావలసిన మట్టిని జల్లెడపట్టుకొని తీసుకువస్తాడు. గుడిసె ముందు ఆ మన్నుపోసి, తగిన పాళ్ళలో నీళ్ళుపోసి కాళ్ళతోతొక్కి, మెత్తగా పిసికి నాచేతి కందిస్తాడు. 'సారె' వద్ద ఉండే నేను ఆ మట్టితో మొదట తులసి దళాలను పూలను చేస్తాను. తరువాత కుండలూ, మూకుళ్ళు మొదలైన వాటిని చేస్తాను. అక్కడితో నా పని అయిపోతుంది. తర్వాత శ్రీపతి తిరిగి తాను తెచ్చుకున్న మట్టితో రకరకాల బొమ్మలు తీరుస్తాడు. ఆ తర్వాత ఆ బొమ్మలకు రంగులు పూసి అమ్మకానికి పెడతాడు. వాస్తవానికి శ్రీపతివల్ల నాకెంతో శ్రమా తప్పింది. ఆదాయమూ పెరిగింది. ఇదంతా ఏడుకొండల స్వామి మహాత్తుగా భావిస్తున్నాము మహానుభావా! .

తొండమానుడు : భీమన్నా! శ్రీపతి మీ ఇంటికి చేరిన తర్వాత రాజభటులుకానీ, మరెవరైనా నాగరికులు గానీ ఈకుర్వపల్లెకు వచ్చారా?

భీమన్న : లేదు మహానుభావా! ఎవరూ రాలేదు. మాకు తెలిసినంత వరకూ ఎవ్వరూ ఇటురాలేదు.

**తొండమానుడు :** చాలా చిత్రంగా ఉంది. తుండీర మండల రాకుమారుడూ. సేనాపతీ, వేయిమంది రాజభటులూ, ఈ చుట్టుపట్టుల ఎక్కడైనా విడిది చేసినట్టయినా నీకు సమాచార మేదయినా తెలిసిందా?

**భీమన్న :** లేదు మహానుభావా! ఈ కుర్వగ్రామస్థులెవరికి కూడా ఆ విషయం తెలిసే తెలీదు. అసలు మేము రాజభటులను చూచి చాలా కాలమయింది. ఒక వేళ వాళ్ళు వచ్చి ఉన్నట్టయితే ఎంతో సందడిగా ఉండేది. ఇక రాకుమారుడే మా గ్రామానికి అరుగు దెంచాడంటే గ్రామస్థులా రోజు పండుగ రోజుగా భావించేవారు. అలాంటిదేమీ జరుగలేదు. ఎవరూ ఈ ఛాయలకైనా రాలేదు.

**తొండమానుడు :** నిజమా? అది నిజమా? రాకుమారుడూ, రాజభటులూ ఈ ఛాయలకైనా రాలేదా?

**భీమన్న :** నిజమే మహానుభావా? వారెవరూ ఇటురాలేదు.

**తొండమానుడు :** *(స్వగతం)* దీనిని నేను నమ్మలేక పోతున్నాను. యువరాజూ, సేనాపతీ చెప్పిన దేమిటి? కుమ్మరి భీమన్నా అతని భార్య తమాలినీ, దాసుడు శ్రీపతీ వీరు ముగ్గురూ కలిసి వేయిమందికి భోజన వసతులు, వట్టి భోజనాలు కాదు విందు భోజనాలే ఏర్పాటు చేసి అందరినీ సంతృప్తి పరచారన్నారె. అంతేనా? కుమ్మరి భీమన్ననూ, శ్రీపతినీ పట్టి బంధించబోతే ఆర్చర్యకరంగా ఎక్కడినుండో ప్రవాహంలా వచ్చిపడ్డ సైన్యం తమను తరిమి తరిమికొట్టిందన్నారు. ఇదెలా సాధ్యం! ఇదంతా వేంకటేశ్వరస్వామి వారిలీలలే.

(శ్రీపతి మందహాసంతో అక్కడికి రాగానే...)

ఎవరు నీవు? ఎందులకీ చోటికి వచ్చావు?

**శ్రీపతి :** మహానుభావా! నా విషయం నీకర్థం కాదులే. నీవర్థం చేసుకోవడానికి ఇంకా కొంతకాలం పడుతుంది. అప్పడే నేనెవరో, ఎందుకిక్కడికి వచ్చానో అవగతమవుతుంది (నవ్వును)

**తొండమానుడు :** *(శ్రీపతిని తేరపార చూస్తూండగా శ్రీపతి వెళ్ళిపోవును)* ఈ నవ్వును, ఈ ముఖాన్ని నేను చాలాసార్లు విన్నాను, కన్నాను. ఆ కళ్ళలోని కాంతిని

నేనెన్నో పర్యాయాలు చూడబోయి తట్టుకోలేక కళ్ళు మూసుకొన్నాను. ఆ ముఖంలోని వర్చస్సు అయస్కాంతం ఇనుమును ఆకర్షించుకున్నట్లు నన్ను దాపులకు లాక్కునేది. ఆ నాసలు గొప్ప వేటగాడి విల్లమ్ముల్లా నా హృదయ మృగాన్ని వేటాడేవి. ఆ దీర్ఘ కర్ణాలు సంసార ప్రవాహంలో కొట్టుకుపోయే నన్ను పడవలలోని తెడ్లులాగ నన్ను శాంతి తీరాలకు చేర్చేటివిగా కనిపించేవి. ఆ బాహువులు తూగుటూయలలా నన్ను లాలించేవి. ఔను నిజం! తన మృదు మధుర భాషణలతో, హిత వాక్కులతో అదిలించేవి, ఆదరించేవి, పాలించేవి, లాలించేవి. పసిబిడ్డను ఉయల్లోపెట్టి ఊపుతూ మధురగానంతో తల్లిలా నన్ను లాలించేవి... లాలించేవి...లాలించేవి...

(తొండమానుడలాగే స్పృహ కోల్పోవును. భీమన్న వచ్చును. తొండమానుని ముఖంపై నీళ్ళు చల్లును. శ్రీపతి అక్కడికి వచ్చును.)

**భీమన్న** : ఏమిటీ విచిత్రం! ఈ మహానుభావుడిలా తెలివి కోల్పోయినట్లు పడి ఉన్నాడేమిటి?

**శ్రీపతి** : చిత్రమే భీమన్నా అహంభావానికీ, ఆత్మవిశ్వాసానికీ వెంట్రుకవాసి తేడా మాత్రమే ఉంది. కొండ శిఖరము పక్కనే కొండలోయ ఉన్నట్లుగా అహంకార ఆత్మవిశ్వాసాలు ప్రక్క ప్రక్కనే ఒకటిగా ఉంటాయి. అహంకారం స్వార్థానికి, పతనానికీ దారితీసి లోయల్లో, పాతాళంలో పడదోస్తుంది. ఆత్మవిశ్వాసం నిస్వార్థానికీ, పరిశ్రమకూ తద్వారా ఉన్నత శిఖరాలకూ చేరుస్తుంది.

**భీమన్న** : మీరు చెపుతున్నదేమిటో నాకు బొత్తిగా అర్థం కావడం లేదు. మరోసారి చెప్పండి.

**శ్రీపతి** : ఇలాంటి అమాయకత్వమూ, మ్మినవారిపై విశ్వాసమూ కలిగి ఉండడమే నిన్ను ఉన్నత శిఖరాలపైకి చేర్చింది. భీమన్నా తొండమాను చక్రవర్తి భక్తుడేకానీ అతనిలో అహంకారం ఉంది. అలసత్వం ఉంది. వానివల్లనే అతడు చేయరాని పాపకార్యమొక దానిని చేశాడు. అలా చేసి భీతిల్లినా తన దురహంకారాన్ని మాత్రం పోగొట్టుకోలేక పోయాడు.

బంగారంతో వెంకటాద్రి వాసుని మెప్పించాలనుకున్నాడు. అనుకొన్న అర్చననైనా ఏకాగ్రచిత్తంతో చేయలేదు. భక్తి యొక్క మూల తత్వాన్ని అవగతం చేసుకోకుండా ప్రవర్తించాడు. దానికి పూర్వజన్మ కర్మఫలం కొంత కారణమైనా, ధ్యానంతో దానిని జయించలేక పోయాడు. తుదకు నిజమైన భక్తి ఎలాంటిదో గ్రహించి నీవద్దకు వచ్చాడు. నేనెవరో తెలుసుకొన్న వెంటనే మూర్ఛిల్లాడిక్కడ. అతడికి 'నన్ను' తెలుసుకోవడాని ఇంత కాలం పట్టింది. నేనెవరో గ్రహించగానే తనను తాను మరచి స్పృహ కోల్పోయాడు.

**భీమన్న** : అయితే... స్వామీ... నీవు... ?

**తమాలని** : *(అప్పడే అక్కడికి వచ్చింది)* ఓహ్! స్వామీ నీవా! వేంకటేశా! నీవు నీవేనా! ఏడుకొండలవాడా!

**భీమన్న** : *(శ్రీపతి నిజరూపం దాల్చగానే...)*

భగవాన్! ఏమిటి నీలీల! మాకనుల ముందే తిరుగుతున్న నిన్ను తెలుసుకోలేని మూర్ఖులమయ్యాము. అయ్యో స్వామీ! మాయింట ఇంతకాలం మన్ను మోశావు. మట్టి పిసికావు. మట్టితోనే బొమ్మలు చేశావు. స్వామీ ఒకటేమిటి! ఒక దాసుడులాగ మాయింట చేరి చేయరాని పనులన్నీ చేశావు. కోట్లాది మంది, ఊహూ సర్వలోకాలూ నీపాద పద్మాలను తాకడానికి కూడా సాధ్యం కాదే. అలాంటి నీవు ఈ మట్టి మనుషుల ఇంట కుసుమకోమలమైన నీ హస్తములతో మట్టి పిసికావా! స్వామీ! శ్రీనివాసా!

**తమాలిని** : దేవా! వైకుంఠవాసా! నేను వండిపెట్టిన కలోగంజో తాగావు. నేను మంతతో అందించిన అంబలి త్రాగుతూ పరమాన్నము కుడుస్తున్నట్లుగా పరమానందం పొందుతున్నట్లుగా నాకగుపించే వాడివే స్వామీ! అప్పుడైనా నిన్ను తెలుసుకోలేక పోయాను.

**భీమన్న** : భక్తులంటే నీకెంతటి ప్రేమ! సప్తగిరీశా! నిరుపేదలమైన మమ్ము కరుణించావు. అపారమైన ప్రేమాభిమానాలు చూపావు. మాకు సేవలు చేయడానికి మాయింట చేరావు. కోటానుకోట్ల ప్రజలచేత నిరంతరమూ ఆరాధింపబడే నీవు ఈపూరిపాకలో మాతోపాటు మన్ను పిసుకుతూ మనినావా? ఏమిటి స్వామీ నీలీల!

తమాలిని : ప్రభూ! తిరుమల వాసా! నాకు నోటమాట రాకున్నది. నాచేతులూ కాళ్ళూ, దేహమూ గడగడ వణికి పోతున్నాయి. నా బుద్ధీ, నా హృదయం చైతన్యం కోల్పోతున్నాయి. నీ గురించి ఏం చెప్పను దేవా! నిన్నెలా పలుకరించను మహాప్రభూ! నీవెంత గొప్పవాడివి? నీవెంత దయామయుడివి! నీదెంత కరుణార్ద్ర హృదయం! నిన్నెలా స్తుతించినా కొదవగానే ఉంటుంది. తనివి తీరదు. తిరిగి తిరిగి నిన్ను స్తుతించకుండా ఉండలేము స్వామీ! నిన్ను ఆపద మ్రొక్కుల వాడనందునా! భక్త సులభుడవందునా! ఏం పలుకను! అన్నీ నీవే! అంతా నీవే! మాయీ అదృష్ట దేవుడివి నీవే. మా మహత్తర సంపదవూ నీవే! సర్వ లోకాలలోని సంపదనంతా కుప్పపోసి మా అరచేతిలో పెట్టినా కలుగనంతటి అపరిమితానందం, అనితర సాధ్యమైనంతటి అదృష్టం మాకీనాడు లభింపజేశావు అంజనాద్రివాసా! శ్రీనివాసా!

భీమన్న : గుడిసె గోడ పగులులో దొరికిన చెక్కబొమ్మను నీవుగా, నీ ప్రతిరూపంగా భావించాము. మట్టిపూలతో పూజించిన మట్టి మనుషులము మేము స్వామీ! ఇలాంటి మట్టి మనుషులమైన మాకింతటి మహద్భాగ్యం కలిగించావా దేవా! వేంకటనాథా!

శ్రీపతి : భీమన్నా! నీవు ధన్యుడవే కాదు. నీలాంటి నిష్కల్మష భక్తుడుండడం నాకూ సంతోషదాయకమైనదే. నీ అపూర్వ భక్తి తత్పరతలతో నన్ను బాగా ఆకుట్టుకున్నావు. తొండమాన్ చక్రవర్తి వంటి వాడినే నీయింటికి రప్పించుకున్నావు. మనో వాక్కాయ కర్మలా నన్ను తలచుకొనే వారికి నేనెప్పుడూ అండగా ఉంటానన్న విషయాన్ని నీ కథ జగత్తు కంతటికీ తెలియజేస్తుంది.

భీమన్న : *(పారవశ్యంతో... దండకం...)*

శ్రీవేంకటేశా! నమో శ్రీనివాసా! నినున్ నమ్మి జీవించు మాకెపుడు మోక్షంబు కల్గింతువో స్వామీ! నీ వైభవమ్మెట్లు వర్ణింతు సప్తాద్రివాసా!

ప్రభూ!

నేకులాలుండ నిన్నెట్లు శ్లాఘింతు!

వైకుంఠమే నీ నివాసమ్ము క్షీరాంబుధీ పుత్రి లక్ష్మీ

లతా తాన్వియే నీకు పట్టంపు దేవేరి! విశ్వంబు సృష్టించు

ఆ బ్రహ్మ నీ నాభినందుండి జన్మించె!

నారాయణా! నే కులాలుండ నిన్నెట్లు స్తోత్రింతు!

లోకాలకున్ జీవనాధారమై వాని పాపాల పోగొట్టి నిష్కల్ముషులన్ జేయు గంగాంబ నీపాద పద్మమ్ములందుండియే పుట్టె స్వామీ! మహాశక్తి మంతుండనంతుండు తా మార్దవమ్మైన దేహమ్ము నీ శయ్యగా జేసె దేవా! మనోవేగ సత్త్వాతి సంపన్నుడైనట్టి నాగారి నీవాహనమ్మయ్యె! నారాయణా! నే కులాలుండ నిన్నెట్లు కీర్తింతు!

ఆకాశ మార్గాన దీపించు నక్షత్ర సంఘాతముల్ నీదు
దంతమ్ములే దేవ! సౌదామినీ మండలమ్మయ్యె నీ
దేహ ధామమ్ము, పద్మాప్త శీతాంశువుల్ నీకు నేత్రమ్ము
లైనిల్చె సప్తాద్రివాసా! ప్రభూ! వేంకటేశా!
నే కులాలుండ నిన్నెట్లు పూజించెదన్!

శ్రీపతి : *(మందహాసంతో)* చెక్కబొమ్మ నీకు లభించిన తీరు గుర్తుందా భీమన్నా *(ఆలోచనలో భీమన్న ఉండగా శ్రీపతి అతని భుజాన్ని తాకుతాడు)*

భీమన్న : గుర్తుంది స్వామీ! ఆ రోజు రాత్రి నీవు నాకు కలలో కనిపించావు. అంతకు ముందుటి వరకూ నీ రూపమేమిటో నీ మహిమలేమిటో నాకు తెలీదు. ఇటువైపు నుండి పోయే తిరుమల యాత్రికులు చెప్పేమాటల వల్లా, పాడే పాటలవల్ల దేవా! నీపై భక్తి అంకురించింది మాకు. ఏడుకొండలపైకి నడచివచ్చి నిన్ను ఈ సంసార సాగరంలో పడి దర్శించుకోలేక పోయాము కానీ నీవానాడు కలలో కనిపించావు స్వామీ! అప్పుడే నీ రూపం నాకు సుస్పష్టంగా తెలిసింది.

తమాలిని : నా మనసులో నీ రూపం లేకపోయినా అహరహమూ నన్ను అంటి పెట్టుకొన్నట్లుగా భావిస్తూ ఉండేదాన్ని నేను తిరు వేంకటనాథా!

భీమన్న : నీ రూపం కలలో ఆ రోజు తెల్లవారు జామున చూచాను. నీ పలుకులు అప్పుడే విన్నాను. నీ వప్పుడే మన్నావో చెపుతాను వేంకట ప్రభూ! 'భీమన్నా నీ అమాయక భక్తికి మెచ్చాను. నీలాంటి నిర్మల నిస్వార్థ భక్తుడుండడం చాలా అరుదు. నీకు మోక్షమార్గం చూపాలను కుంటున్నాను. ఎప్పుడైతే ఈ దేశప్రభువు నీయింటికి వస్తాడో అప్పుడు మీకు బొందితో వైకుంఠం ప్రాప్తిస్తుంది' అని శ్రీనివాసా! నీవెంత మృదు మధుర వాక్కులతో చెప్పావు నాకు!

తమాలిని : ఆ తర్వాత ఏం జరిగిందో నేను చెపుతాను స్వామీ! నాభర్త కల గురించి చెప్పగా, మాకెన్నో సందేహాలు కలిగాయి. 'కలలో స్వామి కనిపించడమేమిటి ఈదేశ చక్రవర్తి ఈపూరిపాక దగ్గరకు రావడమేమిటి? మాలాంటి వారికి బొందితో వైకుంఠ ప్రాప్తి కలగడమేమిటి' అదంతా భ్రమ వట్టికల మాత్రమే' అని నా భర్తా తలంచాడు స్వామీ!

భీమన్న : ఆ సమయాన మా భ్రమలను తొలగించడానికి నీవు నిదర్శనం చూపావు ఉన్నట్లుండి వర్షం కురిపించావు. పిడుగులు పడ్డట్టు చేశావు. ఆ పిడుగు దెబ్బకు గుడిసె కూలిపోతుందనుకున్నాము కానీ గుడిసె గోడలో దీగూడులో వగులు ఏర్పడి అందులో మాకు నీదారు ప్రతిమ లభించింది. నాకు కలలో కనిపించిన నీ ప్రతిరూపమే చందనదారు ప్రతిమలో ఉంది దేవా!

తమాలిని : నీ రూపులో ఉన్న దారు విగ్రహాన్ని దొరికిన చోటనే ఉంచి నిత్యమూ పూజించడం నీకు తెలియందికాదు దేవా!

భీమన్న : స్వామీ! మేము పుట్టుకతో కుమ్మరి వారం. మాతాత ముత్తాతల కాలం నుండీ మట్టితో కుండలు, పిడతలూ చేసుకుంటూ వాటినమ్ముకుని జీవనం సాగిస్తున్నాము. స్వామీ నీకు తులసీ దళాలన్నా పద్మాలన్నా

మహాప్రీతికరం. మట్టితో తులసీ దళాలు పద్మాలు చేసి, నీపూజకు ఉపయోగించడం, నీకు బాధాకరమయిందా! నీవు నాకందులో సహాయం చేస్తుండే వాడివి...

శ్రీపతి : భీమన్నా! నీవృత్తి ధర్మాన్ని విడవలేదు నీవు. ఎవరైనా వేనితో పూజించారు అనేది కాదు ముఖ్యం ఎలా కొలిచారు అనేదే ముఖ్యమైనది. నీవు మట్టిపూలతో నన్ను పూజించినందుకు తగిన వరాన్ని ప్రసాదిస్తున్నాను. భీమన్నా! జాగ్రత్తగా విను. తిరుమలలో పూజారులు నాకర్పించే నైవేద్యాలకూ, అన్న ప్రసాదాలకూ మట్టి కుండలే ఉపయోగించాలనే నియమం విధిస్తున్నాను. ఆ మట్టి పాత్రలు కూడా నీ వారసులు మాత్రమే తయారు చేసినవై ఉండాలి. దేవాలయ అర్చకులు, అలా నీ వారసులు చేసిన మట్టి పాత్రలను ఉపయోగించి సమర్పించిన నైవేద్యమే నాకు సంతృప్తి నిస్తుంది.

భీమన్న : మహా ప్రసాదం స్వామీ! ఆ చంద్ర తారార్కమూ నీ దేవాలయ అర్చకులు మమ్మల్ని గుర్తు పెట్టుకొనేటట్లు చేశావు. నీ వరంతో మేమూ, మాకులమూ ధన్యమైంది దేవా!

తమాలిని : స్వామీ! మా వంశాన్ని ఉద్ధరించావు. కానీ నాకు...

శ్రీపతి : తమాలినీ నీ సందేహం తెలుసు. నీవు తల్లిలాగ నన్నాదరించావు. నీ చల్లని చేతులతో నాకాహారం పెట్టావు. నా ఆకలి ఎప్పటికప్పుడు తీరుస్తూ వచ్చావు. నీ భర్తతలలో నాలుకలా మెలిగావు. నీ సహకారమే లేకపోతే భీమన్న, నిత్యం నిరాటంకంగా నన్ను కొలువగలిగే వాడా! నీ జన్మ ధన్యమైంది. నీ భర్తతో పాటూ నీకూ బొందితో వైకుంఠం సంప్రాప్తిస్తుంది.

*(ఇంతలో స్వర్ణ విమానం భీమన్న ఇంటి ముందు వాలుతుంది. శ్రీపతి అదృశ్యమవుతాడు.)*

**భీమన్న, తమాలినీ :** ఏడుకొండల వాడా! వేంకటేశా! వైకుంఠవాసా! మేము ధన్యులం, మహాధన్యులం. నిన్ను మనసా వాచాకర్మణా సర్వవేళలా తలంచుకున్నందుకు మాకు మోక్షం కలిగిస్తున్నావు. అందునా సర్వోత్కృష్టమైన మోక్ష ప్రాప్తి కలిగిస్తున్నావు. ఎంతమందికి సశరీరంగా వైకుంఠ ప్రాప్తి కలుగుతుంది స్వామీ! ఎంతటి మహద్భాగ్యాన్ని కలిగిస్తున్నావు మాకు!

*(సన్నగాపాట, విమానశబ్దం మధ్యలో వినిపించును. ఆ సుమధుర సంగీతం వినిలేచి కూచుంటాడు తొండమానుడు. చుట్టూ ఎవరూ కనిపించరు)*

**తొండమానుడు :** స్వామీ! శ్రీనివాసా! నాకింత వరకూ దృశ్యాదృశ్యంగా కనిపించిందీ వినిపించిందీ అంతా కలా! మాయా! ఎట్టఎదుట ఉన్న నిన్ను నేను కనుగొనలేకపోయాను. నేను గ్రహించే లోపలే నాకు స్పృహతప్పింది. నీవే! వేంకటేశా ఉద్దేశ పూర్వకంగా నన్ను అపస్మారక స్థితిలోకి నెట్టావు. అయినా పూర్వపుణ్యం వల్లనేమో ఆ కులాల దంపతులకు నీవు సశరీరంగా మోక్షప్రాప్తి కలిగించడం నాకు కలగా తెలుస్తూనే ఉంది స్వామీ! నిష్కల్మష హృదయుడు పేదవాడైనా చక్రవర్తికంటే గొప్పవాడని సర్వ జగత్తుకూ చాటడానికే నీనిలా చేశావు. నాతప్పు నేను తెలుసుకున్నాను. ఆ దంపతులను చూచే భక్తి తత్వాన్ని గ్రహించాను. ఇక నాకీ రాజ్యమెందుకు? పరిపాలన ఎందుకు? తుండీర రాజ్యాన్ని నా కుమారుడు పాలించుకుంటాడులే. నేను సర్వసంగ పరిత్యాగినవుతున్నాను. నీవే నాకేడుగడవు. నీ కొండమీదికే నేను వస్తున్నాను. నీ ఆలయ సన్నిధిలోనే నా శేష జీవితాన్ని గడుపుతాను శేషాద్రివాసా! నీకెప్పుడు నా మీద దయ కలుగుతుందో అంతా నీ ఇష్టం! ఇదో నీ కొండకు కాలినడకన వస్తున్నాను స్వామీ! దేవాధిదేవా!

నమో వేంకటేశా! నమోనమః!

*(తెరవెనుక నుండి........ మంగళమ్ వినిపించును)*

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయే ర్థినామ్
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళం
మంగళాశాసన పరైర్మదాచార్య పురోగమైః
సర్వైశ్చ పూర్వైరాచార్యైః సత్కృతాయాస్తు మంగళం

*(తెరవెనుకనే సన్నగా అన్నమాచార్య కీర్తన)*

*నానాటి బదుకు - నాటకము*
*కానక కన్నది . - కైవల్యము ॥నానా॥*

*పుట్టుటయు నిజము - పోవుటయు నిజము*
*నట్ట నడిమి పని - నాటకము*
*యెట్ట నెదుటగల - దీ ప్రపంచము*
*కట్ట కడపటిది - కైవల్యము ॥నానా॥*

*కుడిచే దన్నము - కోక చుట్టెడిది*
*నడమంత్రపు పని - నాటకము*
*వొడిగట్టుకొనిన - వుభయ కర్మములు*
*గడిదాటినపుడే - కైవల్యము ॥నానా॥*

*తెగదు పాపము - తీరదు పుణ్యము*
*నగినగి కాలము - నాటకము*
*యెగువనె శ్రీవేంక - టేశ్వరు డేలిక*
*గగనము మీదిది - కైవల్యము ॥నానా॥*











నీహారిక ప్రదీప్తి ఆదిలక్ష్మి లోకేశ్‌మణికంఠ

శ్రీ అల్లీ రామకృష్ణ వృత్తిరీత్యా ఉపాధ్యాయులు. పసి మనసులకు సూక్ష్మమైన విషయాలను సుబోధకం చేయడం అలా అలవోకగా వారికి అబ్బింది. ప్రవృత్తి అయిన రచనా వ్యాసంగానికి కూడా ఆ తావి అలానే హత్తుకు పోయినట్లు - వీరి మునుపటి రచనలు 'హరిహరసుత శతకము' 'వినాయక కథాకదంబము' (వినాయకుడి కథలు) ద్వారా సుస్పష్టమైంది.

కులాలుడైన భీమన్నకు దైవకృపతో అబ్బిన భగవన్నామ స్మరణ, పటాటోపం లేని సంలగ్నత శ్రీనివాసునికి ప్రీతిపాత్రం చేశాయి. అహంభావానికి, ఆత్మవిశ్వాసానికి ఉన్న వెంట్రుకవాసి తేడా, కొండ శిఖరము ప్రక్కనే లోయ ఉన్నదృష్టాంతంతో చెబుతూ అహంకారం - స్వార్థానికి, పతనానికి దారితీస్తే - ఆత్మవిశ్వాసం నిస్వార్థానికి, పరిశ్రమకూ, తద్వారా ఉన్నత శిఖరాలకు చేరుస్తుందన్న నికషోఫలం పండిత పామరులకు నారికేళములో సలిలము చేరినట్లు ఒప్పినరీతి ఈ నాటక రచన ఒప్పారింది.

రచనగా చదివి, నాటకంగా దర్శించి ఆనందింతురుగాక!

- ఏ. మల్లేశ్వరరావు, M.A. DJ.
ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్,
ఆకాశవాణి, తిరుపతి - 517 501